సోమదేవభట్టు

# కథాసరిత్సాగరం

అనువాదం
**విద్వాన్ విశ్వం**

ప్రచురణ:
తిరుమల తిరుపతి
దేవస్థానములు, తిరుపతి

ఆరవ పంపుటము





సోమదేవభట్టు

# కథాసరిత్సాగరం



అనువాదం :

## డా॥ విద్వాన్ విశ్వం






ఆరవ సంపుటము

ప్రచురణ :

శ్రీ జి. కుమారస్వామి రెడ్డి, ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1984

KATHĀSARITSĀGARAM

by

Dr. VIDVAN VISWAM



T. T. D. Religious Publications Series No. 130

Copies : 2000



Cover : Sri BAPU

*Published by :*

Sri G. KUMARASWAMY REDDY, I. A. S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
TIRUPATI-517 501.

*Printed at :*

Tirumala Tirupati Devasthanams Press,
TIRUPATI.

# మనవి

భారతదేశం కథలకు పుట్టినిల్లు. ప్రతిదీ కథలద్వారా చెప్పడం మనవారి అలవాటు. అద్భుత కథలు, సాహస గాథలు, శృంగార కథలు, ధర్మనీతి ప్రబోధకాలైన ఉపాఖ్యానాలు మన ప్రాచీన సాహిత్యంలో కొల్లలుగా కనబడ తాయి. జానపద వాఙ్మయంలో ఇతర రసవత్తర కావ్య నాటకాదు లెన్నింటికో ముడిసరుకు కానవస్తుంది. ప్రతి ముసలమ్మ కథా రచయిత్రి. వ్రాతలో కాక ఊకుడు కథలుగా పిల్లలకు వా రెన్నెన్ని విధాల చెప్ప వీలున్నదో అన్ని రూపాల లోను చెప్తూ వస్తున్నారు. ఈ సంప్రదాయం ఇప్పుడిప్పుడే సన్నగిల్లిపోతున్నది.

పాశ్చాత్య సాహిత్య సంపర్కంతో కథ, కథానిక, గల్పిక క్రొత్త రూపంతో నేడు మన సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్నవి.

మనకు తెలిసినంతలో లౌకిక సాహిత్యంలో గుణాఢ్యుని 'బృహత్కథ' భారతీయ ప్రాచీన కథానిధిగా అవతరించినది. పైశాచీ భాషలోని ఈ గ్రంథం అంతరించిపోయినా, దాని సంస్కృతానువాదమైన 'కథాసరిత్సాగరం' ద్వారా సోమదేవభట్టు దానిని మనకు అందించినాడు. దీనిని తిరుమల తిరుపతి దేవస్థానం ప్రధాన సంపాదకుడు డా॥ విద్వాన్ విశ్వంగారు శిష్టవ్యావహారికంలో మూలాను రోధంగా, నుడికారం చెడకుండా తెలుగులో అనువదించినారు. దీనిని పన్నెండు సంపుటాలుగా తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రచురించడానికి నిశ్చయించు కున్న విషయం తెలుగు పాఠకులకు తెలుసు.

చర్వితచర్వణం కాకుండా కథాసరిత్సాగరానికి చెందిన కవి కాలాదులను ఇతర వివరాలను తిరిగీ ఇక్కడ పునరావృత్తం కాకుండా ఈ నాలుగు మాటలతో ఈ ప్రస్తావన ముగిస్తున్నాను. మొదటి సంపుటంలోనే అనువాదకులు ఈ వివరా లన్నింటిని చెప్పే ఉన్నారు.

కథాసరిత్సాగరం మొదటి రెండు సంపుటాలు ముందే వెలువడినవి. తరు వాత తిరుమల తిరుపతి దేవస్థానం స్వర్ణోత్సవాల సందర్భంగా గౌరవనీయులైన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి తారక రామారావుగారు మూడు, నాలుగు, ఐదు

సంపుటాలను విడుదల చేసినారు. ఇప్పుడు ఈ ఆరవ సంపుటాన్ని ప్రచురించి పాఠకులకు అందించగలుగుతున్నందుకు ఆనందిస్తున్నాము.

ఈ సంపుటంలో మొదటివానిలోలాగే అనేక కథలు చోటుచేసుకొన్న వనడం పునరుక్తి దోషదుష్టం కాదని భావిస్తున్నాము. వెనువెంబడినే మిగత సంపుటాలను సహృదయుల ముందు ఉంచగలమని విశ్వసిస్తున్నాము. వ్రాతపని ఎప్పుడో ముగిసినా ముద్రణ ప్రచురణలకు కొంత వ్యవధి అవసరం కాక తప్పదు కదా!

మన సంస్కృతీ సంప్రదాయ పరిరక్షణకై దేవస్థానంవారు చేస్తున్న కృషికి పాఠకుల అండదండలు ఉంటూనే ఉన్నవి. ఇక ముందుకూడ ఉండగలవని నమ్ముతున్నాము. ఈ మా ప్రయత్నంలో తగిన సహాయ సహకారాలు అందిస్తున్న వారందరికీ కృతజ్ఞత తెలపడం మా విధిగా భావిస్తున్నాము.

జి. కుమారస్వామిరెడ్డి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

తిరుపతి,
జూలై 30, 1984.

# ఒకమాట

నా కథాసరిత్సాగరం తెనుగు అనువాదం గురించి మొదటి సంపుటంలోనే కావలసినంత సమాచారాన్ని అందించినాను. మొదటి ఐదు సంపుటాలు ఇప్పటికే పాఠకుల ముందున్నవి.

ఇది ఆరవ సంపుటం. ఇందులో అలంకారవతీ లంబకం అనూదితమైనది. పదునెనిమిది లంబకాలుగా, ఇరవై రెండు వేల శ్లోకాలకు విస్తరించిన కథాసరిత్సాగరంలోని తొమ్మిదవ అలంకారవతీ లంబకం ఇది. మొదటి సంపుటాలలోలాగే ఇందులోనూ ఎన్నెన్ని కథలో చోటు చేసుకొన్నవి. ఈ సంపుటం మీ ముందుండగా వానిని గూర్చి చెప్పడం అగత్య మనుకోవడం లేదు.

భారత ప్రాచీన సాహిత్యంలోని కావ్యాలకు, నాటకాలకు మూలమైన ఎన్ని కథలో గుదిగుచ్చిన ఉద్గ్రంథమిది. దీనిలోని కథలకు, ఇతరత్రా కనిపించే ఇవే కథలకు ఉన్న కొన్ని రూపభేదాలు విజ్ఞులైన పాఠకులు సులువుగానే గ్రహింపగల రనుకుంటాను.

'నామూలం లిఖ్యతే కించిత్, నానపేక్షిత ముచ్యతే' అన్న పద్ధతిలోనే నా ఇతరానువాదాలవలెనే దీనిని కూడ కొనసాగించినాను. ఈ సంగతి ముందే విన్నవించుకొని ఉన్నాను.

తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ.ఏ.ఎస్. గారి సహాయసహకారాలవల్ల ఈ మహాప్రయత్నం కొనసాగుతున్నది. వారికి నేను సర్వదా కృతజ్ఞుడను. ముద్రణ ప్రచురణాదులలో అత్యంత శ్రద్ధ వహిస్తున్న ఇతర మిత్రు లందరికీ నేనెంతో ఋణపడి ఉన్నాను.

**30-7-1984** —విశ్వం

# విషయ సూచిక

## 9. అలంకారవతీ లంబకం

### ప్రథమ తరంగం



### ద్వితీయ తరంగం



### తృతీయ తరంగం



### చతుర్థ తరంగం

# 9. అలంకారవతీ లంబకం

ఇదం గురు గిరీంద్రజా
ప్రణయ మందరాందోలనాత్
పురా కిల కథామృతం
హరముఖాంబుధే రుద్గతం
ప్రసహ్య సరయంతి యే
విగతవిఘ్న లబ్ధర్ధయో
ధురం దధతి వైబుధం
భువి భవప్రసాదేన తే.

పూర్వం పార్వతీ ప్రణయ మందర మథనంతో హర ముఖాబ్ధినుండి ఈ కథామృతం ఆవిష్కృతమైనది. పట్టుదలతో ఈ సుధను పానం చేసేవారు శివానుగ్రహం వల్ల నిర్విఘ్న సిద్ధులను పొంది దివ్యపదమును చేరగలరు.

# ప్రథమ తరంగం

నిశంభుని భారంవల్ల అణగిపోయిన భూమి, వంగిపోయిన పర్వతాలు, నృత్యం చేస్తున్న ఏ వినాయకునికి నమస్కరిస్తున్నట్టున్నవో ఆయనకు నమస్కరిస్తున్నాను.

ఈ విధంగా వత్సేశ్వర కుమారుడు కౌశాంబిలో పితృభవనంలో దూరంనుంచే విద్యాధరేశులు ప్రణమిల్లుతుండగా నివసిస్తున్నాడు. ఆ నరవాహనదత్తుడు ఒకానొకప్పుడు వేటకు వెళ్ళినాడు. అక్కడ సైన్యానికి దూరమై గోముఖుడు మాత్రమే తోడురాగా మహారణ్యంలో ప్రవేశించినాడు.

అతనక్కడ తనకుడికన్నదరి ఏదో శుభం కలుగునని సూచిస్తుండగా దివ్యవీణారవంతో కలిసిన ఒక గీతాలాపాన్ని విన్నాడు. ఆ పాట వినవస్తున్న దారినిబట్టి వెళ్ళి సమీపంలోనే స్వయంభువైన శివుని ఆలయాన్ని చూచి గుఱ్ఱాన్ని దిగి లోన ప్రవేశించినాడు.

అక్కడ దేవేశునికి వీణావాదనం వినిపిస్తూ ఉన్న ఒక దేవకన్యకను చూచినాడు. ఆమె చుట్టూ అనేక వరకన్యలు కూర్చొని ఉన్నారు. కాంతి నిర్ఝరాన్ని ప్రసరిస్తున్న ఆమెను చూడగానే అతని హృదయం చంద్రబింబాన్ని చూచిన సముద్రంవలె వెంటనే సంక్షుబ్ధమైనది. ఆమె కూడా సరసస్నిగ్ధముగ్ధమైన చూపులతో చూచి తన వీణావాదనంలో స్వరాలను మఱచిపోయి అతనియందే మనసిడినది.

నరవాహనదత్తుని మనసెరిగిన గోముఖుడు ఆమె సఖులను "ఈమె ఎవరు? ఎవరి కూతురు?" అని అడుగుతుండగానే ఆమె లాగే ఉన్న హేమారుణప్రభ అయిన ఒక ప్రౌఢవిద్యాధరి ఆకసం నుంచి అవతరించినది. ఆమె వెళ్ళి ఆ కన్యక పార్శ్వంలో కూర్చున్నది. ఆ కన్యకూడాలేచి ఆమె పాదాలకు నమస్కరించినది. అప్పుడా ప్రౌఢ "సర్వ విద్యాధరాధీశుడైన పతిని నిర్విఘ్నంగా పొందుదువు గాక" అని ఆశీర్వదించినది.

నరవాహనదత్తుడు కూడా ఆమెవద్దకు వెళ్ళి నమస్కరించి దీవనలు పొంది, ఆ సౌమ్యురాలైన విద్యాధరిని మెల్లగా ఇట్లడిగినాడు: "అమ్మా! ఈ కన్యక ఎవరు? నీ కేమౌతుంది?"

ఆ తర్వాత విద్యాధరి అతనితో చెప్తాను వినుమని ఇట్లన్నది:

## అలంకారవతి కథ

హిమాలయ పర్వతంలో సుందరపురమనే ఒక పట్టణం కలదు. అక్కడ అలంకారశీలుడనే విద్యాధరేశ్వరు డున్నాడు. ఆ ఉదారగుణునకు కాంచనప్రభ అను పట్టమహిషి కలదు. వారిద్దరకూ కాలక్రమేణా ఒక కుమారుడు కలిగినాడు. కలలో కనబడిన పార్వతీదేవి ధర్మపరుడు కాగలడని వానినిగూర్చి చెప్పగా తండ్రి ధర్మశీలుడని వానికి నామకరణం చేసినాడు. క్రమంగా యౌవనం వచ్చిన ఆ ధర్మశీలునికి విద్యాదులలో శిక్షణ ఇప్పించి యౌవరాజ్యాభిషేకం చేసినాడు. యౌవరాజ్యస్థుడైన ధర్మశీలుడు ధర్మైకరతుడై తండ్రికంటే ప్రజలను ఎక్కువ రంజింపజేసినాడు.

ఆ తర్వాత అలంకారశీలుని రాణి కాంచనప్రభ గర్భం తాల్చి ఒక కూతును కన్నది. ఆ సమయంలో ఈమె నరవాహన విద్యాధర చక్రవర్తికి భార్య కాగలదని దివ్యవాణి వినవచ్చినది.

ఆ అమ్మాయికి అలంకారవతి అని తలిదండ్రులు నామ కరణం చేసినారు. శశికళవలె ఆమె పెరుగుతూ వచ్చినది. కాల క్రమంగా యౌవనవతి అయి తండ్రినుంచి సకలవిద్యలనూ నేర్చు కొన్నది. అప్పటినుంచి భక్తితో శివాలయాలచుట్టూ తిరుగ నారం భించినది.

ఆ అమ్మాయి అన్న యువకుడైనా ప్రశాంతుడై ఏకాంతంగా తనతండ్రి అలంకారశీలునికి ఇట్లా విజ్ఞాపనం చేసినాడు :

"ఈ క్షణభంగురాలైన భోగాలపై నాకు ప్రేమ లేదు. తుదకు విరసానికి దారితీసే సంసారంలో ఏమున్నది? వ్యాసముని వచించిన మాటలు మీరు వినలేదా? సంపదలన్నీ తుదకు క్షయ మయ్యేవే. సమున్నతి చెందడమంతా పతనం చెందడానికే. సంయోగాలన్నీ వియోగాన్తాలే. జీవితం తుదకు మరణంతో అంత మయ్యేదే. కాబట్టి ఈ అశాశ్వతాలైన వానిలో మనస్వులకు అనురక్తి ఎందుకుంటుంది?

తుదకు వెళ్ళిపోయేటప్పుడు భోగాలుకానీ, అర్థసంచయాలు కానీ తోడురావు. ఒక్క ధర్మం మాత్రమే అడుగడుగునా విడవ కుండా అంటి ఉంటుంది. కాబట్టి నేను అడవులకుపోయి ఉత్తమ మైన తపస్సు చేసుకుంటాను. తద్ద్వారా శాశ్వతమైన పరమ పదాన్ని పొందుతాను.''

ఈ విధంగా చెప్తున్న కొడుకు ధర్మశీలుని చూచి సమా కులుడై రాజు అలంకారశీలుడు కన్నీరు విడుస్తూ ఇలా అన్నాడు: "నీవింకా బాలుడవు. ఈ అకాలంలో మతిభ్రమణ మేమిటి? తారు ణ్యాన్ని ఉపభోగించిన తర్వాతనే ప్రశాంతి అని పెద్దలు చెప్తారు. పెళ్ళిచేసుకొని నీవు రాజ్యాన్ని పరిపాలిస్తూ భోగాలను అనుభ వించవలిసిన కాల మిది. ఇది వైరాగ్యానికి కాలం కాదు."

ఆ విధంగా చెప్పిన తండ్రి మాట విని ధర్మశీలుడు తిరిగీ అన్నాడు :

"శమాశమములకు వయసుతో నిమిత్తం లేదు. ఈశ్వరానుగ్రహం ఉంటే ఒకానొక బాలుడైనా శాంతిని పొందవచ్చును. అదే కాపురుషుడైతే వృద్ధుడైనా శమాన్ని పొందలేడు. నాకు రాజ్యంమీదరక్తి లేదు. భార్యా పరిగ్రహణం మీదకూడా అనురక్తి లేదు. నా జీవితానికి ఫలం శివారాధనం. అదే నా తపస్సు."

ఈ విధంగా మాట్లాడుతున్న కొడుకును ఎంతప్రయత్నించీ నివారింపలేక తండ్రి అలంకారశీలుడు అశ్రుపూర్ణలోచనుడై తిరిగీ ఇట్లన్నాడు: "కుమారా! యువకుడవైనా నీకు ఇలాంటి వైరాగ్యం కలిగినదంటే వృద్ధుడైన నాకుమాత్రం ఈ భోగాసక్తి ఎందుకు? నేనుకూడా అడవులకు పోతాను" అని చెప్పి భూలోకానికి వెళ్ళినాడు.

ఆ రాజు బ్రాహ్మణులకు, దరిద్రులకు రత్నాలు కాంచనాదులు విశేషంగా దానం చేసినాడు. తిరిగీ తన పట్టణానికి వచ్చి తన రాణి కాంచనప్రభతో ఇట్లన్నాడు :

"నా ఆజ్ఞతో నీవు ఈ నగరంలోనే ఉండవలసింది. కుమార్తె అలంకారవతిని రక్షించవలసింది. ఇంకొక సంవత్సరం తర్వాత ఇదే రోజున ఆమెకు వివాహానికి తగిన శుభముహూర్తం ఒనగూడుతుంది. అప్పుడు నరవాహనదత్తునకు ఇచ్చి మన అమ్మాయిని, నేను వచ్చి వివాహం చేస్తాను. విద్యాధర చక్రవర్తి అయిన మన అల్లుడు మన పట్టణాన్నికూడా పరిపాలిస్తాడు'' అని చెప్పినాడు.

అలాగేనని ఆమె శపథం చేయగా భార్యనువీడి ఆమె కుమార్తెతోపాటు విలపిస్తుండగా, కొడుకులతోపాటు రాజు వనానికి వెళ్ళిపోయినాడు.

రాణి కాంచనప్రభ తన పట్టణంలో కుమార్తెతోకూడా ఉండి పోయినది. సాధ్వి అయిన స్త్రీ పతిఆజ్ఞ నెలా ఉల్లంఘించగలదు?

కుమార్తె అలంకారవతి ప్రేమతో తనతో రాగా, కాంచన ప్రభ ఎన్నో దేవాలయాలను సందర్శిస్తూ వచ్చినది.

ఒకసారి ప్రజ్ఞప్తి అను పేరుగల విద్యాధరి ఆమెతో అన్నది: "కాశ్మీరదేశంలో స్వయంభూ క్షేత్రాలు అనేకం ఉన్నవి. అక్కడికి వెళ్ళి ఈశ్వరుని అర్చించవలసింది. ఆ తర్వాత సర్వ విద్యాధర చక్రవర్తి అయిన నరవాహనదత్తుని నిర్విఘ్నంగా పతిగా పడయగలవు."

అలా ఆ విద్య చెప్పగా తల్లితోపాటూ అలంకారవతి కాశ్మీరానికి వెళ్ళి పుణ్యక్షేత్రాలలో శంభుని పూజించినది. నందిక్షేత్రం మహాదేవగిరిలోని క్షేత్రం, అమరపర్వతంలోను, సురేశ్వరాది పర్వతాలలోను, విజయంలోను, కపటేశ్వరంలోనూ, ఇలా అనేక క్షేత్రాలలో గిరిజాపతిని అర్చించి ఆ విద్యాధరేంద్ర కన్యక, ఆమె తల్లి తమ ఇంటికి తిరిగివచ్చినారు.''

అని చెప్పి ఆమె నరేంద్రదత్తునితో ఇంకా ఇలా అన్నది.

"—ఆ అలంకారవతే ఈ కన్య. ఆమె తల్లి కాంచనప్రభనే నేను. ఇప్పుడు నాకు చెప్పకనే ఈమె ఈ శివాలయానికి వచ్చినది. ఈ సంగతిని ప్రజ్ఞప్తి విద్య చెప్పగా విని నేనిక్కడికి వచ్చినాను. నేను వచ్చేసరికి నీవుకూడా ఇక్కడికి వచ్చినావు. కాబట్టి దేవతాదిష్ట అయిన నా కుమార్తెను పరిగ్రహించవలసింది. రేపే ఈమె తండ్రి చెప్పిన, ఈ అమ్మాయి వివాహ దినం. కాబట్టి ఇప్పుడు నీవు నీ రాజధాని కౌశాంబికే వెళ్ళవలసింది. మేము

కూడా అక్కడినుంచి వెళ్ళిపోతాము. రాజు అలంకారశీలుడు తపోవనంనుంచి రేపు ఉదయమే వచ్చి స్వయంగా ఈమెను మీకు ఇవ్వగలడు.''

ఈ మాట వినగానే ఈ అలంకారవతికి ఆ నరవాహనదత్తునకూ ఒక అవర్ణ్యమైన అవస్థ కలిగినది. ఆ ఒక్కరాత్రికూడా పరస్పరం వారు వియోగాన్ని సహించే స్థితిలో లేరు. దినాంతం కాగానే చక్రవాకాలవలె వారు కన్నీరు పెట్టుకున్నారు.

ఆ విధంగా ఉన్నవారిని చూచి కాంచనప్రభ ఇట్లన్నది: ''ఇదేమిటి? ఒకరాత్రి వేర్పడడానికే మీ రింత అధైర్యపడుతున్నారు? ధీరులైనవారు నిరవధికంగా చిరకాల విరహాన్ని సహించగలరు. సీతారాముల కథను చెప్తాను వినండి:

## సీతారామ కథ *

అయోధ్యాధిపతి అయిన దశరథమహారాజు కుమారుడు రాముడు. భరత శత్రుఘ్న లక్ష్మణులకు ఆయన అగ్రజుడు. రావణ సంహారార్థం విష్ణుమూర్తి అంశలో పుట్టిన అవతార పురుషుడు. జనక మహారాజు కూతురు సీత ఆయనకు ప్రాణప్రదురాలైన భార్య అయినది.

విధి నియోగంవల్ల తండ్రి భరతునికి రాజ్యం అప్పగించి సీతాలక్ష్మణులతో పాటు రాముని అడవులకు పంపినాడు. అక్కడ రావణాసురుడు సీతాదేవిని మాయతో అపహరించినాడు. దారిలో జటాయువు ఎదుర్కొనగా పడగొట్టి సీతను లంకాపట్టణానికి తీసుకొని పోయినాడు.

* వాల్మీకానికి ఈ కథకు కొన్ని భేదాలున్నాయి.

ఆ తర్వాత రాముడు విరహ పీడితుడై వాలిని వధించి, సుగ్రీవుని మిత్రునిగా చేసుకొని ఆంజనేయుని పంపి ఆమె విషయం తెలుసుకొన్నాడు. సాగరతీరానికి వెళ్ళి సేతువును కట్టి లంకనుచేరి రావణుని సంహరించి, ఆ రాజ్యాన్ని విభీషణునకు అప్పగించి, సీతను తిరిగి కొనివచ్చినాడు. వనవాసంనుంచి తిరిగి వచ్చిన తర్వాత భరతుడు తిరిగి అర్పించిన రాజ్యాన్ని పాలనం చేస్తూ ఉండగా సీత గర్భం ధరించినది.

ఇలా ఉండగా ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనుటకై గుప్తంగా పట్టణంలో తిరుగుతుండగా రామున కొకడు కన్పించినాడు. తన భార్యను ఇంటినుంచి వెళ్ళగొట్టి, ఇంకొకరి ఇంటికి వెళ్ళిన దన్న దోషాన్ని ఆ పురుషుడు భార్యపై ఆపాదించినాడు.

అప్పుడా గృహిణి "రాక్షసుని గృహంలో ఎన్నాళ్ళో ఉండిన సీతను రాముడు విడనాడలేదు. నేనేదో దాయాదుల ఇంటికివెళ్ళి వచ్చితినని నన్ను వదలివేస్తున్నా నంటున్న నీవు రామునికంటే గొప్పవాడవా ?" అని తన భర్తతో అంటున్నది. రాజు రామభద్రుడు ఆ మాటలు విని ఖిన్నుడై అంతఃపురానికి వెళ్ళిపోయినాడు.

లోకాపవాదానికి భయపడి సీతను అరణ్యంలో వదలిపెట్టినాడు. యశస్వి అయినవాడు విరహక్లేశాన్నైనా సహిస్తాడు కానీ అపయశస్సును సహింపలేడు. గర్భాలస అయిన ఆమె దైవానుగ్రహంవల్ల వాల్మీకి ఆశ్రమాన్ని చేరుకొన్నది. ఆ మహర్షి ఓదార్పుగా అక్కడనే నివసించసాగినది.

అంతట ఆశ్రమంలో ఉన్న మునులందరూ చేరి తమలో తామిట్లా అనుకున్నారు:

"ఈ సీతాదేవిలో ఏదో దోషం ఉండే ఉండాలి. కాకపోతే ఈమెను భర్త ఎందుకు వదలిపెడతాడు? మన మీమెను రోజూ చూస్తున్నందువల్ల ఆ పాపం మనకు సంక్రమిస్తుంది. జాలితో వాల్మీకి, ఆశ్రమంనుంచి ఈమెను వెళ్ళగొట్టడు. ఈమె దర్శనం వల్ల కలిగే పాపం తపస్సుద్వారా ఆయన కడిగివేసుకోగలడు. కాబట్టి మనం ఇంకొక ఆశ్రమానికి వెళ్ళిపోదాము."

ఈ సంగతి తెలిసి వారితో వాల్మీకి ఇట్లన్నాడు:

"మీకేమీ అనుమానం అక్కరలేదు. ఈమె పరిశుద్ధురాలు. నేను ఈ సంగతిని దివ్యదృష్టివల్ల కనుగొన్నాను."

అయినప్పటికీ వారికి విశ్వాసం కలుగకపోగా సీత ఇట్లన్నది: "మహర్షులారా! మీకు తోచిన విధంగా నన్ను పరీక్షించండి. అపరిశుద్ధురాలనైతే నా శిరశ్ఛేదం చెయ్యండి."

ఆ మాట విని కరుణ గలిగి ఆ మునులిట్లా అన్నారు: "అమ్మా! ఇక్కడ మహారణ్యంలో టిటిభ సరస్సు అను పేరుగల ఒక తీర్థం ఉన్నది. పూర్వం టిటిభి అనే ఒకామె కలదు. ఆమె అన్యాసక్త అని భర్త అనుమానించినాడు. అన్యాయంగా ఆమెను అలా దూషింపగా ఆమె నిరాశ్రయురాలై భూదేవిని లోకపాలురను తన పరిశుద్ధతను నిరూపించుకొనుటకై ప్రార్థించినది. ఆ విధంగా ఆ సరస్సు ఏర్పడినది. ఆమెవలెనే రాఘవపత్ని కూడా అలాగే తన పవిత్రతను నిరూపించుకొను గాక" అని ఆ మునులన్నారు. అలా అంటున్నవారితో పాటూ జానకి ఆ సరస్సువద్దకు వెళ్ళినది.

"ఆర్యపుత్రునియందు తప్ప ఇంకొకరిపై కలలోకూడా నా మనస్సు వెళ్ళలేదు. కాబట్టి అమ్మా! వసుంధరా! ఈ సరస్సు

అంతం నేను చూచివస్తాను'' అని అంటూనే ఆసరస్సులో దిగగా భూదేవి అందులోనుంచి ఆవిర్భవించి ఆమెను తన తొడపై కూర్చుండబెట్టుకొని అవతలి గట్టునకు కొనిపోయినది.

ఆ తర్వాత ఆమె మహాసాధ్వి అని అఖిల మునులూ ప్రణమిల్లినారు. ఇలాంటి సాధ్విని వదిలిపెట్టినాడే అన్న కోపంతో రాముని శపించడానికికూడా అభిలషించినారు.

అప్పుడామె : "మీరు ఆర్యపుత్రునకు అమంగళాన్ని కల్గింపకూడదు. పాపిష్ఠురాలైన నన్నే శపించాలి" అని అంజలి ఘటించి ఆ మునులను ప్రార్థించినది. ఈ విధంగా ఆ పతివ్రత అయిన సీత తమను వారింపగా సంతుష్టులైన మునులు ఆమెను ''పుత్రప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించినారు.

ఆ తర్వాత అక్కడే నివసిస్తూ పుత్రుని ప్రసవించినది. వానికి వాల్మీకి మహాముని లవుడు అని పేరుపెట్టినాడు.

ఒకసారి ఆమె ఆ బాలునెత్తుకొని స్నానార్థమై వెళ్ళినది. ఆ సమయంలో ఆమె కుటీరం శూన్యంగా కనపడగా ఆ ముని ఇలా తలపోసుకొన్నాడు: ''మామూలుగా పిల్లవాని నిక్కడే వదలి ఆమె స్నానానికి వెళుతుంది. మరి ఆ అర్భకు డేడీ? బహుశా ఏ క్రూరమృగమో ఎత్తుకొని పోయిఉండవచ్చును. కాబట్టి నేను మరొక బాలకుని సృష్టిస్తాను. స్నానంచేసి వచ్చిన సీత పిల్లవాడు కనబడకపోతే తన ప్రాణాలను నిలుపుకొనలేదు'' అనుకున్నాడు.

అట్లా ధ్యానమగ్నుడై కుశములతో ఒక పవిత్రాన్ని (దర్భతో) చేసి అర్భకుని సృష్టించినాడు. లవుని వలెనే ఉన్న వానిని అక్కడే ఉంచినాడు.

ఈ లోగా సీతవచ్చి ఆ మునికి ఇట్లా విజ్ఞాపనం చేసినది. "బాలుడు నా వద్దనే ఉన్నాడు. ఈ మరొక బాలుడెవడు?"

ఆ మాటకు జరిగినదంతా చెప్పి ముని ఇట్లన్నాడు: "ఎలా జరగవలసిన దలా జరుగుతుంది. ఓ సాధ్వీ! వీనిని రెండవ కుమారుడుగా తీసుకొమ్ము. నా ప్రభావంవల్ల కుశములతో (దర్భలతో) వీనిని నిర్మించితిని గనుక కుశుడని పేరుపెట్టినాను." ఆ విధంగా సీతకు చెప్పి లవకుశు లిద్దరకూ సంస్కారంచేసి పెంచుతూ వచ్చినాడు.

ఆ క్షత్రకుమారకులైన బాలురిద్దరకూ వాల్మీకి మునివల్ల దివ్యమైన అస్త్రగ్రామము, సర్వవిద్యలూ లభించినవి.

ఒకసారి ఆ బాలకులు ఆ ఆశ్రమ మృగా న్నొకదానిని చంపి ఆ మాంసాన్ని తిన్నారు. వాల్మీకి అర్చాలింగాన్ని క్రీడనీయంగా చేసుకొన్నారు. అందుతో ఖిన్నుడైన ముని, సీతాదేవి ప్రార్థింపగా వారికి ప్రాయశ్చిత్తాన్నిలా ఆదేశించినాడు: "కుబేర సరస్సునకు వెళ్ళి అందలి స్వర్ణపద్మాలను, ఆ ఉద్యానవనాన్నుంచి మందార పుష్పాలను లవకుమారుడు వెంటనే కొనివచ్చుగాక! వాటితో వీ రుభయులూ ఈ లింగాన్ని అర్చింతురుగాక! అందుతో వీరి పాపం ఉపశాంతి చెందుతుంది."

ఈ మాటవిని బాలుడై నప్పటికీ లవుడు కైలాసానికి వెళ్ళినాడు. ఆ కుబేరుని సరస్సును, ఉపవనాన్నీ కనుగొన్నాడు. అక్కడి యక్షులను చంపి పద్మాలను, కుసుమాలను తీసుకొని తిరిగివస్తూ బడలికవల్ల ఒక చెట్టుక్రింద విశ్రమించినాడు.

ఈలోగా రాముడు నరమేధం తలపెట్టినాడు. అందుకు కావలసిన సులక్షణుడైన నరునికోసం వెదకుతూ ఆ దారిలో

లక్ష్మణుడు వచ్చినాడు. అతడు క్షాత్రధర్మ ప్రకారం సమరానికి ఆహ్వానించి, మోహనాస్త్రంతో లవుని సమ్మోహింపజేసి అతనిని బంధించి, తనతో అయోధ్యాపురానికి కొనిపోయినాడు.

ఇంతలో లవుడు రాలేదని దుఃఖిస్తున్న సీతను ఓదార్చి జ్ఞాని అయిన వాల్మీకి తన ఆశ్రమంలోనే ఉన్న కుశునితో ఇట్లన్నాడు: "లక్ష్మణుడు లవకుమారుని పట్టుకొని అయోధ్యకు కొనిపోయినాడు. నీవు వెళ్ళి ఈ అస్త్రాలతో వానిని ఓడించి అతని నుండి లవునికి విమోచనం కల్పించవలసింది".

ఇలా చెప్పి దివ్యాస్త్రాలనిచ్చినాడు. వాటితో కుశుడు అక్కడినుండి బయలుదేరి అయోధ్యలోని యజ్ఞభూమిని ముట్టడించినాడు. అక్కడ యుద్ధంలో దివ్యమహాస్త్రాలతో లక్ష్మణుడు ఎదురొడ్డి రాగా అతనిని నిర్జించినాడు.

ఆ తర్వాత రాముడు అతనిపైకి ఎత్తిరాగా వాల్మీకి కుశునకు ఇచ్చిన అస్త్రాల ప్రభావంవల్ల రాముడుకూడా అతనిని ఎంత ప్రయత్నించినా ఎదిరించి జయించలేక పోయినాడు.

అప్పుడా కుశకుమారుని రాముడిట్లా ప్రశ్నించినాడు: "నీ వెందుకోసం వచ్చినావు? నీ వెవరవు?"

అప్పుడు కుశుడిట్లన్నాడు: "మా అన్నను లక్ష్మణుడు కట్టి పట్టుకొని ఇక్కడికి వచ్చినాడు. అతనిని విడిపించుటకై నే నిక్కడికి వచ్చినాను. మా పేరు లవకుశులు. మేము రామతనయుల మని మా అమ్మ జానకి అంటూఉంటుంది" అని తన వృత్తాంతం యావత్తూ చెప్పినాడు.

ఆ తర్వాత రాముడు కన్నీరు విడుస్తూ లవుని పిలిపించి "ఆ పాపిష్ఠి రాముడను నేనే" అని కౌగిలించుకున్నాడు. ఆ

పిదప సీతను ప్రశంసిస్తూ, ఆ బాలవీరులను చూస్తూ పౌరులందరూ అక్కడ చేరగా, రాముడు వా రిద్దరినీ పరిగ్రహించినాడు. అటు పిమ్మట వాల్మీకి ఆశ్రమంనుంచి సీతాదేవిని పిలిపించి, కొడుకులపై రాజ్యభారాన్నుంచి ఆమెతో పాటూ హాయిగా ఉన్నాడు."

—ఈ విధంగా ధీరులైన వారు చిరకాలమైనా ఇలాంటి విరహాన్ని సహిస్తారు. మరి యువకులైన మీరేమో ఒక రాత్రి విరహాన్ని భరింపలేరా ?"

ఇలా పరిణయోత్సుకురాలైన తన కూతురు అలంకారవతిని, నరవాహనదత్తుని కాంచనప్రభ ఉద్బోధించినది. రేపు తెల్లవారే సరికి కొనివత్తునని తన కూతును తీసుకొని ఆమె ఆకాశమార్గంలో వెళ్ళిపోయినది.

నరవాహనదత్తుడు కూడా విమనస్కుడై కౌశాంబీనగరానికి వెళ్ళిపోయినాడు. అక్కడ ఆరాత్రి నిద్రావిహీనుడై ఉన్న యువరాజుతో గోముఖుడు వినోదార్థం పృథ్వీరూపకథను చెప్తాను వినండి అని ఇట్లా చెప్పసాగినాడు:

## పృథ్వీరూపకథ

"దక్షిణాపథంలో ప్రతిష్ఠానం అను పేరుగల పట్టణమొక టున్నది. అందులో పృథ్వీరూపుడనే పేరుగల అతిరూపవంతుడైన రాజు కలడు. అతని వద్దకు పరిజ్ఞానులైన ఇద్దరు శ్రమణులు ఒకసారి వచ్చినారు.

ఆయన అద్భుతరూపం చూచి వారు ఆ రాజుతో ఇట్లన్నారు: "ఓ దేవా! మేము భూలోకమంతా సంచరిస్తుంటాము. అయినప్పటికీ, నీవంటి రూపం మా కెక్కడా కన్పించలేదు. ఇంత

రూపవంతుడైన పురుషునిగాని, స్త్రీనిగాని ఎక్కడా మేము చూడ లేదు—అయితే ముక్తిపుర ద్వీపంలో రూపధరుడనే రాజునకు, హేమలత అనే రాణికి పుట్టిన కుమార్తె రూపలత అను నామె కలదు. ఆమె నీకు తగిన కన్యక. ఆమెకు తగినవాడు కూడా నీ వొక్కడవే. మీ ఇద్దరకూ సంయోగం కలిగితే అది గొప్ప సుకృతఫలం కాగలదు"—అనే ఆ శ్రమణవాక్యాలతోపాటూ ఆ రాజు శ్రుతిమార్గంలో మదనసాయకాలు కూడా దూరి హృదయంలో నాటుకొన్నవి.

ఆ తర్వాత ఉత్కంఠితుడైన ఆ రాజు ఉత్తమచిత్రకరుడైన కుమారదత్తుడను వానిని ఇలా ఆదేశించినాడు: "సరిగ్గా నావలెనే నా ఆకృతిని చిత్రపటంలో చిత్రీకరించి, దానిని తీసుకొని ఈ శ్రమణులతో పాటు ముక్తిపుర ద్వీపానికి నీవు వెళ్ళవలసింది. అక్కడ రూపధరుడనే రాజు కూతురగు రూపలతకు ఏదో ఒక యుక్తితో నా చిత్రపటాన్ని చూపవలసింది. ఆ రాజు తన కూతును నాకు ఇస్తాడో, ఇవ్వడో తెలుసుకొన వలసింది. అలాగే ఆ రూపలత చిత్రపటాన్ని లిఖించి నావద్దకు కొని రావలసింది." ఈ విధంగా చెప్పి తన చిత్రపటంతో పాటు ఆ చిత్రకరుని ఆ ద్వీపానికి పంపించినాడు.

ఆ చిత్రకరుడు, శ్రమణులు అక్కడినుంచి బయలుదేరి క్రమంగా సముద్రతీరంలో నున్న పత్రపురం చేరుకొన్నారు. ఆ తర్వాత పడవపైనెక్కి సముద్రమార్గంలో వెళ్ళి ఐదురోజులకు ఆ ముక్తిపుర ద్వీపాన్ని చేరుకొన్నారు.

అక్కడ ఆ చిత్రకరుడు రాజద్వారం వద్దకు వెళ్ళి తన చేతనున్న చిత్రపటాన్ని తెరచి చూపుతూ "నాతో సమానమైన

చిత్రకారుడు ఇంకొకడు లేడు '' అని ఉద్ఘోషించినాడు. ఈ సంగతి తెలిసిన రాజు రూపధరుడు అతనిని పిలిపింపగా రాజభవనంలో ప్రవేశించి, ఆయనకు నమస్కరించి ఇలా విజ్ఞాపనం చేసుకొన్నాడు:

"ఓ దేవా! నేను భూలోకమంతా పర్యటిస్తూ ఉంటాను. నాకెక్కడా నాతో సమానుడైన చిత్రకారుడు కన్పించలేదు. దేవాసుర మర్త్యులలో ఎవరినైనా సరే చూపించి నన్ను చిత్రీకరించమంటే మీ ఆజ్ఞ శిరసావహిస్తాను."

ఈ మాటవిన్న ఆ రాజు తన కూతురు రూపలతను అక్కడికి పిలిపించి 'ఈమె చిత్రపటాన్ని గీసి నాకు చూపించవలసింది' అని ఆదేశించినాడు. అంతట ఆ చిత్రకరుడైన కుమారదత్తుడు ఆ రాజకన్యక చిత్రాన్ని ఆలేఖించి ఆ చిత్రపటాన్ని రాజునకు చూపించినాడు.

అప్పుడా రూపధరరాజు సంతుష్టుడై మేధావిగా గుర్తించి ఆ చిత్రకరుని, అల్లునికోసమై ఇలా ప్రశ్నించినాడు: "ఓ భద్రా! నీవులోకమంతా తిరుగుతుంటావు. ఎక్కడైనా సరే నా కూతురుతో రూపంలో సమానమైన రూపం గల పురుషుడుగానీ స్త్రీగానీ కనిపించినారా?''

ఆ మాటవిని అతనిట్లా అన్నాడు: "ఈమెతో సమానురాలైన రూపవతిని నేనెక్కడా చూడలేదు. ఇంత రూపవంతుడైన పురుషునిగూడా చూడలేదు. అయితే, ప్రతిష్ఠాన నగరంలో పృథ్వీరూపుడనే పేరుగల ఒక మహారాజున్నాడు. ఆయన ఈమెకు సరిపోగలడు. ఆయనకు, ఈమెకూ సంయోగమే కలిగితే అదెంతో అత్యుత్తమం కాగలదు. తనవంటి రూపవతి

అయిన రాజకన్యక దొరకనందువల్లనే ఆ రాజు నవయౌవన వంతుడైనప్పటికీ అవివాహితుడుగానే ఉన్నాడు. నేనాయనను చూచి ఆ లోచనప్రియుని చిత్రపటాన్ని కేవలం రూపకుతూహ లంతో చిత్రించి ఉన్నాను."

అనగా ఆ రాజు "ఆ పటం నీవద్ద ఉన్నదా?" అని అడుగగా, "ఉన్నది మహారాజా" అని ఆ చిత్రకరుడు ఆ చిత్ర పటాన్ని చూపించినాడు. పృథ్వీరూప భూపతి చిత్రపటంలోని రూపాన్ని చూచి, రూపధరనృపాలుడు విస్మయంతో శిరఃకంపనం చేసినాడు. "మేమీ లిఖితరూపాన్ని చూచే ధన్యులమైనాము. ఆ రాజును స్వయంగా చూచిన వారికి ప్రణమిల్లుతున్నాము."

ఈ తండ్రి మాటవినీ, ఆ చిత్రపటంలోని రాజును చూచీ రాజకుమారిఉత్కంఠితురాలై మరిక దేనినీ వినలేదు. చూడలేదు. ఆ విధంగా మన్మథ మోహితురాలైన తన కూతును చూచి కుమార దత్తునితో రూపధరమహారాజు ఇట్లన్నాడు: "నా కూతురు చిత్రీకర ణంలో ఏమాత్రం వ్యత్యయం లేదు. ఆ మహారాజు ప్రతిరూపాన్ని చూస్తే ఆయనే మా అమ్మాయికి తగినభర్త అని భావిస్తున్నాను. కాబట్టి నీవు నా పుత్రిక చిత్రపటాన్ని తీసుకొని సత్వరమే వెళ్ళి పృథ్వీరూపనృపాలునికి చూపించ వలసింది.

ఇక్కడ జరిగినదంతా వివరించి ఆయన ఇష్టపడితే ఇక్కడికి త్వరగా గావచ్చును. మా ఆత్మజను పరిణయం చేసుకొన ాచ్చును. అని చెప్పి ఆ భిక్షువులతో పాటు ఉన్న అతనిని ధనాదులతో సత్కరించి రాజు చిత్రకరునితో పాటు తన కూతురి చిత్రపటాన్ని కూడా పంపించినాడు.

వారు సముద్రాన్ని దాటి ప్రతిష్ఠాన పట్టణం చేరుకొని పృథ్వీరూప నృపాలుని సన్నిధికి వెళ్ళినారు.

అక్కడ ఆ రాజు రూపధరుడు పంపిన బహుమానాదుల నిచ్చి, జరిగినదంతా చెప్పి ఆయన సందేశాన్ని వినిపించినారు. అలాగే ఆ చిత్రకరుడు ఆ రాజునకు తన చిత్రపటంలోనున్న రూప లతా ప్రతికృతిని చూపించినాడు. ఆ రాజు ఆ రూపలత లావణ్య సరస్సులోనికి చూస్తూ అందులో మునిగిపోయిన తన దృష్టిని పైకి తీసుకొనుటకు అశక్తుడైనాడు.

ఆ కాంతి సుధాస్యందమయి అయిన రూపలతను కనులతో త్రావివేస్తూ మరింత ఉత్కంఠ కలుగగా చంద్రికను త్రావుతున్న చకోరంవలె అసంతృప్తుడే అయినాడు.

"ఓ మిత్రమా! ఈ రూపాన్ని నిర్మించిన ఆ బ్రహ్మదేవుడు వంద్యుడు. అలాగే దానిని చిత్రించిన నీవు వంద్యుడవు. ఆ రూపధర భూపాలుని మాటను నేను మన్నిస్తున్నాను. ముక్తిపుర ద్వీపానికి వెళ్ళి ఆయన కుమార్తెను వివాహం చేసుకొంటాను" అని ఆ చిత్రకరునితో చెప్పి ఆ భిక్షువులను, అతనిని ధనాదులతో సమ్మానించి పృథ్వీరూప నరపతి ఆ చిత్రపటాన్నే చూస్తూ కూర్చున్నాడు.

ఆ రోజెల్లా ఉద్యానాదులకువెళ్ళి విరహాతురుడై. లగ్నాన్ని నిశ్చయించి, రాజు ప్రయాణసన్నాహం చేసినాడు. అనేక గజ తురగాదులతో, సామంతులతో, రాజపుత్రులతో ఆ రూపధర భూ పతి చిత్రకరునితో, శ్రమణులతోకూడా కలిసి, మంగళఘటమనే పట్టపుటేనుగునెక్కి. కొన్నిదినములు పయనించి సాయంకాలానికి వింధ్యాటవీ ద్వారాన్ని చేరి అక్కడ విడిసినాడు.

మరునాడు శత్రుమర్దనమనే పేరుగల భద్రగజాన్ని అధిరోహించి రాజు పృథ్వీరూపుడు ఆ అడవిలో ప్రవేశించినాడు. ఆయనలా వెళుతుండగా తన ముందున్న సేన హఠాత్తుగా చెల్లాచెదరై పారిపోవడం కనుగొన్నాడు.

ఇదేమిటని సంభ్రాంతుడైన ఆయనవద్దకు నిర్భయాఖ్యుడనే రాజపుత్రుడు గజారూఢుడై వచ్చి ఇట్లా విన్నవించుకొన్నాడు: "దేవా! ముందు గొప్పభిల్లసేన పైబడినది. ఆ భిల్లులతో జరిగిన పోరాటంలో మన ఏనుగులు యాభైదాకా హతమైనవి. వేయిమంది పదాతులు, మూడువందల తురంగాలు నేలపాలైనవి. భిల్లులకు చెందిన రెండువేలమందిని మనవారు పడగొట్టినారు. మన బలగంలో ఒక కబంధం కనబడితే వారి గుంపులో రెండు కబంధాలు కనబడుతున్నవి. అందువల్ల మనసైనికులు వారి బాణాశనిపాతంతో పీడితులై చెల్లాచెదరైనారు."

ఈ మాటవిన్న పృథ్వీరూప నృపాలుడు క్రోధోద్రిక్తుడై ముందునకు పరువెత్తి కౌరవసేనను అర్జునుడువలె భిల్లసేన నతను సంహరించినాడు. నిర్భయాదులైన ఇతర దస్యులు నిహతులు కాగా, ఒక బల్లెంతో భిల్లసేనాధిపతి శిరస్సును ఖండించివేసినాడు. బాణవ్రణంనుంచి కారుతున్న రక్తంతో ఆయన శత్రుమర్దనమనే గజం, ధాతువులతో పాటూ కలిసిన సెలఏళ్ళతోటి అంజనాద్రిని విడంబించినది.

ఆ తర్వాత జయాన్ని పొందిన ఆయనసైన్యం అంతా సమ్మిళితంకాగా హతశేషులైన ఆ భిల్లులు దిక్కులు పట్టిపోయినారు. అలా సంగ్రామం పరిపూర్తికాగా పృథ్వీరూప మహీపతి, రూపధరుని దూత తన పరాక్రమాన్ని ప్రస్తుతిస్తుండగా గాయ

పడిన సైనికుల విశ్రాంతికై ఆ అడవిలోనే ఒక సరస్తీరంలో ఆ రోజంతా గడిపినాడు.

ఉదయం అక్కడినుంచి బయలుదేరిన ఆ రాజు క్రమంగా సముద్రతీరంలోని పత్రపుర నగరాన్ని చేరుకొన్నాడు. అక్కడ ఒకరోజు విశ్రమించి ఆ పట్టణం రాజు ఉదారచరితుడు ఉచిత సత్కారాలు చేయగా గడపినాడు. ఆయనే తెప్పించిన పడవలలో సముద్రాన్నిదాటి ఆ ఎనిమిది రోజులలో ముక్తిపుర ద్వీపాన్ని చేరుకొన్నాడు.

ఈ సంగతి తెలిసి రూపధరుడు సంతుష్టుడై ఎదురు వచ్చి నాడు. ఆ ఇద్దరు రాజులు పరస్పరం కంఠాలింగనం చేసు కొన్నారు. ఆ తర్వాత ఆయనతోపాటు పృథ్వీరూప భూపతి ఆ నగరస్త్రీలు తమకళ్ళతోనే ఆయనను త్రావివేస్తుండగా ఆ పట్టణం లోనికి ప్రవేశించినాడు.

అక్కడ రాణి హేమలత, రూపధరరాజు తమ కుమార్తెకు అనురూపుడైన భర్త దొరికెనని, అతనినిచూచి సంతోషించినారు ఆ తర్వాత తన సంపదకు అర్హమైనట్టుగా రూపధరుడు సత్కా రాలు చేస్తుండగా పృథ్వీరూప పార్థివుడక్కడ ఉన్నాడు.

మరునాడు అత్యున్నతమైన వేదిపైనెక్కి శుభముహూ ర్తంలో రూపలతను ఆ రాజు పాణిగ్రహణం చేసినాడు. పూర్వం తాను విన్నమాట నిజమేనని తమ చెవులకు చెప్తున్నట్టుగా వారి నేత్రాలు అన్యోన్య దర్శనంతో ప్రఫుల్లములైనవి.

లాజమోచనంతో వారిద్దరకూ రూపధరుడు రత్నాలను కాను కగా ఇచ్చినాడు. దానిని చూచి జనం అతనిని రత్నాకరు డను కొన్నారు. కుమార్తె వివాహం పరిపూర్తి కాగా అతను ఆ చిత్ర

కారుని, శ్రమణులను పూజించి సర్వ వస్త్రాభరణాలతో సత్కరించినాడు. అలాగే ఇతరులను పూజించినాడు.

తర్వాత ఆ పట్టణంలో ఉండి పృథ్వీరూపుడు ఆ ద్వీపానికి ఉచితమైన అన్నపానాదులను అనుచరులతో పాటూ స్వీకరించినాడు. నృత్తగీతాదులతో ఆ పగలు గడవగా రాత్రి స్వోత్కంఠుడై ఆ అవనీపతి రూపలతాభవనంలోనికి ప్రవేశించినాడు.

అక్కడ రత్నపర్యంకం సజ్జితమై ఉన్నది. రత్నకుట్టిమంతో ఆ మందిరం శోభిల్లుతున్నది. ఎటు చూచినా రత్నస్తంభాలు అందం గొల్పుతున్నవి. రత్నదీపాలు ప్రకాశిస్తున్నవి. అందులో రూపలతతోపాటు ఆ యువకుడు చిరసంకల్ప గుణితమైన సురతోత్సవాన్ని యథేచ్ఛగా అనుభవించినాడు. రతిశ్రమసుప్తుడై వందిమాగధుల స్తోత్రపాఠాలతో మేల్కొని, ఉదయం లేచి స్వర్గంలో ఇంద్రునివలె ఉన్నాడు.

ఈ విధంగా పృథ్వీనృపాలుడు పదిరోజులు ఆ ద్వీపంలో నవనవభోగాలను మామగారు కల్పిస్తుండగా అనుభవించినాడు. పదకొండవరోజు ఆ రూపలతతోపాటు గణకులు అనుమతించిన సమయంలో మంగళాచరణానంతరం అక్కడినుండి బయలుదేరినాడు. సముద్రతీరందాకా మామగారు వచ్చి సాగనంపగా వధువుతో పాటు తాను, తన అనుచరులు పడవల నారోహించినారు. ఎనిమిదవ రోజున ఆ సముద్రాన్ని దాటి తీరంపై బలమంతా సమ్మిళితం కాగా, ఉదారచరితుడు ఎదురు రాగా పత్రపురానికి వెళ్ళినాడు. అక్కడ ఆ రాజు సత్కరిస్తుండగా కొన్నిరోజులు విశ్రమించి, పృథ్వీరూప జనపాలుడు ప్రియురాలు రూపలతను జయమంగళ గజంపై ఎక్కించి, కల్యాణగిరి అనే పేరుగల భద్రవారణంపై తాను ఆరోహించి బయలుదేరినాడు.

క్రమంగా అవిరత ప్రయాణాలతో వెళ్ళి ధ్వజాలపై పతాకలను ఎగురవేసి ఎదురుచూస్తున్నట్టున్న తన పట్టణం ప్రతిష్ఠానానికి చేరుకొన్నాడు. అక్కడ రూపలతను చూచి, ఆమె రూపదర్పాన్ని చూచి పురస్త్రీలు ఆశ్చర్య నిర్నిమేష విలోచనలై ఆ ఇంతకాలం గడిపివేసినారు.

రాజధానిలో ప్రవేశించి పృథ్వీరూపుడు కృతోత్సవుడై చిత్రకారునకు గ్రామాలను దానంచేసినాడు. ధనాన్ని ఇచ్చినాడు. శ్రమణులను కూడా కాంచనాదులతో యథోచితంగా పూజించి, సామంతులను, సచివులను, రాజపుత్రులనుకూడా సమ్మానించినాడు.

ఆ తర్వాత ప్రియురాలైన రూపలతతో కలిసి కృతార్థుడైన ఆ పృథ్వీపతి ఇహలోక సుఖాన్ని అనుభవించినాడు."

ఈ విధంగా సుఖోన్ముఖుడైన మంత్రి గోముఖుడు నరవాహనదత్తునకు ఈ కథను చెప్పి తిరిగి ఇట్లన్నాడు:

"ఈ విధంగా ధీరులైనవారు చిరకాలం విరహక్లేశాన్ని సహిస్తారు. నీవేమో దేవా, ఒకరాత్రికూడా సహింపలేకున్నావు. ఇదేమిటి? రేపు ప్రొద్దుటే నీ వెలాగూ అలంకారవతిని పరిణయం చేసుకొంటావు."

గోముఖుడు ఈ విధంగా చెప్పగా ఆ సమయంలోనే అక్కడికి వచ్చిన యౌగంధరాయణుని కుమారుడు మరుభూతి ఇట్లన్నాడు: "మదన సంతాపం కనబడకుండా స్వస్థుడవై నీ వేమీ మాట్లాడడం లేదేమిటి? ఏ పురుషుడైనా ధైర్యాన్ని, వివేకాన్ని, శీలాన్ని కామసాయకాలకు తాను గోచరుడు అయ్యేవరకు నిలుపు

కొంటాడు. సరస్వతి, స్కందుడు, జినుడు వీరు ముగ్గురే ధన్యులు వారందరూ పంచకు తగులొ్కొన్న తృణాన్నివలె మన్మథుని విదిలించి వేసినవారు.''

మరుభూతి ఈ విధంగా చెప్తుండగా ఉద్విగ్నుడైన గోముఖుని ముఖంచూచి నరవాహనదత్తుడు అతనిని సమర్థించుటకు ప్రయత్నించినాడు. "నా వినోదార్థమై గోముఖుడు చెప్పినదంతా ఉచితమైనదే. విరహదుఃఖం అనుభవిస్తుండగా ఆర్ద్రమనస్కుడు ధన్యవాదా లర్పిస్తాడా? యథాశక్తిగా విరహాతురుడైన వానిని స్వాజనం ఓదార్చాలి. ఆ తర్వాత సంగతి ఆ మన్మథునకే తెలుసు.''

ఈ విధంగా మాట్లాడుతూ, వింటూ ఆ యా పరిజనుల ప్రసంగాలతో నరవాహనదత్తుడు ఆ మూడుజాములను ఎలాగో దాటగల్గినాడు.

## అలంకారవతీ నరవాహనదత్తుల వివాహం

మరునాటి ఉదయం లేచి నరవాహనదత్తుడు కాలకృత్యాలను తీర్చుకొని గగనంనుంచి దిగివస్తున్న కాంచనప్రభను అవలోకించినాడు. భర్త అలంకారశీలునితోను. కొడుకు ధర్మశీలునితోను, తన కూతురు అలంకారవతితోను ఆమె కలిసివచ్చినది. వారందరూ నేలపైనికి దిగి ఆయన సమీపానికి వచ్చినారు. అతను వారిని, వారతనిని యథోచితంగా అభినందించుకొన్నారు.

ఈలోగా హేమరత్నాది భారవాహులైన వేలకొలది విద్యాధరులు అక్కడికి దివినుంచి దిగివచ్చినారు. ఈ వృత్తాంతాన్ని తెలుసుకొని మంత్రులతో పాటూ వత్సరాజు సపత్నీకుడై తన–

యోత్కర్షవల్ల హర్షం చెంది అక్కడికి వచ్చినాడు. యథార్థంగా వత్సరాజు ఆతిథ్యమివ్వగా రాజు అలంకారశీలుడు ప్రణయా నతుడై ఆయనతో ఇట్లన్నాడు: "రాజా! ఈ కన్య అలంకార వతి: నా కూతురు. ఈమె పుట్టినప్పుడే నీ కొడుకు నరవాహన దత్తునకు భార్య కాగలదని ఆకాశవాణి నిర్దేశించినది. సర్వ విద్యా ధరేంద్రులకు మీ పుత్రుడు భావిచక్రవర్తి కావలెనని కూడా ఉద్ఘో షించినది. అందువల్ల ఇతనికి ఈమెను దానం చేస్తున్నాను. ఈ లగ్నం వీ రెద్దరికి శుభప్రదమైనది. ఇందుకోసమనే వీరి నందరినీ కలిపి ఇక్కడికి వచ్చినాను." ఈ విద్యాధరుని మాటలను వత్సే శ్వరుడు విని 'మహానుగ్రహం' అంటూ అభినందించినాడు.

తర్వాత నిజ విద్యావైభవం వల్ల తనచేతిలోనే ఉత్పన్నం చేసుకొన్న జలంతో ఆ ప్రాంగణాన్ని విద్యాధరాధీశుడు పవిత్రీక రించినాడు. అక్కడ కనకమయమైన, దివ్యవస్త్ర సంఛన్నమైన వేది, నానా రత్నమయమైన, అకృత్రిమమైన కౌతుకాగారం ఉద్భవించినవి.

"లగ్నకాలం సమీపిస్తున్నది స్నానం చేసి రమ్ము''- అని ఆ నరవాహనదత్తుని అలంకారశీలుడు ఉద్బోధించినాడు. స్నానా నంతరం వేదిమీదికి ధృత వధూవేష అయిన అలంకారవతిని ఆనందంతో కొనివచ్చి అతనికి అర్పించినాడు. మణికనక వస్త్ర భూషణ భారవస్త్రాలను, దివ్య స్త్రీలను, అగ్నిలో లాజమోక్షం చేస్తున్నప్పుడు తన తనయునితో పాటు కూతునకు సమర్పించి నాడు. ఇలా వివాహం పరిపూర్తికాగా అందరినీ సమ్మానించి, వారిని వీడ్కొని భార్యతోను, పుత్రునితోను వచ్చినదారినే ఆయన గగనానికెగిరి వెళ్ళిపోయినాడు.

ప్రణతులై ఆవిధంగా ఖేచరరాజులు తన కుమారుని ఉపచరిస్తుండడం చూచి వత్సరాజు ముదితుడై ఉదయోన్ముఖుడై దీర్ఘకాలం ఉత్సవాన్ని ప్రకటించినాడు. ఆ నరవాహనదత్తుడు సద్వృత్త, మనోరమ, ఉదారగుణ అయిన అలంకారవతిని సుకవి వాణివలె పొంది తద్రసికుడై ఉండిపోయినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో అలంకారవతీలంబకంలో
ప్రథమ తరంగం.

# ద్వితీయం తరంగం

## అలంకారవతీ భవనం లోనికి నరవాహనదత్తుని గమనం

పిదప అలంకారవతితో కూడిన వత్సేశ్వరకుమారుడు నరవాహనదత్తుడు పితృభవనంలో నవవధువుతో కలిసి ఆమె చెలులు చేస్తున్న దివ్యమైన నృత్యగీతాలతో రంజితుడైనాడు. పానాది గోష్ఠులలో వారు సేవింపగా, మంత్రులతో పాటు కాలక్షేపం చేస్తున్నాడు.

ఒకసారి అత్తగారైన కాంచనప్రభ అతనివద్దకువచ్చి ఆతిథ్యాన్ని స్వీకరించినది. అనంతరం ఆ అలంకారవతీమాత ఇట్లన్నది: "నీవు మా ఇంటికి రావలసింది. సుందరపురాన్ని చూడవలసింది. అక్కడ ఉద్యానవనాదులలో అలంకారవతితో కలిసి విహరించవలసింది."

ఈ మాటవిని సరేనని తండ్రికి చెప్పి వసంతకుని తోడు తీసుకొని వధువుతోపాటు, ఇతర మంత్రులతోపాటు అత్తగారి విద్యాప్రభావం వల్ల ఆమె స్వయంగా నిర్మించిన ఉత్తమ విమానాన్ని ఆరోహించి గగనమార్గంలో బయలుదేరినాడు.

విమానంలోనుంచి క్రిందనున్న స్థాలీపరిమితమైన భూమిని, అగడ్తల వంటి సముద్రాలను పరికించినాడు.

(మూలంలో ఇక్కడ ఒక శ్లోకం లుప్తమైనది)

..............................

..............................

తన పరివారంతోపాటూ క్రమంగా హిమాచలం చేరు కొన్నాడు. కిన్నరీ గీతాలతో ప్రతిధ్వనిస్తూ స్వర్గస్త్రీ సముదాయంతో సుందరమైన ఆ హిమనగంలో అనేకాలైన అద్భుతాలను చూస్తూ తుదకు నరవాహనదత్తుడు ఆ సుందరపుర నగరాన్ని చేరుకొన్నాడు.

అక్కడి ప్రాసాదాలన్నీ హేమమయాలై, రత్నఖచితాలై, హిమవంతం మీద ఉన్నప్పటికీ సుమేరు శిఖర భ్రాంతిని కల్పిస్తూ, శోభిల్లుతున్నవి. ఆయన గగనం లోనుంచి నేలకు దిగి, విమానం నుంచి బయలుదేరి పట్టణం లోనికి ప్రవేశించినాడు. చలిస్తున్న ధ్వజాంశుకాలతో నాథదర్శనంతో సంతోషించి నృత్యం చేస్తున్నట్టుగా ఉన్న దా నగరం.

ఆ రాజధానిలో ప్రవేశించి అత్తగారు మంగళాచరణం చేయగా అలంకారవతీ యుక్తుడై, స్వవయస్యుడు వసంతక సహితుడూ అయి అక్కడ ఆ రోజెల్లా అత్తగారి ప్రభావం వల్ల కల్పితాలైన దివ్యభోగాలను అనుభవిస్తూ స్వర్గంలోఉన్నట్టుగా ఆ సుకృతి అత్తగారింట సుఖమున్నాడు.

మరునాడు అతనితో అత్తగారైన కాంచన ప్రభ ఇట్లన్నది: "ఈ మహాపట్టణంలో భగవాన్ ఉమాపతి స్వయంభువుగా వెలసి ఉన్నాడు. ఆయనను దర్శించి పూజిస్తే భోగము, మోక్షము కూడా అనుగ్రహిస్తాడు. అలంకారవతి తండ్రి అక్కడ ఒక మహోద్యానాన్ని నిర్మింప జేసి ఉన్నాడు. అక్కడే గంగాసరస్సనే పేరుగల తీర్థాన్నికూడా కల్పించినాడు. దానిపేరు సార్థకమైనది. నీవు ఆ దేవుని అర్చించుటకై అక్కడికి వెళ్ళవలసింది."

ఈ మాటవిని నరవాహనదత్తుడు అలంకారవతీ సహితుడై, సహానుచరుడై ఆ శివోద్యానానికి వెళ్ళినాడు. కాంచన స్కంధము లైన తరువులతో, రత్నశాఖా మనోహరాలైన వానితో, ముత్యాల గుత్తుల వంటి పుష్పగుచ్ఛాలతో, విద్రుమ పల్లవాలతో ఆ ఉద్యాన మెంతో మనోహరంగా ఉన్నది.

అక్కడ ఆ గంగా సరస్సులో స్నానంచేసి ఉమాపతిని దర్శించి, పూజించి, రత్నసోపానాలతో, కాంచన పంకజాలతో శోభిల్లుతున్న నడబావులను చూస్తూ వాటి ఒడ్డున కల్పవల్లీ గృహా లలో విహరించినాడు. దివ్యమైన మద్యపానాలతో, సంగీత గోష్ఠులతో, లలిత ఛలోక్తులతో, మరుభూతి పరిహాసోక్తులతో అక్కడ ఆనందంగా కాలం గడిపినాడు.

ఆ ఉద్యాన భూముల్లో విహరిస్తూ కాంచనప్రభా కల్పిత విద్యావిభూతులతో ఒకనెల అక్కడ నరవాహనదత్తుడున్నాడు.

ఆ తర్వాత దేవోచితాలైన వస్త్రాలంకారాలతో సత్కృతుడై భార్యతోపాటు, మంత్రులతోపాటు, కాంచనప్రభతో పాటూ విమా నాన్నెక్కి కౌశాంబీ నగరాన్ని చేరుకొన్నాడు. భార్యతో పాటు తండ్రికి నేత్రోత్సవం చేసినాడు.

అక్కడ వాసవదత్త వత్సరాజుల ముందు తల్లి అయిన కాంచనప్రభ అలంకారవతితో ఇట్లన్నది: "నీవు భర్తయెడ ఏ మాత్రం ఈర్ష్యాసూయలు కనబరచకుండా మెలగవలసింది. ఆయనను కష్టపెట్టకూడదు. ఈ పాపంవల్ల కలిగే విరహం కుమారీ గాఢాను తాపానికి దారితీస్తుంది. ఈర్ష్యావతినై నేను పూర్వం నా భర్తను దుఃఖపెట్టినాను. ఆయన అరణ్యానికి వెళ్ళిపోయిన తర్వాత పశ్చాత్తాపంతో దగ్ధురాలనౌతున్నాను." అని చెప్పి

ఆమెను ఆలింగనం చేసుకొని అశ్రులోచన అయి కాంచనప్రభ గగనానికెగసి తన పట్టణానికి వెళ్ళిపోయినది.

ఆరోజలా గడవగా మరునాడు కాలోచిత కృత్యాలు తీర్చుకొని నరవాహనదత్తుడు నిజసచివులతోపాటు ఉన్నాడు. విలాసిని అయిన అలంకారవతికూడా అక్కడికి ప్రవేశించినది. ప్రవేశించీ, ప్రవేశించగానే ఎవరో ఒక స్త్రీ ఏదో భయంభయంగా చూస్తూ "దేవీ! అబలనైన నన్ను రక్షించు, రక్షించు" అని ఆక్రోశించినది. "నన్ను చంప నెంచి వచ్చిన బ్రాహ్మణుడు బయటనున్నాడు. అందుచేత భయపడి పరువెత్తుకొనివచ్చి మీ శరణు వేడుతున్నాను."

"నీవు భయపడనక్కరలేదు. అసలు వృత్తాంత మేమిటో చెప్పు. అతనెవడు? ఎందు చేత నిన్ను చంపదలచుకున్నాడు?" అని అడుగగా ఆమె తిరిగి చెప్పడానికి ఉపక్రమించినది.

"ఓ ప్రభూ! నా పేరు అశోకమాల. నేను ఈ పట్టణం లోనే ఉంటాను. బలసేనుడను పేరుగల క్షత్రియుని తనూజను. నేను కన్యగా ఉండగా పూర్వం హఠశర్మ అనుపేరుగల విప్రుడు రూపలుబ్ధుడై నన్నిమ్మని మా తండ్రి దగ్గరకు వచ్చి యాచించినాడు. వికారంగాను, ఘోరముఖంతోనూ ఉన్న ఇతనిని పతిగా గ్రహింపలేనని మా తండ్రికి చెప్పినాను. నీవు ఇచ్చినా అతని ఇంటిలో ఉండనన్నాను.

ఆ మాటవిని హఠశర్మ మా తండ్రి ఇంటిలో అగడం చేసి, హత్యాభయంతో మా నాన్న నన్ను ఇచ్చునట్టు చేసినాడు. అలా వివాహితురాలను కాగా నాకు ఇష్టం లేక పోయినప్పటికీ, నన్ను ఆ బ్రాహ్మడు తన ఇంటికి కొనిపోయినాడు. నేను వెళ్ళినప్పటికీ

అతనిని వదలి ఇంకొక క్షత్రియయువకుని చేరినాను. అతనిని అర్థసందర్భంవల్ల ఆ హఠశర్మ అవమానింపగా, మరొక క్షత్ర కుమారుని వద్దకు వెళ్ళినాను. అతని ఇంటిని ఆ బ్రాహ్మడు రాత్రివెళ్ళి కాల్చివేసినాడు. అంతట నేను విముక్తి పొంది మూడవ క్షత్రియుని చేరినాను. ఆ బ్రాహ్మడు అతని ఇంటిని కూడా రాత్రి భస్మీభూతం చేసినాడు.

ఆ విధంగా అతను కూడా వదలివేయగా దిక్కులేని దాననై కాందిశీకురాలనై తిని. నన్ను చంపనెంచినందువల్ల నక్కకు భయపడిన మేకపిల్లవలె ఈ హఠశర్మకు భయపడుతూ ఒక తావు నుంచి ఒక తావునకు పరువెత్తుతున్నాను. ఇక్కడే నీ సేవలో నున్న బలశాలి అయిన వీరశర్మ అనే రాజపుత్రునకు దాసినిగా చేరి శరణు పొందినాను.

ఈ సంగతి తెలుసుకొని నా మీది నైరాశ్యంతో విధురుడై, విరహాతురుడై ఆ దుర్మతి హఠశర్మ శల్య మాత్రావశిష్టుడైనాడు.

నా రక్షణకోసం ప్రవృత్తుడై ఇతనిని బంధించుటకై రాజ పుత్రుడు వీరశర్మ ప్రయత్నించగా ఓదేవీ నేను నివారించినాను. ఇప్పుడు దైవాత్తూ నేను బయటికి రాగా కత్తిని చేతపట్టుకొని హఠశర్మ నన్ను వధించుటకై ఇటువేపు పరువెత్తుకొని వచ్చినాడు. అతనినుంచి తప్పించుకొని దయార్ద్రి అయిన ప్రతీహారి తలుపు తెరచి లోన ప్రవేశపెట్టగా మీ సన్నిధికి వచ్చినాను. అతను బయటనే ఉన్నాడని నాకు తెలుసును."

—ఈ విధంగా ఆమె తన వృత్తాంతాన్ని చెప్పినది. అప్పుడు నరవాహనదత్తుడు హఠశర్మను తన ముందునకు పట్టి తెప్పించినాడు. క్రోధం వల్ల మండిపోతున్న చూపులతో ఆ

అశోకమాలను చూస్తూ చేతిలో కత్తిని పట్టుకొని కోపంతో ఒడలంతా వణకిపోతుండగా వికృతంగానున్న ఆ బ్రాహ్మణాధమునితో ఆయన ఇట్లన్నాడు: "స్త్రీ హత్యకు తలపడినావు. ఆమెకోసమై ఇతరుల ఇళ్ళను దహించినావు. ఎందుల కీ పాపకర్మలు చేస్తున్నావు?"

ఆ మాట విని ఆ బ్రాహ్మడు ఇట్లన్నాడు: "ఈమె నాకు ధర్మపత్ని. నన్ను వదలి మరొకరి ఎద్దకు వెళ్ళగా నేనెలా సహిస్తాను?" అని అనగా ఉద్విగ్నురాలైన అశోకమాల అప్పుడిట్లన్నది: "ఓ లోకపాలులారా! మీరే చెప్పండి. మీరు సాక్షిభూతులుగా లేరా? నా కిష్టం లేకపోయినప్పటికీ బలాత్కారంగా పట్టుకొనివచ్చి ఇతనికి నన్ను వివాహం చేసినది మీకు తెలుసుగదా! అప్పుడే నేనతని ఇంటిలో ఉండనని చెప్పినాను."

ఇట్లామె అనగా దివ్యవాక్కొకటి వినబడినది: "ఈ అశోకమాల చెప్తున్నదంతా సత్యం. అందులో విపర్యయ మేమీ లేదు. ఈమె మానవస్త్రీ కాదు. ఇందులోని యథార్థం వినండి.

అశోకకరుడనే పేరుగల ధీరుడైన విద్యాధరేశ్వరుడు కలడు. అతనికి కొడుకులు లేరు. దైవవశాత్తూ ఒకటే కన్యక కల్గినది. అశోకమాల అని ఆమె పేరు. ఆమె, తండ్రిఇంట పెరుగుతూ యౌవనవతి అయినది. వంశాభివృద్ధి నాశించి ఆమెతండ్రి వివాహం చేయదలచినాడు.

ఆమె తాను అతిరూపవతి నని తలంచి ఎవరినీ ఒప్పుకొనలేదు. అందువలన పట్టరాని కోపంతో ఆమె తండ్రి ఇలా శపించినాడు: "నీవు మనుష్యలోకంలోకి వెళ్ళిపోదువు గాక, నీ పేరిదేగా ఉంటుంది. అక్కడ ఒక కురూపి అయిన బ్రాహ్మడు బలాత్కారంగా నిన్ను వివాహం చేసుకొంటాడు. అతనిని వదలిపెట్టి వాని

భయం మూలంగా క్రమంగా ముగ్గురు భర్తలను పొందుతావు. అప్పటికి కూడా తప్పించుకోలేక దాసీత్వాన్ని ఆశ్రయిస్తావు. బలవంతుడైన రాజపుత్రుడు కూడా వాని నాపలేడు. అతని దగ్గర నుంచి, వాడు చంపడానికి రాగా పలాయితురాలవై రాజభవనంలో ప్రవేశిస్తావు. అప్పుడు నీ కీ శాపంనుంచి విమోచనం కలుగుతుంది.''

ఈ విధంగా అశోకమాలను తండ్రి పూర్వం శపింపగా అదే పేరుతోనే ఇప్పుడు మానవిగా జన్మించింది. ఇప్పుడు శాపాంతం అవుతుంది గనుక తన విద్యాధరపదానికి వెళ్ళి అక్కడ తన స్వ శరీరంలో ప్రవేశిస్తుంది.

ఆ తర్వాత అభిరచితు డనే పేరుగల విద్యాధర మహారాజును భర్తగా పొంది ఈ శాపాన్ని స్మరించి సుఖిస్తుంది."

—ఈ విధంగా దివ్యవాక్కు వినబడి విరతం కాగా తక్షణమే అశోకమాల హఠాత్తుగా ప్రాణాన్ని వదలి నేలపై పడిపోయినది. అది చూచి కన్నీరు విడుస్తున్న అలంకారవతి, నరవాహనదత్తుడు కూడా ఆమె ప్రక్కన చేరినారు. దుఃఖంతో కోపం తగ్గి రాగాంధుడై విలపిస్తున్నప్పటికీ అకస్మాత్తుగా హరశర్మ ఆనంద వికసిత వదనుడైనాడు.

ఇ దేమిటని అందరూ అడుగగా ఆ విప్రు డిట్లన్నాడు: "నా పూర్వజన్మ కూడా నాకు జ్ఞాపకం వచ్చినది. అదేమిటో చెప్తాను వినండి.

## స్థూలభుజ విద్యాధర కథ

హిమాద్రిలో మదనపుర మనే పేరుగల విద్యాధరేశ్వరుడు కలడు. ఆయనకు స్థూలభుజుడనే కుమారుడు కలిగినాడు. భవ్యుడైన ఆ రాకుమారుడు క్రమంగా యౌవనస్థుడైనాడు.

అంతట సురభివత్సుడు అను పేరుగల విద్యాధరాధిపతి స్వయంగా తన కన్యతోపాటు ఇంటికి వచ్చి ప్రలంబభుజునితో ఇట్లన్నాడు: "ఈ సురభిదత్త అను పేరుగల కన్యక నాకుమార్తె. ఈమెను గుణవంతుడైన నీ కుమారుడు స్థూలభుజునకు దానం చేసినాను."

ఆ మాటవిని వెంటనే తన కొడుకును పిలిపించి ప్రలంబభుజుడు అతనికీ విషయం నివేదించినాడు. అంతట స్థూలభుజుడు రూపగర్వంవల్ల ఆయనతో ఇట్లన్నాడు: నే నీ అమ్మాయిని పెళ్ళి చేసుకోను. ఈమె రూపంలో మధ్యమురాలు."

అప్పుడా తండ్రి: "కుమారా! రూపంతో అత్యంత మాన్యురాలు, గొప్పవంశంలో పుట్టినది. ఆమె తండ్రి స్వయంగా తెచ్చి అప్పగించినాడు. నే నీమెను నీ కోసమై స్వీకరించినాను. మరొకవిధంగా చేయకు" అని చెప్పినప్పటికీ కుమారు డంగీకరింపకపోగా స్థూలభుజుని, కుపితుడైన తండ్రి ఇలా శపించినాడు: "రూపసివన్న అహంకారంలోనున్న నీ విపుడు మనుష్యుడవై జన్మింతువుగాక! ఆ జన్మలో నీవు వికృతుడవు. వికటాననుడవు అవుదువుగాక! అశోకమాల అనే భార్యను పొంది, హఠాత్తుగా శాపచ్యుతురాలైన ఆమె నిన్నిష్టపడక వదలివేయగా ఆమె విరహక్లేశంతో బాధపడుదువు గాక! ఆమె అన్యాసక్తకాగా ఆ దుఃఖంతో కృశించిపోయి రాగమోహితుడవై అగ్నిదాహాది పాపాలకు గురి అవుదువుగాక!"

ఆ సాధ్విఅయిన సురభిదత్త దుఃఖిస్తూ ఆయన కాళ్ళపై పడి ఇలా విన్నవించుకొన్నది: "నాకు కూడా అలాంటి శాపమే ఇవ్వండి. మాకు సమానగతి కలుగుతుంది. నా మగనికొక్కనికే

నా అపరాధంవల్ల క్లేశం కలుగరాదు'' అని ప్రార్థింపగా ఆ సాధ్వియెడ సంతుష్టుడై, ఆమెను ఓదారుస్తూ ప్రలంబభుజుడు తన కుమారునకు శాపాంతాన్ని ఈ విధంగా నిర్దేశించినాడు.

''ఎప్పుడైతే అశోకమాలకు శాపవిమోచనం కలుగుతుందో అప్పుడే అతనికి కూడా జాతస్మృతి కలిగి, ఈ శాపంనుండి విముక్తుడౌతాడు. స్వదేహాన్ని పొంది శాపాన్ని స్మరిస్తూ అహంకార రహితుడై త్వరలోనే నిన్ను వివాహం చేసుకొని నీతో కలిసి సుఖవంతుడౌతాడు.'' ఈ విధంగా ఆయన చెప్పగా ఆ సాధ్వి ఎలాగో కొంతధైర్యం చిక్కబట్టుకొన్నది.

శాపచ్యుతుడనైన ఆ స్థూలభుజుడనే నేను. నేను అహంకార దోషంవల్ల ఈ మహాదుఃఖాన్నంతా సహించినాను. అహంకారులైన పురుషులకు దృష్టమైనా, అదృష్టమైనా శ్రేయస్సు ఎలా కలుగుతుంది? ఇప్పుడు నా శాపం తొలగిపోయినది'' అనిచెప్పి ఆ శరీరాన్ని పరిత్యజించి హరశర్మ విద్యాధరకుమారకుడైనాడు.

అశోకమాలా దేహాన్ని విద్యాప్రభావంవల్ల కొనిపోయి అదృశ్యుడుగానే గంగలో పడవేసినాడు. అలాగే తన విద్యాప్రభావంవల్ల తెప్పించిన ఆ గంగాజలంతో అలంకారవతీ వాసగృహాన్నంతటినీ కడిగివేసినాడు. భావిప్రభుడు గనుక నరవాహనదత్తునకు నమస్కరించి తన పనిమీద గగనానికెగసి వెడలిపోయినాడు."

అక్కడున్న వారందరూ ఆశ్చర్యచకితులుకాగా ప్రసంగవశాత్తూ గోముఖుడు అనంగరతి సంబద్ధమైన ఈ కథను ఇట్లా చెప్పదొడగినాడు.

అనంగరతి కథ

"శూరపురం అనే సార్థక నామధేయం కల నగర మొకటి కలదు. అక్కడ అతిదుర్మదుడైన మహావరాహు డనే రాజు కలడు. అంబికారాధనం వల్ల ఆయనకు, రాణి పద్మరతికి అనంగ రతి అను పేరుగల ఒక కుమార్తె కలిగినది. ఆ రాజునకు మరొక సంతతిలేదు.

కాలక్రమేణా ఆమె పెరిగి పెద్దదైనది. రూపాభిమానం కలది కనుక రాజులెందరు కోరినా ఏ ఒకరినీ పతిగా వరించలేదు. ఎవడు శూరుడు, రూపవంతుడు, విజ్ఞానిగా విశిష్టుడో వానికే తన నివ్వవలసింది అని దృఢంగా చెప్పింది.

ఆమెకోసమై, ఈ సంగతి విని ఆమె కోరిన గుణాలుకల నలుగురు వీరులు దక్షిణాపథంనుంచి అక్కడికి వచ్చినారు. ద్వార పాలకుడు వారిని ఎరిగించి లోనికి ప్రవేశపెట్టగా అనంగరతితో పాటూ ఉన్న మహావరాహుడు వారి నిలా ప్రశ్నించినాడు: "మీ పేర్లేమిటి? జాతి విజ్ఞానాదు లేమిటి?" చెప్పమన్నాడు.

ఆ రాజు మాటవిని వారిలో ఒకడు ఇలా విన్నవించినాడు: "నాపేరు పంచపట్టికుడు. నేను శూద్రుడను. నాకు విజ్ఞానం ఉన్నది. ప్రతిరోజూ అయిదు పట్టికాయుగళాలను నేను నేస్తాను. వానిలో ఒక జతబట్టలను ఒక బ్రాహ్మణునకు దానం చేస్తాను. రెండవ జతను పరమేశ్వరుని కిస్తాను. మూడవ జతను నేను ధరి స్తాను. నాకు భార్య ఉంటే నాల్గవదానిని ఆమె కిస్తాను. అయిదవ దానిని విక్రయించి జీవయాత్ర చేస్తాను."

వారిలో రెండవవాడు ఇట్లా అన్నాడు: "నాపేరు భాషా జ్ఞుడు. నేను వైశ్యుడను. పక్షుల ధ్వనుల అర్థం నాకు తెలుసును."

మూడవవా డిట్లా అన్నాడు : "నా పేరు ఖడ్గధరుడు. క్షత్రియుడను. ఖడ్గయుద్ధంతోనే జీవిస్తాను కానీ మరొక దేనితోనూ కాదు."

వారిలో నాల్గవవా డిట్లా అన్నాడు : "నాపేరు జీవదత్తుడు, నేను విప్రుడను. గౌరీప్రసాదలబ్ధమైన విద్యాప్రభావంతో చని పోయిన స్త్రీని జీవింపజేస్తాను."

ఈ విధంగా చెప్తున్న శూద్ర వైశ్యక్షత్రియులు ముగ్గురూ తమరూపము, శౌర్యము, బలము వేరు వేరుగా చెప్పుకొన్నారు. బ్రాహ్మడు రూపం తప్ప తన బలాన్ని, వీర్యాన్ని ప్రశంసించి నాడు.

ఆ తర్వాత మహావరాహుడు తన ప్రతీహారితో వీరందరినీ తీసుకొని పోయి మీ ఇంటిలో విశ్రమింపజేయువలసింది అని ఆదే శింపగా అదే విధంగానే చిత్తమని చెప్పి ఆ ప్రతీహారి వారిని తన ఇంటికి తీసుకొని పోయినాడు.

అప్పుడు రాజు తన కూతురు అనంగరతితో ఇట్లన్నాడు : "ఈ నలువురు వీరులలో నీకు ఇష్టుడైన వాడెవ్వడు? శూద్రుడు కేవలం బట్టలు నేసేవాడు. అతనికి గుణాలతోనేమి పని?

రెండవ వాడు వైశ్యుడు. అతనికి పక్ష్యాదిరుత పరిజ్ఞానం మాత్రమే కలదు. దానివల్ల ప్రయోజన మేమి?"

ఈ తండ్రిమాట విని అనంగరతి ఇట్లన్నది: "నాన్నా! ఆ నలుగురిలో నాకు ఏ ఒక్కరూ ఇష్టులు కారు. నేను క్షత్రియు రాలనై ఉండీ వారి నెలా వరింపగలను?

మూడవవాడు తుల్యవంశజుడు. గుణవంతుడు. అయితే అతను కేవలం సేవోపజీవి. దరిద్రుడు. ప్రాణాన్ని విక్రయించుకొనే వాడు. నేను రాజకుమార్తెనై ఉండీ అతనికి భార్యనెలా అవుతాను?

నాల్గవవాడైన బ్రాహ్మడు జీవదత్తుడు కూడా నాకు అభిమతుడుకాడు. అతను విరూపుడు, వికర్మస్థుడు, వేదరహితుడు, కాబట్టి పతితుడు. అతను మీ దండన కర్హుడు. అంతేకానీ నన్నెలా అతని కిస్తారు? నీవు రాజువు గనుక వర్ణాశ్రమ ధర్మాలను రక్షింపవలసిన వాడవు.

ఖడ్గశూరుని కంటే ధర్మశూరుడు ప్రశస్తుడు. ఖడ్గశూరులు వేయి మందికి ధర్మశూరుడు ప్రతికాగలడు."

ఈ విధంగా చెప్తున్న కుమార్తెను అంతఃపురానికి తీసుకొని పోయి అక్కడ వదలివేసి స్నానాద్యర్థమై రాజు వెళ్ళిపోయినాడు.

రెండవరోజున ఆ వీరులు నలుగురూ ఆ క్షత్త గృహంనుంచి బయలుదేరి నగరమంతటా కుతూహలంతో తిరిగినారు. ఈ లోగా పద్మకబళం అను పేరుగల మదగజం గొలుసులను తెంచుకొని జనాన్ని చెల్లాచెదరు చేస్తూ గజశాలనుండి బయటకు వచ్చినది.

ఈ వీరులను చూచి చంపవలెనని ఆ మహాగజం వీరివెంట పడినది. వారుకూడా ఆయుధాలు ధరించి దాని కభిముఖంగా వెళ్ళినారు. వారిలో ఖడ్గధరాఖ్యుడైన క్షత్రియుడు మిగత ముగ్గురనూ నివారించి ఆ ఏనుగును తానే పడగొట్టినాడు. గర్జిస్తూ ముందుకు చాపిన దాని తుండాన్ని ఒకే దెబ్బతో తామరతూడును నరికివేసినట్టు అవలీలగా ఖండించివేసినాడు. దాని పాదమధ్యంలో

ప్రవేశించి, లాఘవాన్ని ప్రదర్శించి, ఆ ఏనుగు పృష్ఠంపై రెండవదెబ్బ తీసినాడు. మూడవదెబ్బతో దాని రెండుకాళ్ళనూ నరికివేసినాడు. అందుతో ఛీత్కారం చేస్తూ ఆ వారణం క్రింద పడి మరణించినది. ఆ వీరుని పరాక్రమాన్ని చూచి జనులందరూ విస్మితులైనారు.

ఈ సంగతిని రాజు మహావరాహుడు విని చిత్రీభూతుడైనాడు. మరునాడు గజారూఢుడై ఆ రాజు వేటకై వెళ్ళినాడు. ఆ ఖడ్గధరుడు మొదలైన వీరులు నలువురూ ఆయనను అనుసరించినారు. అక్కడ వ్యాఘ్రమృగ క్రోడాలను సైన్యంతోపాటు రాజు వేటాడుతుండగా గజఘీంకారాలను విన్న సింహాలు క్రోధంతో పరువెత్తి వచ్చినవి.

అప్పుడు పైకెగిరి వస్తున్న సింహాన్ని ఖడ్గధరుడు ఒక తీక్ష్ణ ఖడ్గప్రహారంతో రెండుగా చేసివేసినాడు. రెండవదానిని తీసుకొని, ఎడమ చేతితో దాని కాళ్ళను పట్టుకొని, నేలమీదవేసి కొట్టి గతజీవితాన్ని చేసివేసినాడు. భాషాజ్ఞుడు, జీవదత్తుడు, పంచపట్టికుడూ ఒక్కొక్కరే ఒక్కొక్క సింహాన్ని ఆ విధంగా నేల మీదవేసి కొట్టినారు.

ఈ విధంగా రాజుకళ్ళ ఎదుటనే పాదచారులయ్యే ఆ ధీరులు అవలీలగా సింహవ్యాఘ్రాదులను చంపివేసినారు.

అప్పుడు విస్మితుడై, సంతుష్టుడై వేటను పూర్తిచేసుకొని ఆ రాజు పట్టణం లోనికి తిరిగి ప్రవేశించినాడు. ఆ వీరులేమో క్షత్త గృహానికి వెళ్ళిపోయినారు.

రాజు అలసిపోయి ఉన్నప్పటికీ అంతఃపురంలో ప్రవేశించీ ప్రవేశించగానే తన కూతురు అనంగరతిని పిలిపించినాడు. ఆ

వీరులలో ఒక్కొక్కరి పరాక్రమాన్నీ వివరించి వేటలో తాను చూచినదంతా ఆమెకు చెప్పి ఆశ్చర్య పరచినాడు.

"పంచపట్టిక భాషాజ్ఞు లిద్దరూ అవర్ణులైతే, విప్రుడు జీవదత్తుడేమో రూపహీనుడు, కర్మబాహ్యుడు. ఆ క్షత్రియుని మాటేమిటి? క్షత్రియుడైన ఖడ్గధరునిలో దోషమేమున్నది? అతను సురూపుడు, సుప్రమాణుడు. బల విక్రమశాలి. అతను అంత ఏనుగును ఆ విధంగా నేలమీద పడవేసి చంపివేసినాడు. సింహాలను కాళ్ళను పట్టుకొని తిప్పి నేలకొడుతున్నాడు. ఖడ్గాలతో ఇతరాలను చంపుతున్నాడు. దరిద్రుడు, సేవకుడు అని అతనిలో దోష మారోపిస్తే నేను అతనికే ఇతరులు సేవ చేసేటట్టుగా వానిని ఒకక్షణంలో ప్రభువును చేయగలను. నీకిష్టమైతే అతనిని భర్తగా వరించు" అని చెప్పినాడు.

ఆ అనంగరతి ఆ మాటలకు తండ్రితో ఇట్లన్నది: "వారినందరినీ పిలిపించండి. వారిలో ఒక్కొక్కరిని గురించి గణకుని అడగండి. అతనేం చెప్తాడో తెలుసుకుందాం." ఈ విధంగా ఆమె చెప్పగా రాజు అక్కడికి ఆ వీరులను పిలిపించినాడు. ఆమె ఎదుటనే ఆమె కోర్కెను మన్నించి గణకుని స్వయంగా ప్రశ్నించినాడు.

"ఈ అనంగరతికి వీరిలో ఎవరితో పొంతనం కుదురుతుంది? వారి కనుకూలమైన లగ్నమేది? చెప్పవలసింది."

ఆ మాటవిని వారి నక్షత్రాల నడిగి తెలుసుకొని ఆ జ్యోతిష్కుడు చాలకాలం లెక్కలు వేసి ఆ రాజుతో ఇట్లన్నాడు: "దేవా! నా మీద మీరు కోపగించుకొనక పోతే ఉన్నదున్నట్టు చెప్తాను. వీరిలో ఏ ఒక్కరితోనూ మీ పుత్రికకు అనుకూల్యం

లేదు. ఈమెకు వారిలో వేనికీ తగిన వివాహలగ్నం కూడా లేదు. ఈమె శాపచ్యుతురాలు, విద్యాధరి. ఆ శాపంనుంచి మూడు నెలలలో ఈమెకు విముక్తి కలుగుతుంది. అందువల్ల ఈ మాస త్రయమూ వారుకూడా ఇక్కడే ఉండనివ్వండి. వీరిలో ఒకరు స్వలోకానికి పోకపోతే అప్పుడు ఈ లోకం లోనే వివాహం జరుప వచ్చును."

ఈ విధంగా ఆ మౌహూర్తికుడు చెప్పిన మాటలను అందరూ విని నమ్మినారు. ఆ వీరులు ఆ మూడునెలలూ అక్కడే ఉండి పోయినారు.

మూడునెలలు పూర్తి కాగానే ఆ రాజు ఆ వీరులను, ఆ గణకుని, ఆ అనంగరతిని తన సన్నిధానానికి పిలిపించినాడు. ఆ రాజు, హఠాత్తుగా తన కుమార్తె అధిక సౌందర్యవతిగా కని పించడంతో సంతోషించినాడు. గణకుడేమో ఆమెకు కాలం ఆసన్న మైనదని భావించినాడు. "ఇప్పుడు ఏది యుక్తమో చెప్పండి? మూడునెలలు గడచిపోయినవి గదా!" అని ఆ రాజు ఆ గణకుని అడుగుతుండగనే అనంగరతి తన పూర్వజన్మలోని నిజ రూపం స్మరించుకొని తన్ను ఉత్తరీయంతో కప్పుకొని ఆ మానవదేహాన్ని వదలివేసినది.

ఏమిటీమె ఇలా ఉన్నదని రాజు స్వయంగా ఆమె ముఖం మీదినుండి ఉత్తరీయం తొలగింపగా ఆమె చనిపోయి ఉన్నది. నేత్రభ్రమరాలు వ్యావృత్తములైనవి. వదనాంబుజం వివర్ణ మైనది. హిమహత అయిన పద్మినివలె హంసమంజు స్వనోన్ముక్త అయినది.

అంతట ఆ శోకవజ్రపాతంతో హతుడై ఆ భూధరుడు (పర్వతమని శ్లేష) నిశ్చేష్టుడై స్వపక్షచ్ఛేదంతో మూర్ఛితుడైనట్టు

పడిపోయినాడు. రాణి పద్మరతికూడా వ్యామోహపతితురాలై నది. గాలికి పుష్పాభరణాలు పడిపోగా మంజరి క్రిందపడినట్లైనది. పరిజను లందరూ ఆక్రందనం చేస్తుండగా, ఆ వీరులంతా దుఃఖిస్తుండగా స్పృహవచ్చిన మహారాజు జీవదత్తునితో ఇట్లన్నాడు :

"ఇతరులశక్తికి ఈ సమయంలో ప్రయోజనం లేదు. నీ శక్తికే అవసర మున్నది. చనిపోయిన స్త్రీని బ్రతికిస్తానని నీ వింతకుముందు చెప్పి ఉన్నావు. నీ కా విద్యాబలమే ఉంటే నా పుత్రికను బ్రతికించు. ఈమెకు ప్రాణదానం చేసిన విప్రుడైన నీకే ఈమెను దానం చేస్తాను."

ఈ రాజుమాట విని జీవదత్తుడు అభిమంత్రించిన జలాన్ని ఆమెపై చల్లి రాజపుత్రిని గూర్చి ఈ అర్య (కందమువంటి సంస్కృత పద్యం) ను పఠించినాడు.

"అట్టాట్టహాస హసితే కరంక మాలాకులే దురాలోకే
చాముండే వికరాలే సాహాయ్యం మే కురు త్వరితమ్"

అని ఈ విధంగా జీవదత్తుడు యత్నించగా ఆ బాల జీవింపలేదు.

అతను విషణ్ణుడైనాడు. "వింధ్యవాసినీదేవి నాకు అనుగ్రహించిన విద్యకూడా నిష్ఫలమై పోయినది. ఈ నగుబాట్ల బ్రతుకుతో నా కిక పనియేమి?" అని చెప్పి జీవదత్తుడు పెద్ద కత్తితో తన తలను నరకుకొనుటకు ప్రయత్నిస్తుండగానే ఆకాశవాణి ఇట్లా వినిపించినది : "ఓ జీవదత్తా! ఈ సాహసం చేయవద్దు. ఇప్పటికి నామాట విను. ఈ అనంగరతి ఆ విద్యాధర కన్యకే. తండ్రి శాపంవల్ల ఇంతకాలం మనుష్యరూపంలో ఉండినది. ఈ తనువును త్యజించి వెళ్ళిపోయి స్వలోకంలో, స్వదే

హంలో ప్రవేశించినది. నీ వా వింధ్యవాసినీదేవి వద్దకే వెళ్ళి తిరిగి ఆరాధించు. ఆమె అనుగ్రహంవల్ల ఈ విద్యాధరిని భార్యగా పొందగలవు. ఈ దివ్య భోగస్థురాలైన కన్యను గూర్చి ఓరాజా! నీవుకూడా దుఃఖించవలసిన పనిలేదు'' అని సత్యాన్ని దివ్యవాణి వినిపించి విరమించినది.

ఆ తర్వాత రాజు తన కుమార్తెకు అంత్యసంస్కారం చేసి దుఃఖించడం మానివేసినాడు. భార్యకూడా ఆయనను అనుసరించి నది. మిగత ముగ్గురు వీరులూ తమకు తోచిన చోటికి వెళ్ళిపోయి నారు. ఇంకా ఆశకల జీవదత్తుడు వింధ్యవాసినీదేవి వద్దకు వెళ్ళి ఆరాధిస్తూ తపస్సుచేసినాడు. స్వప్నంలో ఆమె కనబడి ఇలా ఆదేశించినది.

## అనంగప్రభావృత్తాంతం

"నీయెడల నేను సంతుష్టురాలనైనాను. ఒక సంగతి చెప్తాను విను:

హిమాచలంలో వీరపురం అనుపేరుగల నగరమున్నది. ఆ పట్నంలో సమరుడు అను పేరుగల విద్యాధరరాజు కలడు. అతని రాణి అనంగవతి. వారికి అనంగప్రభ అను పేరుగల కుమార్తె కల్గినది. ఆమె రూపయౌవనోత్సుక అయి ఎవరినీ పతిగా ఒప్పుకొనలేదు. ఆమె మొండిపట్టుదలకు కోపించిన తలిదండ్రులు ఆమె నిలా శపించినారు: "నీవు మానవమాత్రురా లగుదువు గాక! కన్యగానే ఉండి పదునారేళ్ళ ప్రాయంలో ఆ శరీరాన్ని వదలి ఇక్కడికి వస్తావు. మర్త్యుడు, విరూపుడు, ఖడ్గసిద్ధుడు నీకు పతి కాగలడు. అతడు ముని కన్యాభిలాషవల్ల శాపంపొంది మర్త్యత్వం పొందినాడు. నీ కిష్టం లేకపోయినా నిన్ను మర్త్యు

లోకానికి తీసుకొనిపోతాడు. మరొకరు నిన్ను తీసుకొనిపోవడం వల్ల నీతో అతనికి వియోగం కలుగుతుంది.

పూర్వజన్మంలో అతను పరస్త్రీలను ఎనమండుగురిని అపహరించినాడు. కాబట్టి ఆ ఎనిమిది జన్మలలో భోగార్హమైన దుఃఖాన్ని అతను అనుభవిస్తాడు. నీ విక్కడ ఒకే జన్మలో ఎనిమిది జన్మాల దుఃఖాన్ని అనుభవిస్తావు.

విద్యలన్నీ ధ్వంసమై మానవమాత్రురా లవుతావు. సర్వులకూ పాపిష్ఠి సంపర్కమే ఆ పాపంలో భాగం పంచుకొనేట్టు చేస్తుంది. ఒక పాపి అయిన భర్తతోసంగమం స్త్రీలకు ఆ పాపాన్ని పూర్తిగా అనుభవించేట్టు చేస్తుంది. నష్టస్మృతివై బహు మానవులను నీవు భర్తలుగా చేపడతావు. దీనికంతా కారణం నీకు తగిన వరునికూడా నువు ద్వేషించడం, అలా పట్టుపట్టడము. ఖేచరుడైన మదనప్రభుడు నీకు సమానుడు. నిన్ను భార్యగా కోరినవాడు. అతను మనుష్యుడై ఆఖరున నీకు భావిపతి కాగలడు. అందువల్లనే నీవు శాపనిర్ముక్తవై స్వలోకానికి తిరిగి వస్తావు. ఆ ఖేచరీభూతుడైనవానిని నీవు తగిన పతిగా పొందగలవు.

ఈ విధంగా తండ్రిచే శప్తురాలై ఆమె అనంగరతిగా భూమిలో పుట్టినది. ఇప్పుడు తండ్రి సమీపంలో అనంగప్రభగా తిరిగీ జన్మించినది. అందువల్ల నీవు వీరపురానికి వెళ్ళి అతని తండ్రిని, కౌలీనరక్షితుడని తెలిసినప్పటికీ జయించి ఆమెను పొందగలవు. ఈ ఖడ్గాన్ని తీసుకొమ్ము. దీనిని చేతధరిస్తే ఆకాశగమనం చేయగలవు. అజేయుడవు అవుతావు''

అని చెప్పి ఈ విధంగా ఆదేశించి ఒక ఖడ్గాన్ని అతనికిచ్చి ఆ దేవి తిరోధానం చెందినది.

అతను మేల్కాంచి తన చేతిలో ఖడ్గం ఉండడం చూచు కొన్నాడు. అందుతో ఎంతో సమ్మోదం చెంది లేచి, అంబికకు నమస్కరించి ఆమె ప్రసాదమనే అమృతంతో ఆప్యాయత చెంది తన తపఃఫలంవల్ల ఎంతైనా ముందటి క్లేశాన్నంతటినీ మరచి పోయినాడు.

అతను ఖడ్గహస్తుడై ఆకసాని కెగిరి హిమాలయమంతా పరిభ్రమించి జీవపురస్థుడైన సమరుడనే ఖేచరేశ్వరుని వద్దకు చేరుకొన్నాడు. అతనిని యుద్ధంలో జయించి అతను అనంగ ప్రభ నివ్వగా పరిణయం చేసుకొని దివ్యసంపదను అనుభవించి నాడు.

కొంతకాలం అక్కడఉండి మామగారైన సమరునితోను, అనంగప్రభతోను జీవదత్తు డిట్లన్నాడు: "నాకు ఇంటికి పోవలె నని ఉత్కంఠగా ఉన్నది. అందువల్ల మనుష్యలోకానికి వెడ తాను. ఎంత నికృష్టమైనదైనా తమ జన్మభూమి ప్రాణులకు పరమప్రియమైనది కదా!"

ఈ మాటవిని మామ అందుకు ఆమోదించినాడు. ఇదంతా తెలిసిన అనంగప్రభ అతికష్టం మీద ఆమోదం తెల్పింది. ఆమెను ఒడిలో కూర్చుండ బెట్టుకొని జీవదత్తుడు గగనం నుంచి భూలోకా నికి దిగినాడు. అక్కడ ఒకానొక రమణీయమైన పర్వతాన్ని చూచి ఆమెతో ఇట్లన్నాడు: "అలసి పోయినావు గనుక ఓ అనంగప్రభా! వెంటనే ఇక్కడ కొంత విశ్రాంతిని తీసుకొన వలసింది." ఆమె సరేననగా అక్కడే అతను ఆమెతో పాటు దిగినాడు. విద్యాప్రభావం వల్ల ఆహారపానాదులను పరిపూర్తి చేసుకొన్నాడు.

ఆ తర్వాత విధిప్రేరితుడైన జీవదత్తుడు, అనంగప్రభతో ఇట్లన్నాడు: "ఓ ప్రియా! ఏదైనా మధురమైన గీతమొకటి గానం చెయ్యి." ఆ మాట విని ఆమె భక్తితో ధూర్జటిని స్తుతిస్తూ గానం చేయసాగినది. ఆ పాటతో ఆ బ్రాహ్మడు నిద్రపోయినాడు. ఇంతలో వేటకు వచ్చి అలసిపోయి, సెలఏటి నీళ్ళకోసమై హరివరుడు అను రాజు ఆ మార్గంలో వచ్చినాడు. అతనా పాట విని ఆకృష్టుడై అక్కడ రథాన్ని ఆపి ముందుకు వచ్చినాడు.

పూర్వమే చెప్తున్న శుభశకునాలను చూచి, ఆ భూపతి నిజమైన అనంగుని ప్రభవంటి ఆ అనంగప్రభను చూచినాడు. ఆ పాటవల్లను, ఆమె రూపం వల్లనూ వివశుడైన అతని హృదయాన్ని మదనుడు తన బాణాలతో ఇచ్చవచ్చినట్టు ఛేదించినాడు. ఆమె కూడా అతనిని చూచి, పుష్పధన్వుని కళ్ళఎదుట పడి అనంగప్రభ ఒక క్షణ కాలంలో ఆలోచించుకొన్నది: "ఎవరితను? మనోభవుడు పుష్పచాపాన్ని గురిపెట్టినాడేమిటి? నా గానంతో సంతుష్టి చెందిన ఈశ్వరుని అనుగ్రహం ఇలా మూర్తీభవించినదా?''

ఈ విధంగా తలపోసుకొంటూ ఆ మదనమోహిత అతనినిట్లా అడిగినది: "నీవెవ్వరవు? ఈ వనానికెలా వచ్చినావో చెప్పవలసింది." అప్పుడు అతను జరిగిన సర్వవృత్తాంతాన్నీ తెలియజెప్పినాడు. ఆ రాజు అప్పుడామెను "ఓ సుందరీ! నీవెవ్వరు?'' అని ప్రశ్నించినాడు. "ఇక్కడ సుప్తస్థితుడై ఉన్న అతనెవ్వరు?'' అన్నాడు.

ఈ విధంగా రాజడుగగా అనంగప్రభ సర్వవృత్తాంతాన్నీ సంక్షిప్తంగా చెప్పినది. "నేనొక విద్యాధరిని. ఈ ఖడ్గసిద్ధుడు నా భర్త. నిన్ను చూడగానే నీపై అనురాగం కలిగినది. వెంటనే

మనం నీ పట్నానికి వెళదాం పద. ఇతను నిద్రలేవక ముందే వెళ్ళిపోతే అక్కడ నీకు సవిస్తరంగా అంతటినీ చెప్తాను.''

ఈ మాటవిని ఆ రాజు సరేనని త్రైలోక్యరాజ్య సంప్రాప్తి చెందినట్టు హర్షాన్ని పొందినాడు. రాజును తన ఒడిలో కూర్చుండ బెట్టుకొని ఆకసాని కెగిరి వెళ్ళిపోతాను—అని అనుకున్న అనంగ ప్రభ అంతలోనే తనలో తలపోసుకొన్నది: భర్తృద్రోహంవల్ల తను విద్యాభ్రష్ట అయినదని, తండ్రిశాపాన్ని తలచుకొని దుఃఖితు రాలైనది.

అలా ఆమె విషణ్ణురాలు కాగా ఆ విషణ్ణురాలుగా ఉన్న ఆమెను చూచి కారణ మడిగి ఇట్లన్నాడు: "ఇది దుఃఖించవలసిన సమయం కాదు. నీ పతి మేల్కొనవచ్చును. ఇదంతా దైవా యత్తమైనది. దీనినిగూర్చి దుఃఖించవలసిన అవసరం లేదు. తన తలనీడను, విధిగతిని ఎవడుమాత్రం ఉల్లంఘించగలడు? కాబట్టి పోదాం పద."

ఈ మాటవిని అతనిని విశ్వసించినది. ఆ రాజు హరివరుడు ఆమెను తన ఒడిలో నిడుకొని ఏదో నిధానము లభించినట్టుగా సంతుష్టుడై అతివేగంగా అక్కడినుండి వెళ్ళి తన భృత్యులు అభి నందిస్తుండగా తన రథాన్ని అధిరోహించినాడు. మనోవేగగామిని అయిన ఆ రథంలో రమణీయుక్తుడై ప్రజలకు కుతూహలం కల్పిస్తూ తన పట్టణం చేరుకొన్నాడు.

స్వనామ లాంఛితమైన ఆ నగరంలోనికి వెళ్ళి అతను అనంగప్రభతో పాటు దివ్యసుఖాలను అనుభవిస్తూ ఉన్నాడు. ఆ అనంగప్రభకూడా అతనిమీదనే అనురాగంతో, శాపవిమోహితు రాలు గనుక తన ప్రభావాన్నంతటినీ మరచిపోయి అక్కడే ఉండినది.

ఈలోగా ఆ కొండమీద జీవదత్తుడు మేల్కాంచి అనంగ ప్రభనే కాక తన ఖడ్గాన్నికూడా కనుగొనలేక పోయినాడు. "ఆ అనంగప్రభ ఎక్కడికి వెళ్ళినదో తెలియదు. ఆ ఖడ్గ మేమైనదో తెలియదు. ఆమె దానిని తీసుకొని వెళ్ళిపోయినదా? లేక ఆమెను దానినికూడా ఎవరైనా కొనిపోయినారా?" అని ఉద్భ్రాంతుడై అనేక తర్కవితర్కాలను చేసుకొంటూ మూడురోజులు స్మరాగ్నితో దహ్యమానుడౌతూ ఆ కొండంతటా వెదకినాడు.

ఆ తర్వాత క్రిందికి దిగి అరణ్యంలో పదిరోజులు తిరిగినాడు. ఎక్కడా ఆమె అడుగుజాడైనా కనబడలేదు. 'ఓ దుర్విధీ! అతి కష్టంమీద ఆమె దొరికినప్పటికీ అపహరించినావు. ఖడ్గసిద్ధితో పాటూ నా ప్రియురాలు అనంగప్రభకూడా అపహృత అయినది' అని ఆక్రందనం చేస్తూ నిరాహారుడై ఆ అడవి అంతటా తిరిగి తిరిగి ఒక గ్రామాన్ని చేరుకొన్నాడు. అక్కడ సంపన్నమైన ఒక విప్రగృహంలోనికి ప్రవేశించినాడు. ఆ ఇంటిఇల్లాలు సుభగురాలు, సువస్త్రాభరణాంకితురాలు. ఇతనిని చూచి కూర్చుండ బెట్టినది. తన పరిచారికలను పిలిచి ఆ ప్రియదత్త అను నామె ఇలా ఆదేశించినది: "ఈ జీవదత్తుని పాదాలను వెంటనే పరిశుభ్రంగా కడగండి. విరహంవల్ల అతను ఆహారం తిని నేటికి పదమూడు రోజులైనది."

ఈ మాటవిని విస్మితుడై జీవదత్తుడు తనలో ఇట్లా తర్కించుకొన్నాడు: "ఆ అనంగప్రభే ఇలా వచ్చినదా? లేక ఈమె ఏదో యోగినీరూపి కావచ్చునా?" అని ఆలోచిస్తూ కాళ్ళుకడుగుకొని వారు పెట్టిన భోజనాన్ని తిని ప్రణతుడై ప్రియదత్తను ఎంతో ఆర్తితో ఇట్లా ప్రశ్నించినాడు: "ఓ ఉత్తమురాలా! నా

సంగతి నీ కెలా తెలుసునో చెప్పు. ఇంకొకటి, నా ప్రియురాలు, ఖడ్గము ఎక్కడికి వెళ్ళినవో తెలియజెయ్యి.''

ఆ మాటవిని పతివ్రత అయిన ఆ ప్రియదత్త అతనితో ఇట్లన్నది: "అయ్యా! నా భర్తతో మరొకరు నా మనసులో కలలోకూడా కాలిడలేరు, పుత్రులుగా, సోదరులుగా ఇతర పురుషుల నందరినీ భావిస్తాను. నేను పూజింపకుండా మా ఇంటికివచ్చిన ఏ అతిథీ వెళ్ళడు. ఈ ప్రభావంవల్ల భూత భవిష్య ద్వర్తమానా లన్నీ నాకు తెలుసును—ఆ నీ అనంగప్రభను హరివరుడనే రాజు కొనిపోయినాడు. ఆ సమయంలో నీవు విధివశంతో నిద్రిస్తుండగా ఆ దారినిపోతున్న రాజు, ఆమె గీతాలాపంతో ఆకృష్టుడై అక్కడికి వచ్చినాడు. అతని పట్టణం పేరుకూడా హరివరమే. ఆ అనంగప్రభను నీవు పొందడం శక్యం కాదు. ఆ రాజు మహాబలుడు. ఆ కులట తిరిగీ అతనినికూడా వదలిపెట్టి ఇంకొక చోటికి వెళ్ళగలదు.

దేవి నీ కిచ్చిన ఖడ్గం ఆమెను పొందుట కోసమయ్యే గనుక ఆమె అపవిత్రురాలు కాగానే ఆ ఖడ్గం దివ్యత్వంవల్ల దేవి సమీపానికే వెళ్ళిపోయినది. అంతేకాక ఆ దేవి అనంగప్రభ శాపాన్ని గురించి నీకు కలలో వివరిస్తూ ఏమి చెప్పినదో అదంతా నీ వెలా మరచిపోయినావు? ఈ భవితవ్యాన్ని గూర్చి వ్యామోహం నీ కెందుకు? అది వృథా! ఈ పాపానుబంధాన్ని త్యజించు. పదే పదే నీకు దీనివల్ల దుఃఖం కలుగుతున్నది. అన్యానురక్తురాలైన ఆ పాపిష్ఠురాలితో నీ కిప్పు డేమి పని? ఆమె మానవమాత్రురాలే కదా! భర్త అయిన నీకు ద్రోహం చేయడంవల్ల తన విద్యల నుంచి భ్రష్టురాలైనది కూడా'' అనగా అతను అనంగప్రభమీది

వ్యామోహాన్ని వదలివేసినాడు. ఆమె చాపల్యం యెడల విర క్తుడై జీవదత్తుడు ప్రియదత్తతో ఇట్లన్నాడు:

"నా మోహం నీ మాటల వల్ల శాంతి చెందినది. మీ మాటలు నిజం. పుణ్యకర్ములతో సమాగమం ఎవరికి మాత్రం శ్రేయస్సంధాయి కాదు? పూర్వ పాపవశం వల్ల ఈ పాపం నాపై పడినది. దానిని క్షాళనం చేసుకొనుటకై మత్సరాన్ని ఉజ్జగించి తీర్థయాత్రలకు వెళతాను. అనంగప్రభకోసమని నేను ఇతరులతో వైరం కల్పించుకొనడం వల్ల ప్రయాజనమేమిటి? జితక్రోధుడైన వాడు సర్వజగత్తునూ జయించగలడు."

ఈ విధంగా అతను చెప్తుండగా అప్పటికి ఆమె భర్త ఇంటికి వచ్చినాడు. ఆయన అతిధార్మికుడు, అతిథివత్సలుడు. ఆయనకూడా అతిథి సత్కారాన్ని చేయగా జీవదత్తుని దుఃఖం మరింతగా ఉపశమించినది. కాసేపు విశ్రమించి వారిద్దరిని వీడ్కొని తీర్థయాత్రార్థమై జీవదత్తుడు బయలుదేరినాడు. అలా మొదలు పెట్టి భూలోకంలోని తీర్థాల నన్నిటినీ ఆయన దర్శించినాడు. అనేక కాంతార భూములలో కందమూల ఫలాశనుడై అనేక కష్టాలను పడినాడు. తుదకు తీర్థాలన్నీ తిరిగి వింధ్యవాసినీ దేవి వద్దకే చేరుకొన్నాడు.

అక్కడ దర్భాసనంపై కూర్చుని నిరాహారుడై తీవ్రంగా తపస్సుచేసినాడు ఆ తపస్సుతో సంతుష్టురాలైన అంబిక సాక్షాత్కరించి ఇట్లన్నది: "కుమారా! లే. మీరు ముగ్గురూ నా గణములు. ఒకడు పంచమూలుడు. రెండవవాడు చతుర్వక్త్రుడు. మూడవవాడు మహోదరుడు. వారిలో నీవు నాల్గవవాడవు. నీ పేరు వికటవదనుడు. మీరందరూ క్రమంగా ఉత్తములు. మీరు

ఒకప్పుడు విహరించడానికి గంగానదీ సైకతాలకు వెళ్ళినారు. అక్కడ స్నానం చేస్తున్న ఒక మునికన్యకను మీరు చూచినారు. ఆమె పేరు చాపలేఖ. కపిలజటాఖ్యుడు అయిన ముని కుమార్తె. మదనార్తులైన మీరందరూ ఆమెను ప్రార్థించినారు.

"నేను కన్యను. మీరు వదలిపెట్టండి" అని ఆమె అన్నది. ఆ ముగ్గురూ ఊరకున్నారు. నీవుమాత్రం బలవంతంగా ఆమె చేతిని పట్టుకున్నావు. ఆమె "నాన్నా! నాన్నా! రక్షించు" అని ఆక్రందించినది.

ఆ మాటవిని దాపుననున్న ముని క్రుద్ధుడై వచ్చినాడు. ఆయనను చూచి నీవామెను వదలివేసినావు. అప్పుడాయన మిమ్ములను శపించినాడు. "పాపిష్ఠులైన మీరందరూ మానవ జాతిలో పుట్టుదురు గాక!"

అప్పుడు ఆయనను శాపాంతంకోసమై మీరు ప్రార్థింపగా ఆయన ఇట్లన్నాడు: "రాజ కుమార్తె అయిన అనంగరతిని కోరినపుడు విద్యాధర లోకానికి వెళ్ళి మిగత ముగ్గురూ విముక్తులౌతారు. నీవేమో విద్యాధరీభూత అయిన ఆమెను ప్రార్థించి అపహరిస్తావు. ఆమెను పొందిన తర్వాత ఓ వికటవదనా! నీవు అనేక బాధలకు లోనవుతావు. చాలకాలానికి దేవిని ఆరాధించి నా శాపం నుంచి విముక్తుడౌతావు. నీవు ఈ చాపలేఖను చేయి పట్టుకొని లాగడంతో పరదారాపహరణం వల్ల కలిగే పాపం నీపై పడినది" అని ఈ విధంగా నా గణాలైన మిమ్ములను ఆ మహర్షి శపించినాడు" అని ఆ దేవి ఇంకా చెప్పసాగినది.

"—ఆ తర్వాత మీరు దక్షిణాపథంలో నలుగురు వీరులుగా జన్మించారు. పంచపట్టిక, భాషాజ్ఞులు, ఖడ్గధరుడు, ఈ ముగ్గురు

నీ స్నేహితులు. నాల్గవవాడైన నీ వేమో జీవదత్తకుడవు. ఆ వారేమో అనంగరతి తనలోకానికి వెళ్ళిపోగానే ఇక్కడికే వచ్చి నేను ప్రసన్నురాలైనందువల్ల శాపంనుంచి విముక్తులైనారు. నీవు ఇప్పుడు నన్నారాధించినందువల్ల నీకు కూడా శాపవిమోచనం కలిగింది. కాబట్టి నీవు ఆగ్నేయీధారణను గ్రహించి నీ దేహాన్ని వదలిపెట్టవలసింది. అష్టజన్మాలలో అనుభవించవలసిన పాతక మంతా దహించి వేసుకో."

ఇలా చెప్పి ఆ దేవి ధారణనిచ్చి తిరోహితురాలైనది. ఆ ధారణతో అతడు మర్త్యదేహాన్ని, తన పాపాన్నీ కూడా దహించి వేసుకొన్నాడు. ఆ జీవదత్తుడిలా చిరకాలానికి శాపనిర్ముక్తుడై గణోత్తముడుగా జనించినాడు. దేవతలకైనప్పటికీ ఈ పాపంతో ఇంత క్లేశం కలుగుతుండగా, పరస్త్రీ సంగమం వల్ల కలిగిన హానినుంచి మరొకరు ఎలా తప్పించుకోగలరు?

ఇంతలో అక్కడ హరివరపురంలో ఆ అనంగప్రభ హరి వరుని అంతఃపురంలో ముఖ్యురాలైనది. ఆ రాజు ఏకాగ్ర మనస్కుడై రాత్రింబవళ్ళూ ఆమెతోనే ఉండిపోయినాడు. తన మంత్రి అయిన సుమంత్రుని పై రాజ్యమహాభారాన్ని ఉంచి వేసినాడు.

ఒక సారి ఆ రాజు సన్నిధికి మధ్యదేశం నుంచి లబ్ధవరుడు అను పేరుగల ఒక కొత్త నాట్యాచార్యుడు వచ్చినాడు. అతనికి వాద్యనాట్యాదులలో ఉన్న ప్రావీణ్యాన్ని చూచిన రాజు సమ్మా నించి అంతఃపుర స్త్రీలకు నాట్యాచార్యునిగా నియమించినాడు. అతని మూలంగా అనంగప్రభ నృత్తంలో ప్రకర్షను పొందినది. నృత్తం చేస్తూ కూడా సపత్నులకు అభిలషణీయురాలైనది. సహ

వాసం వల్లను, ఆయన నేర్పుతున్న నృత్త శిక్షారసం వల్లను ఆ అనంగప్రభ నాట్యాచార్యునిపై అనురక్త అయినది.

ఆమె రూప నృత్తాలతో మెలమెల్లగా ఆకృష్టుడై నాట్యాచార్యుడు కూడా కామంతో నృత్యం చేయసాగినాడు.

ఒకసారి విజనంగా ఉన్న నాట్యమందిరంలో ఆ అనంగప్రభ బలాత్కారంగా నాట్యాచార్యునిపై పడి రతిలాలస అయినది. సురతాంతంలో అత్యంతానురక్తురాలైన ఆమె అతనితో ఇట్లన్నది:

"నిన్ను విడిచి నేను ఒక క్షణంకూడా ఉండజాలను. ఈ సంగతి హరివర మహారాజునకు తెలిస్తే క్షమించడు. కాబట్టి రాజునకు తెలియని చోటకి ఎక్కడికైనా వెళ్ళిపోదాం రా. నాట్యంతో సంతుష్టుడైన రాజుగారిచ్చిన బంగారం, గుఱ్ఱాలు, ఒంటెలు మొదలైన ధనం నీ దగ్గర కలదు. అలాగే నాకిచ్చిన ఆభరణాదులూ కలవు. కాబట్టి మనం త్వరగా నిర్భయంగా ఉండగలిగిన చోటికి వెళ్ళి పోదాం పద."

ఈ మాటలకు నాట్యాచార్యుడు సంతోషించి అందులకు ఆమోదించినాడు.

ఆ తర్వాత ఆ అనంగప్రభ పురుషవేషం ధరించి తన ప్రాణసఖితో కలిసి నాట్యాచార్యుని ఇంటికి వెళ్ళినది. అక్కడి నుంచి అప్పుడే ఒంటెలపై ధనాదులను ఎక్కించిన అతనితో కలిసి ఆమె తురగారూఢ అయి ఆ నాట్యాచార్యునితో పాటూ బయలుదేరినది.

ఆమె మొదట విద్యాధరిగా ఉండి ఆ ఐశ్వర్యాన్ని వదలి వేసి, రాజ్యలక్ష్మిని పొంది దానినిగూడా త్యజించి, చారణార్థిని ఆశ్రయించినది. ఛీ . .ఛీ . స్త్రీల మన సెంత చపలము?

ఆ విధంగా ఆ నాట్యాచార్యునితో కలిసి అనంగప్రభ దూరంలో నున్న వియోగపురం అను పేరుగల నగరాన్ని చేరు కొన్నది. అక్కడ అతనితో కలిసి సుఖంగా ఉన్నది. తనకు దొరికినదే చాల గొప్పదని సత్యమని ఆ నటాగ్రణికూడా భావించి నాడు.

అక్కడ రాజు హరివరుడు, తన ప్రియురాలైన అనంగ ప్రభ ఎక్కడికో వెళ్ళిపోయినదని తెలుసుకొని దుఃఖంతో దేహ త్యాగం చేయడానికని సిద్ధపడినాడు.

అప్పుడు మంత్రి అయిన సుమంత్రుడు ఆ భూపతిని ఓదార్చుతూ ఇట్లన్నాడు: "దేవా! నీకు తెలియని దేమున్నది? స్వయంగా పర్యాలోచించి చూడండి. తన భర్త అయిన ఖడ్గ విద్యాధరుని వదలిపెట్టి నిన్ను చేరినదంటే నీమీద మాత్రం ఆమె అనురాగం స్థిరంగా ఉంటుందని ఎందు కనుకోవాలి? మంచి వస్తు వులపై నిస్పృహురాలైన ఆమె ఏ లఘువస్తువులనో గ్రహించి వెళ్ళిపోయినది. తృణ రత్న శలాకవలె తృణదృష్టితోనే అనురక్తు రాలౌతున్నది. నాట్యాచార్యుడే తప్పకుండా ఆమెను కొనిపోయి ఉంటాడు. ఎందుకంటే అతనుకూడా కనబడడం లేదు. పైగా నృత్తమందిరంలో ఆ నాడు వారిద్దరూ కలిసి ఉన్నట్టు వింటు న్నాము. కాబట్టి ఓ దేవా! తెలిసికూడా ఆమెమీద మీకింత బలవ దనురాగ మెందుకు? విలాసిని ఎప్పుడూ సంధ్యవలెనే క్షణాను రాగిణి (సంధ్యాకాలంలో కనబడే అరుణిమ—అనురాగం చాలా సేపుండదు)."

ఈ విధంగా మంత్రి చెప్పగా విచారంలో మునిగిన ఆ రాజు ఇట్లా తలపోసుకున్నాడు: "ఈ బుద్ధిమంతుడైన మంత్రి సత్యమే చెప్పినాడు. విలాసిని భవస్థితివంటిది. పర్యంత విరసురాలు (వైరాస్యంలోనే అంతం కాగలది), కష్టురాలు. అనుక్షణం మారునది. అనిత్య సంబంధం కలది. పడిన వానిని లోనికి ముంచునవి, ఉత్కంఠను రేకెత్తునవి, అగాధములైనవి అయిన నదుల యందును, స్త్రీలయందును ప్రాజ్ఞుడు పడిపోడు.

వ్యసనాలలో నిరుద్వేగంగా, వైభవంలో గర్వరహితంగాను, కార్యాలలో నిర్భీకంగానూ ఉన్నవారే ధీరులు. వారు జగత్తునే జయించగలరు.

—ఈ విధంగా ఆలోచించి మంత్రివచనంవల్ల దుఃఖాన్ని త్యజించి ఆ రాజు హరివరుడు తన భార్యలతోనే సంతోషం చెందినాడు.

ఆ అనంగప్రభ వియోగపుర మనే పట్టణంలోనే ఆ నాట్యాచార్యునితో పాటు కొంతకాలం ఉండినది. అక్కడ కూడా దైవ వశాత్తూ ఆ నాట్యాచార్యునకు సుదర్శనుడు అనుపేరుగల యువకునితో స్నేహం ఏర్పడినది. అత డొక ద్యూతకారుడు. అతని వల్ల జూదంలో విపరీతంగా ధనాన్ని కోల్పోయి నాట్యాచార్యుడు ఆ అనంగప్రభముందే త్వరలోనే దరిద్రుడైనాడు.

ఆ రోషంతోవలె నిర్ధనుడైన అతనిని వదలిపెట్టి అనంగప్రభ ఆ సుదర్శనునే బలవంతంగా పతిగా ఆశ్రయించినది. ఆ నాట్యాచార్యుడు ధనాన్ని, భార్యనుకూడా పోగొట్టుకొని నిరాశ్రయుడై వైరాగ్యంతో తపస్సు చేసుకొందామని జడలుకట్టుకొని గంగా తటానికి వెళ్ళిపోయినాడు. నవనవప్రియ అయిన ఆ అనంగప్రభ ఏమో జూదగాడైన సుదర్శనునివద్ద ఉండిపోయినది.

ఒకసారి ఆమె భర్త సుదర్శనుడు దొంగలు తన సర్వ స్వాన్నీ ఒకరాత్రి దోచుకొని పోగా ఏమీ లేనివాడైనాడు. ఆ తర్వాత చేతిలో కాసులు లేనందువల్ల దుఃస్థితిపాలై సంతపిస్తూ అనంగప్రభను చూచి ఆ సుదర్శను డిట్లా అన్నాడు: "హిరణ్య గుప్తుడనే నాకొక స్నేహితు డున్నాడు. అతను చాల ధనవం తుడు. అతనివద్దకు వెళ్ళి ఏదో ఇంత అప్పుతీసుకొని వద్దాము" అని చెప్పి దైవహతబుద్ధి అయిన అతడు ఆమెతోపాటు వెళ్ళి వణిక్ప్రముఖుడైన ఆ హిరణ్యగుప్తుని అప్పివ్వవలసిందిగా కోరి నాడు. అక్కడ ఆ వర్తకుడు అనంగప్రభను చూచి, ఆమె ఆ వర్తకుని చూచి పరస్పరం మనసుపడినారు. అప్పుడా వర్తకుడు సుదర్శనునితో ఆదరంగా ఇట్లన్నాడు:

"ప్రొద్దున నీకు కావలసిన ధనమిస్తాను. ఇప్పటికి మీ రిక్కడే భోజనం చేయండి." ఆ మాటవిని వారిద్దరిమధ్య దు ర్భావమేదో కలదని సుదర్శనుడు తాను భోజనానికి ఉండలేనని, తన ఆరోగ్యం సరిగాలేదని అన్నాడు.

"సరే అలా అయితే పోనీ నీ భార్య ఇక్కడ భోజనం చేయనీ. తొలిసారిగా ఈమె మా ఇంటికి వచ్చినదిగదా" అని ఆ వర్తకు డనగా తాను జూదగాడైనా అతను ఊరికే ఉన్నాడు. ఆ అనంగప్రభతో పాటు వర్తకుడు అభ్యంతరం లోనికి వెళ్ళిపోయి నాడు.

అక్కడ తలవని తలంపుగా తనకు చిక్కిన ఆ సుదవిలాస వతితో పానాహారాదులతో ఆనందం చెందినాడు. సుదర్శనుడు ఆమె రాకకై నిరీక్షిస్తూ ఉండగా ఆ వర్తకుని భృత్యులు వర్తకుని ప్రేరణమీద సుదర్శనునితో ఇట్లన్నారు: "నీ భార్య భోజనం

ముగించి ఇంటికి వెళ్ళిపోయినది. ఆమె పోతుండగా నీవు చూడ లేదా? అదేమిటి నీ వింకా ఇక్కడేం చేస్తున్నావ్? ఇక వెళ్ళిపో వచ్చును.''

"ఆమె లోపలనే ఉన్నది. బయటకు రాలేదు. వచ్చేదాకా నేను వెళ్ళను'' అంటున్న ఆ సుదర్శనుని ఆ భృత్యులు కరపాద ప్రహారాలతో బయటికి గెంటివేసినారు.

అప్పుడా సుదర్శనుడు వెళ్ళిపోయి దుఃఖిస్తూ, "నాకు మిత్రుడైనప్పటికీ ఈ వర్తకుడు నాభార్యనెలా అపహరించినాడు? ఇక్కడే నా పాపం పండినది. నేను ఇతరులకు చేసినది నాకు మరొకరు చేసినారు. ఆ మరొకరిపై నేను కోపపడి ప్రయోజన మేమిటి? అసలు నేనుచేసిన పనిపైనే కోపపడవలెను కదా! నాకు మరొకరివల్ల పరాభవం కలుగకుండుటకై నాకిక జన్మలేకుండా చేసుకుంటాను'' అని ఆలోచించి కోపాన్ని విడనాడి బదరికాశ్రమానికి వెళ్ళి ద్యూతకారుడు అక్కడే భవనాశకమైన తపస్సును చేయసాగినాడు.

ఆ అనంగప్రభ ఆ రూపాధికుడైన వర్తకుని పతిగా పొంది తుమ్మెద ఒక పువ్వునుండి మరొక పువ్వుమీద వాలునట్టుగా అతనితో రమింప సాగినది.

క్రమంగా అతిభాగ్యవంతుడైన ఆ వర్తకునికి ఆమె యజమానురాలు, అనురాగవతి అయి అతనికి ప్రాణాధికురాలు, ధనాధికురాలు అయినది. అక్కడి రాజు వీరబాహుడు ఇలాంటి సుందరి ఒకతె కలదని తెలిసినప్పటికీ ధర్మమర్యాదను రక్షించువాడై ఆమెను అపహరింపలేదు.

కొన్ని దినము లిలా జరుగగా ఆ వర్తకుని ధనం తరిగిపో జొచ్చినది. బంధకి (కులట) గల ఇంటిలో కులస్త్రీవలె లక్ష్మి కృశించిపోతుంది గదా!

తర్వాత సువర్ణభూమి అను పేరుగల ద్వీపానికి వస్తు సంచయాన్ని తీసుకొని ఆ హిరణ్యగుప్తుడనే వర్తకుడు వాణిజ్యార్థమై వెళ్ళడానికి ఉద్యుక్తుడైనాడు. వియోగభీతితో ఆ అనంగ ప్రభను తనతో తీసుకొని వెడుతూ మార్గంలో క్రమంగా సాగర పురం అనే పట్టణాన్ని చేరుకొన్నాడు.

అక్కడ సాగరవీరుడు అను పేరుగల ధీవరుడు (బెస్త రాజు) ఆ సముద్రతీరానికి దగ్గరలోనున్న ఆ పట్టణంలో ఇతనితో కలిసినాడు. సముద్రంలోనే జీవిస్తున్న అతనితో సముద్రతీరానికి వెళ్ళి అక్కడనున్న పడవనెక్కి ప్రియాసఖుడై, అతను నావ నడుపుతుండగా వెళ్ళినాడు.

ఆ విధంగా సముద్రంలో ఆ సాగరవీరునితో పాటూ ఆ వర్తకప్రముఖుడు కొన్నిరోజులు గడిపినాడు.

ఒకరోజు జ్వలిస్తున్న విద్యుద్వ్విలోచనాలతో ఉగ్రము, సంహార భయంకరమూ అయిన కాలమేఘ మొక్కటి కానవచ్చినది. విపరీతమైన వర్షధారతో బలమైన ప్రంభజనంతో ఆ యానపాత్ర సముద్రతరంగాలలో మునిగిపో నారంభించినది. పరిజను లందరూ ఆక్రందిస్తుండగా తన మనోరథంవలెనే ఆ పడవ మునిగి పోతుండగా చంకలకు ఉత్తరీయాన్ని కట్టుకొని ఆ హిరణ్యగుప్తుడు అనంగప్రభ ముఖం కనబడక: "ఓ ప్రియా! నీవెక్కడున్నావు?" అని అరుస్తూ ఆ సముద్రంలో దుమికినాడు. చేతులతో ఈదు

కుంటూ కొంతదూరం వెళ్ళి ఒకానొక వర్తకనౌకను చూచి దానిని పట్టుకొని పైకెక్కినాడు.

ఆ అనంగప్రభ కూడా త్రాళ్ళతోకట్టిన పలకలమీదికి ఆ సాగరవీరుని సాయంతో త్వరలోనే అధిరోహించినది. అతడు స్వయంగా దాని పై నిడుకొని బెదరిపోతున్న ఆమెను ఓదారుస్తూ ఆ పలకను నడుపుకుంటూ చేతులే గడెలుగా వేసుకుంటూ ముందుకు వెళ్ళినాడు. ఒక క్షణంలోనే ఆ పడవ పగిలిపోగా ఆకసం నిర్మేఘమై నిర్మలమైనది. కోపం ఉపశమించిన సాధువు వలె సముద్రం స్తిమితపడినది. హిరణ్యగుప్తుడు పడవనెక్కి ఐదు రోజులకు దైవవశాత్తూ తీరాన్ని చేరుకొన్నాడు. ఆ తటంమీద దిగి ప్రియావిరహంతో దుఃఖితుడై దానికి ప్రతీకార మేమీ చేయ లేక అదంతా విధిచేష్టిత మనుకొన్నాడు. మనసు గట్టిపరచుకొని మెల్లగా తన పట్టణానికి వెళ్ళి హిరణ్యగుప్తుడు తిరిగీ ధనాన్ని సంపాదించుకుంటూ సుఖంగా ఉన్నాడు.

ఒకరోజు ఆ పలకపై కూర్చున్న అనంగప్రభ ఆ సాగర వీరుని సాయంతో సముద్రతీరాన్ని చేరుకొన్నది. ఆ ధీవరుడు ఆమెను ఓదార్చి తనతోపాటు తన సాగరపురంలోని తన ఇంటికి తీసుకొని పోయినాడు.

అక్కడ రాజవైభవం కలవాడు, వీరుడు, ప్రాణదాత, వయసులో ఉన్నవాడు, రూపవంతుడు అయిన అతనిని చూచి ఆ అనంగప్రభ ఆ దాశపతినే తన పతిగా చేసుకొన్నది. కాలు జారిన కాంత హెచ్చుతగ్గులను పరిగణించదు కదా!

ఆ విధంగా కైవర్త (బెస్త) పతితో అక్కడ ఉంటూ అతని ఇంటిలోనే అత నర్పించిన సమృద్ధిని అనుభవిస్తూ ఉండిపోయినది.

## మదనప్రభ కథ

ఒకసారి భవనాగ్రంపై నిలుచుండి ఆ వీథిగుండా వెడుతున్న భవ్యుడైన విజయవర్మ అనే క్షత్రియ పుత్రుని అనంగప్రభ చూచింది. అతని రూపాన్ని చూచి మనసుపడి క్రిందికి దిగివచ్చి, అతనిని సమీపించి ఇట్లన్నది: "నిన్ను చూడగానే నా మనసు ఆకృష్టమైనది. నన్ను ప్రణయినిగా పరిగ్రహించవలసింది."

ఆ మాటల నభినందించి సంతుష్టుడై ఆ రాకుమారుడు ఆకాశం నుంచి పడినట్టున్న ఆ త్రిలోకసుందరిని తీసుకొని తన ఇంటికి వెళ్ళిపోయినాడు.

ఆ తర్వాత సాగరవీరుడు తన ప్రియురాలు ఎక్కడికో వెళ్ళిపోయినట్టు గుర్తించి, తన సర్వస్వాన్నీ వదలివేసి, సురనదీ తటంలో తపస్సుతో తన తనువు చాలించవలెనని వెళ్ళిపోయినాడు. అతనికి అలాంటి దుఃఖం కలగడం సహజమే. బెస్తవా డెక్కడ? అలాంటి విద్యాధరితో సాంగత్య మెక్కడ?

ఆ అనంగప్రభ విజయ వర్మతో కలిసి అదే నగరంలోనే యథేచ్ఛగా సుఖంగా ఉండినది.

అలా ఉండగా ఒకప్పుడు ఆ నగరరాజు సాగరవర్మ ఏనుగునెక్కి పట్టణంలో తిరగడానికి బయలుదేరినాడు. తనపేర తను కట్టించిన పట్టణాన్ని చూస్తూ, విజయవర్మ భవనమున్న వీథిలో నుండి వెడుతున్నాడు.

రాజువస్తున్నాడని తెలిసి అతనిని చూడవలెనన్న కుతూహలంతో ఆ అనంగప్రభ హర్మ్యాగ్రం పైనికి ఎక్కినది. ఆ రాజును చూడగానే పరవశురాలై గజరాజంపై కూర్చుని ఉన్న మావటీనితో ఇలా అన్నది: "ఓ గజాధిరూఢుడా! నేనింతకు ముం

దెప్పుడూ ఏనుగునెక్కి ఎరుగను. నన్ను దానిపైనెక్కించు. అది ఎంతహాయిగా ఉంటుందో చూస్తాను." ఆ మాట విని మావటీడు రాజు ముఖం చూచినాడు. ఆ రాజు ఆమెను దివినుండి రాలి పడిన చంద్రకాంతివలె భావించినాడు. చకోరం వలె తన కనులతో త్రావివేస్తూ సంతృప్తి చెందక ఆ రాజు ఆమె మీద ఆశపడి హస్త్యారోహునితో ఇట్లన్నాడు: "ఏనుగును కొంచెం దగ్గరగా తీసు కొని వెళ్ళి ఆమె కోర్కెను తీర్చు. త్వరలో ఆ చంద్రముఖిని ఏనుగుపై నెక్కించు."

ఆ విధంగా రాజు ఆజ్ఞాపింపగా ఆ హస్త్యారోహుడు ఆ హర్మ్యానికి దగ్గరగా ఏనుగును కొనిపోయినాడు. ఆ కరేణువు దగ్గరకు రావడంచూచి ఆ అనంగప్రభ సాగరవర్మ ఒడిలోనికి దుమికినది. ఆమె తొలుతటి భర్తృదోషమెక్కడ? అందరు పతు లతోనూ సంతృప్తి చెందక పోవడమెక్కడ? ఈ విపర్యయమం - పితృశాపంతో ఆమెకు కలిగినది.

తాను క్రింద పడిపోతానేమోనని భయపడు తున్నట్టుగా ఆమె రాజుమెడను కౌగిలించుకున్నది. ఆ స్పర్శామృతసిక్తమైన శరీరంతో ఆ రాజుకూడా అపార సంతోషాన్ని పొందినాడు. యుక్తితో తన్నుతా నర్పించుకొని పరిచుంబన లాలస అయి ఉన్న ఆమెను ఆ రాజు తనతో తీసుకొని త్వరత్వరగా తన భవ నానికి వెళ్ళిపోయినాడు.

అక్కడ తన వృత్తాంతాన్నంతటినీ చెప్పిన ఆ ఖేచరాంగ నను అంతఃపురంలో ప్రవేశపెట్టి ఆ రాజు మహాదేవినిగా చేసు కొన్నాడు.

తన ప్రేయసిని రాజు అపహరించెనని తెలుసుకొన్న - కుమారుడు విజయవర్మ, రాజభవనం వెలుపల నిలబడి రాజు

భృత్యులతో యుద్ధం చేసినాడు. ఆ యుద్ధంలో అతను వెనుకంజ వేయకుండా తన శరీరాన్ని త్యజించినాడు. స్త్రీనిమిత్తంగా పరాభవాన్ని శూరులు సహింపరు కదా! "ఈ పాపితో నేమి పని? నందనంలో సుఖింతువు గానీ రా!'' అని సురస్త్రీలు అతనిని స్వర్గానికి తీసుకొని పోయినట్టున్నారు.

అనంగప్రభ సాగరవర్మరాజుతో నది సముద్రంలోనికివెళ్ళి స్థిరపడినట్టుగా స్థిరపడిపోయినది. భవితవ్యబలంతో ఆ పతితో తాను కృతార్థురాలైనట్టుగా భావించినది. ఆ రాజు కూడా ఆ భార్యతో తన జన్మ సఫలమైనట్టు భావించినాడు.

కొన్ని దినము లిలా జరుగగా సాగరవర్మ రాజునకు మహారాణి అయిన అనంగప్రభ గర్భం ధరించి కాలక్రమేణా ఒక పుత్రుని ప్రసవించినది. ఆ రాజు పుత్రజన్మ మహోత్సవాన్ని మహావైభవంగా చేసి ఆ కొడుకునకు సముద్రవర్మ అని పేరుపెట్టినాడు.

క్రమంగా అతను పెరిగి పెద్దవాడు కాగా గుణవంతుడు, భుజబలశాలి అయిన ఆ కుమారుని యువరాజుగా అభిషేకం చేసినాడు. సాగరవర్మ తన కుమారుడైన సముద్రవర్మ వివాహహేతువుగా కమలవతి అనే రాజసుతను అపహరించుకొని వచ్చినాడు. అతనికి పెళ్ళిచేసి వాని గుణాలతో ఆకర్షితుడై ఆ రాజు సముద్రవర్మకు తన రాజ్యాన్ని ప్రదానం చేసినాడు.

వీర్యవంతుడు, క్షత్రధర్మవిదుడు అయిన ఆ సముద్రవర్మ రాజ్యం తనచేతికి రాగానే తన తండ్రికి నమస్కరించి ఇట్లన్నాడు: ''నాన్నా! నేను దిగ్విజయార్థం బయలుదేర దలచుకున్నాను. భూమిని జయించని వానిని రాజ్యలక్ష్మి, స్త్రీనపుంస

కుని భావించినట్టుగా భావిస్తుంది. రాజులకు లక్ష్మి ధర్మసిద్ధమైనది కీర్తికరి అయినది. పరరాష్ట్రాలను జయించి ఆ లక్ష్మిని రాజు నిజబాహుబలంతో సముపార్జించుకొనవలెను.

క్షుద్రులైనవారికి రాజత్వ మెందుకు? అది కేవలం అభి భూతికే కారణమౌతుంది. లుబ్ధులై పిల్లులవలె తమ ప్రజలనే వారు తింటూ ఉంటారు."

ఈ విధంగా చెప్తున్న కుమారునితో సాగరవర్మ ఇట్లన్నాడు: "కుమారా! ఈ రాజ్యం నీకు కొత్తది. దానిని చక్కగా చూసుకో. ధర్మంతో ప్రజలను పాలించువానికి పాపంకానీ, అవమానంకానీ లేదు. తన శక్తిని చూసుకొననిదే రాజులతో శత్రుత్వం వహించడం మంచిదికాదు. అయినప్పటికీ నీవు శూరుడవు. నీకు కావలసినంత సేన ఉన్నది. కానీ రణంలో జయశ్రీ చపలమైనది. గెలిచి తీరుతామని నమ్మడానికి వీలులేదు.''

ఈ విధంగా తండ్రి ఏవేవో చెప్పినప్పటికీ ఆయనతో ఎలాగో అనుజ్ఞపొంది తేజస్వి అయిన సముద్రవర్మ దిగ్విజయార్థం బయలుదేరినాడు.

క్రమంగా దిక్కులను జయించి రాజులను తన వశంలో ఉంచుకొని హస్త్యశ్వ హేమాదులను సంపాదించుకొని తన నగరానికి తిరిగి వచ్చినాడు.

అక్కడ నానాదేశోద్భవాలైన మహారత్నాలతో తన తలితండ్రులను ప్రణతుడై పూజించి పరితుష్టులను చేసినాడు. ఆయన ఆదేశంపై ఆ మహాయశస్వి బ్రాహ్మణులకు హస్త్యశ్వ హేమరత్నమయాలైన మహాదానాలను చేసినాడు.

ఆ తర్వాత అర్థించినవారిపై భృత్యులపై కావలసినంత ధనవర్షం కురిపించినాడు. దరిద్ర శబ్దమనే దొక్కదాన్నే అక్కడ అర్థరహితంగా చేసివేసినాడు.

అదిచూచి పుత్రమాహాత్మ్యాన్ని పరిగణించి తన్ను కృత కృత్యునిగా తలపోసుకొని అనంగప్రభాయుతుడైన రాజు సాగరవర్మ కొన్ని రోజులు మహోత్సవంతో గడపి మంత్రి సన్నిధిలో కుమారునితో ఇట్లన్నాడు: "ఓ కుమారా! ఈ జన్మంలో నేను చేయవలసినదంతా చేసినాను. రాజ్యసుఖాన్ని అనుభవించి నాను. శత్రుపరాభవాన్ని ఎరుగను. నీవు సామ్రాజ్యాన్ని సంపా దించడం కూడా చూచాను. ఇకనాకు కావలసినదేమున్నది? కాబట్టి నేను ఈ శరీరముండగానే ఏదో తీర్థానికి వెళతాను. క్షణ భంగురమైన ఈ శరీరంపై ఇంకా ఆశ ఎందుకు? అని వృద్ధాప్యం నా చెవిలో చెప్తున్నది."

ఈ విధంగా కొడుకుతో చెప్పి అతను ఇష్టపడక పోయినా కృతార్థుడైన సాగరవర్మరాజు ప్రియురాలితో పాటు ప్రయాగకు వెళ్ళినాడు. ఆయనను సాగనంపి సముద్రవర్మ తిరిగీ తన పట్ట ణానికి వచ్చి తన రాజ్యాన్ని యథావిధిగా పాలింప సాగినాడు.

ఆ రాజు సాగరవర్మకూడా ఆ అనంగప్రభతో కలిసి ప్రయా గలో తపస్సుచేసి మాహేశ్వరుని ప్రసన్నుని చేసుకొన్నాడు. ఆ దేవుడు తెల్లవారు జామున కలలో కన్పించి ఇట్లన్నాడు: "భార్యతో పాటు నీవు చేసిన తపస్సుతో సంతుష్టుడనైనాను. ఒక సంగతి చెప్తాను విను: ఈ అనంగప్రభ, నీవూ, విద్యాధరులు, శాపక్షయమై ఉదయమే మీ లోకానికి పోనున్నారు."

ఆ మాటవిని అతను మేల్కొన్నాడు. అనంగప్రభ కూడా మేల్కొన్నది. ఆమెకు కూడా అలాంటి కలే వచ్చినది. దానిని గూర్చి పరస్పరం సంప్రతించు కున్నారు.

ఆ తర్వాత అనంగప్రభ ఆ రాజుతో ఇట్లన్నది. "ఆర్య పుత్రా! నా పూర్వజన్మ ఇప్పుడే స్మృతిపథంలో మెరుస్తున్నది. నేను విద్యాధరేంద్రుడైన సమరుని కుమార్తెను. ఈ అనంగప్రభ వీరపురమనే పట్టణంలో పితృశాపం వల్ల ఇక్కడికి వచ్చి విద్యా విధ్వంసంతో మానుషి అయి తన విద్యాధరీ భావాన్ని మరచి పోయినది. ఇప్పుడేమో మేల్కొన్నట్టుగా ఉన్నది.'' ఈ మాట ఆమె చెప్తుండగానే, ఆమె తండ్రి సమరుడు ఆకసంనుంచి క్రిందికి దిగివచ్చినాడు.

ఆ సాగరవర్మ అతనికి నమస్కరించినాడు. కుమారి అనంగప్రభ ఆయన పాదాలపై పడినది. ''ఓ పుత్రీ! ఈ విద్య లను తిరిగి గ్రహింపుము. నీ శాపం పూర్తి అయినది. ఎనిమిది జన్మల్లో అనుభవించవలసిన దుఃఖాన్ని నీవు ఒకే జన్మలో అనుభ వించినావు'' అని చెప్పి ఆమెను ఒడిలో కూర్చుండబెట్టుకొని, ఆమెకు తిరిగి విద్యలను ప్రసాదించి తర్వాత సాగరవర్మ రాజుతో ఆయన ఇట్లన్నాడు :

"నీవు మదనప్రభుడను పేరుగల విద్యాధరేశుడవు. నేను సమరుడనే విద్యాధరుడను. నా కూతురు అనంగప్రభ ఈమె. పూర్వం ఈమెను చాలమంది ఆయా వరులు కోరగా రూపగర్వితు రాలై, వారిలో ఒక్కరినీ చేపట్టలేదు.

తర్వాత ఉచితగుణాలు కల్గిన నీవుకూడా ఉత్కంఠితుడవై యాచింపగా విధి యోగం వల్ల అప్పటికి నిన్నుకూడా ఈమె

అంగీకరింపలేదు. మర్త్యలోకంలో పుట్టమని నేనాపై శపించి నాను. అప్పుడు నీవు మర్త్యలోకంలో కూడా ఈవిడే నీ భార్య కావలెనని సంకల్పించుకొని విద్యాధర తనువును త్యాగం చేసి నావు.

ఆ తర్వాత నీవు మానవుడుగా పుట్టినావు. ఈమెకూడా నీకు భార్యగా జనించినది. ఇప్పుడు మీ రిద్దరూ కలిసి మీ స్వలోకానికి రండి అని సమరుడు చెప్పగా పూర్వ స్మృతి కలిగి ప్రయాగ జలంలో తను త్యాగం చేసి సాగరవర్మ మదనప్రభుడు అయినాడు.

తర్వాత ఆ విద్యలను పొంది తిరిగిపోతున్న అనంగప్రభ కూడా అదే దేహంతో వెంటనే విద్యాధరిగా మారినది. ఆనందం చెందిన మదనప్రభుడు, ఆ అనంగప్రభ దివ్యమైన తమ తమ దేహాలను చూసుకుంటూ గాఢానురాగవంతులైనారు. వీరందరూ ఆకసానికెగసి తమదైన వీరపురమనే వైద్యాధర నగరానికి వెళ్ళి నారు.

అక్కడ యథావిధిగా సమరుడు తన కుమార్తె అనంగ ప్రభను ఖేచరపతి అయిన మదన ప్రభునకు కన్యాదానం చేసి నాడు.

ఆ విధంగా శాపం తీరిన ప్రియురాలితో కలిసి మదన ప్రభుడు తన పట్టణానికి వెళ్ళి సుఖంగా ఉన్నాడు.

—ఈ విధంగా తమ దుర్ణయాల విపాకవశంతో దివ్యులు కూడా శాపచ్యుతులై మనుష్యలోకంలో అవతరిస్తారు. తదను గుణమైన ఫలాన్ని అనుభవించి పూర్వార్జితమైన సుకృతంతో తిరిగీ తమ స్వస్థానాలకు వెళతారు."

ఈ విధంగా తన సచివుడు గోముఖుడు చెప్పగా ఈ కథను విన్న నరవాహనదత్తుడు అలంకారవతితో పాటు సంతుష్టుడై ఆ తర్వాత కాలకృత్యాలు తీర్చు కొనడానికి లేచినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో అలంకారవతీలంబకంలో
ద్వితీయ తరంగం.

---

# తృతీయ తరంగం

కార్పటికుని కథ

ఆ మరునాడు అలంకారవతి పార్శ్వంలో ఉన్న నరవాహన దత్తునితో అతని సఖుడు మరుభూతి ఇలా విన్నవించుకొన్నాడు:

"పాపం ఆ కార్పటికుడు ఎలా బాధపడుతున్నాడో చూడండి. చర్మఖండం మాత్రం వస్త్రంగా ధరించినాడు. వెంట్రుకలు జడలు కట్టి పోయినవి. కృశించిపోయి ధూళిధూసరితుడై ఉన్నాడు. పగలూ రాత్రీ ఎండగా ఉన్నా, చలిగా ఉన్నా సింహద్వారాన్ని వదలిపెట్టిపోవడం లేదు. ఇప్పటికీ మీరు ప్రసన్నులు కావడం లేదేమిటి? సకాలంలో ఇచ్చినవరం చిన్నదైనా చాలు. అకాలంలో ఎన్నివరాలిచ్చినా ఏమిఫలం? అతను చనిపోకముందే అతనిపై దయచూపండి."

ఆ మాటవిని గోముఖుడు "మరుభూతి చెప్పినమాట నిజమే. అయితే ఇందులో మీ దోషమేమీ లేదు. పాపం పరిహారం కానిది దానమివ్వగలవాడైనా ప్రభువు దానం ఇవ్వలేడు. ఆ పాపమే పరిహారమైతే ఎంత అడ్డుపడినా ఇస్తాడు. ఇదంతా క్రమాయత్తమైనది. ఈ విషయంలో లక్షదత్తుడు, కార్పటికుడు, లబ్ధదత్తుడు అనే వారల కథను చెప్తాను వినండి.

రాజు లక్షదత్తుడు, లబ్ధదత్తుడు కార్పటికుల కథ

భూలోకంలో లక్షపురమనే పేరుగల పట్టణం కలదు. అక్కడ త్యాగశీలశిఖామణి అయినరాజు లక్షదత్తుడు కలడు.

యాచించిన వానికి లక్షకు తక్కువ ఇవ్వడం అతనికి తెలియదు. ఇక ఎవరితోనైనా మాటాడితే అతనికి ఐదు లక్ష లిచ్చేవాడు. తన్ను సంతోషపెట్టిన వానిని దారిద్ర్యరహితునిగా చేసేవాడు. అందు వల్లనే అతనికి లక్షదత్తు డనే పేరువచ్చింది.

అతని భవన సింహద్వారంలో దివారాత్రులు కార్పటికు డొకడు చర్మఖండైకవస్త్రుడై ఉండేవాడు. తల జడలుకట్టుకొని పోగా వర్షాకాలంలో చలివేసినా, గ్రీష్మకాలంలో ఎండలుకాసినా అతను ఏమాత్రం చలించేవాడు కాదు. అయినా అతనిని ఆ రాజు చూస్తూనే ఉన్నాడు. ఇలా నానాబాధలు పడుతూ అతను చిర కాలం అక్కడే ఉన్నాడు. స్వయంగా దాత, దయకలవాడు అయి నప్పటికీ ఆ రాజు అతనికేమీ ఇవ్వలేదు.

అలా ఉండగా ఒకసారి రాజు అడవికి వేటకై వెళ్ళినాడు. ఆ కార్పటికుడు కూడా ఒక గుదికఱ్ఱ తీసుకొని అతనివెంట వెళ్ళి నాడు. అక్కడ సైన్యంతోపాటూ వాహనస్థుడై చేత విల్లంబులు ధరించి రాజు, పెద్దపులులను, వరాహాలను, జింకలను బాణవర్షంతో చంపజొచ్చినాడు.

కార్పటికుడేమో ఏకాకిగా, పాదచారిగా అతనిముందే అనేక సూకరాలను, హరిణాలను తనచేతనున్న లగుడంతో చంపుతూ వచ్చినాడు. అదిచూచి రాజు "చిత్రంగా ఉంది. వీడు చాలా పరాక్రమశాలి" అని తనలో అనుకున్నాడు. అయినా అతని కేమీ ఇవ్వలేదు. అతను వేట ముగించి నగరంలోనికి తిరిగి విశ్రాం తికై వచ్చినాడు. అప్పటికే సింహద్వారంవద్ద పూర్వం వలెనే కార్పటికుడు కాపలాఉన్నాడు.

ఒకానొకప్పుడు తన పొలిమేరలలోనున్న దాయాదులను ఓడించుటకై రాజు లక్షదత్తుడు దాడివెడలినాడు. అక్కడ గొప్ప యుద్ధం సంభవించినది. ఆ యుద్ధంలో కూడా కార్పటికుడు రాజు ముందే అనేకమంది శత్రువులను దండాగ్రప్రహారాలతో చంపి వేసినాడు.

రాజేమో శత్రువును జయించి తన పట్టణానికి తిరిగి వచ్చి నాడు. వాని పరాక్రమం చూచికూడా రాజతని కేమీ ఇవ్వలేదు.

ఈ విధంగా కార్పటికుడు లబ్ధదత్తుడు అలా ఉండగా ఐదు సంవత్సరాలు గడచినవి. ఆ కర్రతోనే అతను బ్రతుకుతున్నాడు.

ఆరో సంవత్సరం కాగా విధివశంవల్ల వాని నొకసారి రాజు చూచి జాలికలిగి ఇట్లనుకున్నాడు: "చిరకాలం ఇతను క్లిష్టదశలో ఉన్నా నేనేమీ ఇతనికి ఇవ్వలేదు. కాబట్టి యుక్తితో ఏదో ఒకటి ఇచ్చి చూస్తే నేమి? ఈ వరాకుని వృత్త మేమిటి? అతని పాప క్షయం కాలేదా? ఇంకైనా వానికి లక్ష్మీదర్శనం కావడం లే దేమిటి?"

ఇలా ఆలోచించి ఆ రాజు స్వయంగా భాండాగారం లోనికి వెళ్ళినాడు. రత్నాలు నింపిన ఒక మాతులుంగం (మాదీఫలం) పండును తయారుచేసినాడు. అలాగే సభతీర్చి అందులో పౌర సామంతమంత్రు లందరినీ సమావేశపరచినాడు. వారి నడుమ వస్తున్న కార్పటికుని చూచి స్వయంగా తనవద్దకు రమ్మని మృదు వచనాలతో పిలిచినాడు.

అప్పుడు కార్పటికుడు ఆ మాటవిని సంతోషించి రాజు ముందునకు వచ్చి కూర్చున్నాడు. ఆ తర్వాత అతనితో రాజి

ట్లన్నాడు: "ఏదైనా ఒక సుభాషితాన్ని చెప్పు." అది విని ఆ కార్పటికుడు క్రింది ఆర్యను పఠించినాడు:

పూరయతి పూర్ణమేషా
తరంగణీ సంహతి స్సముద్రమివ
లక్ష్మీరధనస్య పునర్
లోచనమార్గేఽపి నా యాతి.

"నదీసమూహాలు నిండుగా ఉన్న సముద్రాన్నే నింపుతాయి. అలాగే లక్ష్మి నిర్ధనునికి లోచనగోచరం కూడా కాదు" ఇదీ ఆ ఆర్యకు అర్థం.

అదివిని చాల సంతోషించి ఆ రాజు రత్నపూర్ణమైన మాతులుంగ ఫలాన్ని అతనికి ఇచ్చినాడు.

అప్పుడు అక్కడున్న సభ్యులు అందరూ ఇలా అనుకున్నారు: "ఈ రాజు ఎవరియెడల నైనా సంతృప్తి చెందితే వాని దారిద్ర్యాన్నే తొలగించి వేసేవాడే. అయినా ఈ కార్పటికుని పిలిచి ఆదరంతో కేవలం ఒక మాతులుంగ ఫలం మాత్రమే తన సంతుష్టికి చిహ్నంగా ఇచ్చినాడు. పాపం! కల్పవృక్షమైనప్పటికీ దురదృష్టవంతుల విషయంలో మోదుగచెట్టే అవుతుంది." ఇలా అనుకుంటూ వారు ఇందులోని పరమార్థ మేమిటో ఎరుగక తమలో తాము మాట్లాడుకొన్నారు.

ఆ కార్పటికుడు ఆ పండును తీసుకొని వెళ్ళిపోయినాడు. అతను బయటికి వెడుతుండగా అతని కెదురుగా విషణ్ణుడైన భిక్షుకు డొకడు ఎదురుపడినాడు. ఆ రాజవంది అనే అతనికి దానినిచ్చి అతనివద్దనుంచి ఒక బొంతను కార్పటికుడు తీసుకొన్నాడు.

ఆ కార్పటికుని వద్దనుంచి తీసుకొన్న పండును రమణీయమైన దానినిగా చూచి ఆ భిక్షువు రాజసన్నిధికివెళ్ళి దానిని సమర్పించుకొన్నాడు.

రాజు దానిని గుర్తుపట్టి ఆ శ్రమణుని ఇట్లా ప్రశ్నించినాడు: "ఇది నీ కెక్కడిది?" ఆ మాటకు "కార్పటికుడు తనకిచ్చె" నని బౌద్ధభిక్షువు చెప్పినాడు. అందుతో రాజు విస్మితుడు, విషణ్ణుడూ అయినాడు.

"అయ్యో! ఇప్పటికైనా వాని పాపం కరిగిపోలేదే!" అనుకొని ఆ మాతులుంగాన్ని స్వీకరించి సభ చాలించి లేచి దినకృత్యాలు నిర్వర్తించుటకై లోనికి వెళ్ళిపోయినాడు.

ఆ కార్పటికుడు కూడా ఆ దుప్పటిని అమ్మి దానితో అన్నపానాదులను నిర్వర్తించుకొని తిరిగి సింహద్వారంవద్దవచ్చి నిలుచున్నాడు.

రెండవరోజు మహారాజు యథాప్రకారం కొలువుతీరినాడు. అధికారులు, పౌరులు సభలో ఆసీనులైనారు. ఆ కార్పటికునికూడా లోనికి పిలిపించి ఆ ప్రభువు తిరిగీ తన దగ్గరలో కూర్చుండబెట్టుకున్నాడు. అదీ ఆర్యావృత్తానే ప్రసన్నుడై మరొకమారు పఠింపజేసి గూఢరత్నమైన మాతులుంగాన్ని తిరిగీ ఇచ్చినాడు. "రెండవరోజు కూడా ఊరకే సంతుష్టుడైనాడుగానీ ప్రభువు ఈ పండును ఇవ్వడంతోనే సరిచేసినాడే!" అని సభాస్తారులు ఆశ్చర్యపడినారు. వ్యాకులత చెందిన ఆ కార్పటికుడు ఆ పండును చేతిలో పట్టుకొని అదే రాజప్రసాద మనుకొని బయటికి వచ్చినాడు. ఒక గ్రామాధికారి ఆస్థానంలోనికి ప్రవేశించి రాజదర్శనార్థమై వస్తూ అతనికి

ఎదురుపడినాడు. ఆ అధికారి అదేదో మంచి శకునమనుకొని రెండుజతల బట్టలను ఇచ్చి కార్పటికునినుంచి ఆ పండును తీసుకున్నాడు.

ఆస్థానంలోనికి వెళ్ళి రాజునకు పాదాభివందనం చేసి తొలుత ఆ పండునిచ్చి తర్వాత తాను తెచ్చిన బహుమానాలను సమర్పించుకొన్నాడు. దానిని గుర్తించి మహారాజు ఇది నీకెక్కడిదని ఆ గ్రామాధికారి నడుగగా, కార్పటికుడు తన కిచ్చెనని చెప్పినాడు. "అయ్యో! ఇప్పటికీ వీనికి లక్ష్మి ప్రసన్నం కాలేదే!" అని చింతిస్తూ ఆ రాజు వికలమనస్కుడైనాడు. ఆ పండును చేతబట్టుకొని కొలువు చాలించి లేచి వెళ్ళినాడు.

ఆ కార్పటికుడు ఆ బట్టల జతను బజారునకు తీసుకొనివెళ్ళి అందులో ఒకదానిని అమ్మి భోజన పానాదులను నిర్వర్తించుకొన్నాడు, మరొకదానిని రెండుగాచేసి ధరించుకొన్నాడు.

మూడవరోజు ప్రభువు కొలువుతీరి ఉండగా పరిజనులందరూ లోన ప్రవేశింపగా ఆ కార్పటికుని కూడా పిలిపించి మునుపటిలాగే దగ్గర కూర్చుండబెట్టుకొని, ఆ పద్యాన్ని చదివింపజేసి, ప్రభువు అదే పండునే వానికి ఇచ్చినాడు. అక్కడున్న వారందరూ ఆశ్చర్యపడిపోయినారు.

ఆ కార్పటికుడు బయటికివచ్చి రాజవిలాసినికి ఆ పండు నిచ్చినాడు. ఆ వేశ్య, బదులుగా నడయాడు రాజసమ్మాన తరువల్లివలె కొంత బంగారా న్నిచ్చినది. ఫలించేముందు పువ్వుపూసినట్టున్నదది. ఆ రోజు కార్పటికుడు దానిని అమ్మి సుఖంగా ఉన్నాడు.

ఆ విలాసిని కూడా రాజాస్థానంలో ప్రవేశించి అదేపండునే ప్రభువునకు సమర్పించినది. దానిని గుర్తించి రాజు ఇది నీకెట్లా వచ్చినదని అడుగగా కార్పటికుడు తన కిచ్చెనని నివేదించినది.

ఆ మాటవిని "ఇప్పటికీ వీనిపై లక్ష్మీకటాక్షం పడలేదు. మందభాగ్యుడతడు. నా అనుగ్రహం కూడా నిష్ఫలం చేస్తున్నాడు. ఇలా ఎన్నిసార్లు ఇచ్చినా ఆ మహారత్నాలుతిరిగి తనకే వస్తున్నాయి" అని ఆలోచించుకొని రాజు ఆ పండును తీసుకొని భద్రంగాదాచి, కొలువుచాలించి ఆహ్నికాదులను నిర్వర్తించుకున్నాడు.

నాల్గవనాడు రాజు కొలువుతీరి ఉండగా, సామంతసచివాదులందరూ సభ నలంకరింపగా, ఆ ప్రభువు తిరిగీ ఆ కార్పటికుని తన ప్రక్కన కూర్చుండబెట్టుకొని అదే పద్యాన్ని చదివి వినిపించమని, ఆ పండును తిరిగీ అతనికి ఇచ్చినాడు. కాస్త తొందరగా ఇవ్వడంతో అది జారిపడి రెండుగా విడిపోయి నేలపై పడినది. ఆ అతికించినచోట పండు పగిలిపోవడంవల్ల లోనపెట్టిన రత్నాలు బయటపడినవి. ఆ మహార్ఘములైన మణులు సభనే ప్రకాశింపజేసినవి.

వాటిని చూచి అక్కడున్న వాదందరూ "పరమార్థం మనకు తెలియక మూడుసార్లు మనం అనవసరంగా భ్రమపడినాము. ప్రభు ప్రసాదం ఇలాంటిదని తెలుసుకొనలేక పోయినాము" అనుకున్నారు.

ఆ మాటలు విని రాజు "నేనేదో యుక్తితో ఇతనికి ఆ ఫలాన్నిస్తూ లక్ష్మీకటాక్షం ఇతనికి ఉన్నదా లేదా? అని పరీక్షించినాను. ఇతని పాపం పరిహారమైనదా లేదా అని మూడు మారులు

పరిశీలించినాను. అది ఇప్పటికి ఫలించినది. ఇప్పుడే ఇతనికి లక్ష్మీదర్శనమైనది" అని చెప్పి ఆ రత్నాలనే కాక, గ్రామాలను, హస్త్యశ్వ కాంచనాదులను ఆ కార్పటికునకు ఇచ్చి ప్రభువతని నొక సామంతునిగా చేసినాడు.

తర్వాత సభ చాలించి జనం స్తుతిస్తుండగా లేచి స్నానానికి వెళ్ళినాడు. కృతార్థుడైన కార్పటికుడు కూడా తన ఇంటికి వెళ్ళి పోయినాడు.

—ఈ విధంగా పాపపరిహారమయ్యే దాకా ఫలితం లభించదు. ప్రభుప్రసాదం కోసం భృత్యుడు ఎన్ని కష్టాలు పడినా అది చేరువ కాదు" అని ఈ విధంగా మంత్రి ముఖ్యుడైన గోముఖుడు ఈ కథను చెప్పి తాను తన ప్రభువైన నరవాహనదత్తునితో తిరిగి ఇట్లన్నాడు.

"కాబట్టి ఓ దేవా! మీ కార్పటికునికి ఇప్పటికి పాపక్షయమైనదో లేదో అందువల్లనే మీరు ప్రసన్నులు కావడం లేదు" అన్నాడు.

ఈ గోముఖుని మాటలను విని నిజమేనని, ఆ కార్పటికుడను పేరుగల తన కార్పటికునకు వత్సేశ్వర కుమారుడు అప్పుడే గ్రామ సంచయాన్ని ఇచ్చినాడు. గజ తురగాదులను, హేమ కోటిని సద్వస్త్రాభరణాలను ప్రదానం చేసినాడు. ఇందుతో ఆ కార్పటికుడు రాజసదృశుడైనాడు. పరివారం కృతజ్ఞంగా ఉంటే ప్రభువునకు చేసిన సేవకు తప్పక ఫలం దక్కుతుంది.

## బ్రాహ్మణ వీరుని కథ

ఇట్లా ఉండగా ఒక సారి నరవాహనదత్తుని సేవార్థమై దాక్షిణాత్యుడైన విప్రయువకు డొకడు వచ్చినాడు. అతని పేరు

ప్రలంబ బాహుడు. అతను రాజుతో ఇట్లన్నాడు: "ప్రభువుల వారి కీర్తిని విని ఆకృష్టుడనై తమ పాదాల వద్దకు వచ్చినాను. మీ అడుగడుగునకు తప్పకుండా అడుగులు వేసుకుంటూ మిమ్ము అనుసరిస్తాను. ఆకాశానికెగిరి పోతే మాత్రం అనుసరించలేను. ఆ మాటెందు కంటున్నానంటే తమకు విద్యాధరేంద్రత్వం సిద్ధింప గలదని విన్నాను. నాకు జీవనానికి రోజునకు నూరు దీనారాలు ఇవ్వవలసిందిగా ప్రార్థిస్తున్నాను."

ఈ విధంగా చెప్పిన ఆ మహాతేజస్వి అయిన బ్రాహ్మణునకు నరవాహనదత్తుడు అదే విధంగానే వృత్తిని కల్పించినాడు. ఆ ప్రసంగ వశాత్తూ గోముఖుడిట్లా అన్నాడు: "దేవా! సేవకులు రాజుల యెడ ఈ విధంగానే ఉంటారు. ఇక్కడ ఒక కథ చెప్తాను వినండి.

## వీరవర బ్రాహ్మణ కథ

"ఈ దేశంలో విక్రమపురమనే ఒక మహాపట్టణం కలదు. అక్కడ పూర్వం విక్రమ తుంగుడనే నరపాలుడు కలడు. ఆయన గొప్ప రాజనీతి విశారదుడు. తీక్ష్ణత ఆయన కత్తిలోనే కానీ ఆయన దండోపాయంలో లేదు. ధర్మంలో నిత్యాను సక్తుడే కానీ స్త్రీ మృగయాదులపై ఆయన ఆసక్తిలేనివాడు. ఆ రాజు గుణ విచ్ఛేదనం సాయంకాలమందే కానీ ఇతరత్రా లేదు. అవిచారం కేవలం పశుపాలకుల యందే కానీ ఇతరత్రా లేదు. (శ్లేష)

అలాంటి వీరవర మహారాజువద్దకు ఒక మాళవదేశానికి చెందిన శూరుడు వీరవరుడను వాడు ఒకప్పుడు సేవార్థమై వచ్చి నాడు. అతను విప్రుడు. అతని భార్యపేరు ధర్మవతి. కూతురు వీరవతి. కొడుకు సత్త్వవరుడు. వీరు ముగ్గురే అతని కుటుంబం.

తన పరికరాలలో మెరిమూడు—నడుమునకు వేలాడు తున్న కత్తి ఒక చేతిలో డాలు, మరొక చేతిలో అద్దం.

ఈ మాత్రం పరికరాలతో—వృత్తికోసం అతను రాజును అభ్యర్థించినాడు. ప్రతిరోజూ ప్రభువు తనకు ఐదువందల దీనా రాల భృతి ఇవ్వవలెనని కోరినాడు. అతనిలోని ఓజస్సును చూచి రాజు ఆ వృత్తిని కల్పించినాడు. ఇతని గొప్పదన మేమిటో చూతామని మనస్సులో అనుకున్నాడు.

అలాగే ఐదుగురు చారులను ఆ రాజు అతనిని కనిపెట్టు టకై నియమించినాడు. ఈ ద్విబాహువు అన్ని దీనారాలతో ఏమి చేయగలడో వారిద్వారా తెలుసుకొన దలచుకున్నాడు.

ఆ వీరవరుడేమో ఆ దీనారాలలో రోజురోజు భోజనాదుల కోసమై తన భార్య చేతికి ఒక వంద ఇచ్చేవాడు. ఒక నూరు దీనారాలతో వస్త్ర మాల్యాదులను కొనేవాడు. స్నానం చేసి హరి హరాదులను అర్చించేందుకై మరొకనూరు దీనారాలు ఖర్చు పెట్టేవారు. మిగిలిన రెండు వందలను దీనులకు ద్విజాతులకు ఇచ్చేవాడు. ఆ విధంగా ప్రతినిత్యమూ తనకు వచ్చే ఐదువందల దీనారాలనూ ఖర్చుపెట్టేసేవాడు.

మధ్యాహ్నం దాకా భూపతి సింహద్వారం లో నిలిచి ఉండే వాడు. తరువాత ఆహ్నికాదులను ముగించుకొని తిరిగివచ్చి అక్కడే రాత్రంతా ఉండేవాడు. ఈ దినచర్యను నిత్యమూ చారులు రాజునకు నివేదించేవారు. అందుతో సంతృప్తుడై ప్రభువు ఆ చారులను మాన్పించి పంపించి వేసినాడు. ఆ వీరవరుడు ఆయుధాన్ని ధరించి స్నానాది సమయాలు తప్ప మిగతా అహో రాత్రులూ సింహద్వారంలోనే కాపలాగా నిలబడేవాడు.

ఆ వీరవరుని జయించడానికా అన్నట్టు ఆ వీరుని ప్రతాపాన్ని సహింపలేక గర్జిస్తూ వర్షాకాలం వచ్చినది. మేఘసంఘాతాలు ఘోరంగా ధారాశరావళిని కురిపిస్తున్నప్పటికీ ఆ వీరవరుడు సింహద్వారంనుంచి కదలక స్తంభంవలె నిశ్చలుడై నిలుచున్నాడు.

రాజు విజయతుంగుడు, అతనలా సర్వదా నిలబడిఉండడం తన రాజప్రాసాదం నుండి చూచి జిజ్ఞాసతో ఆ రాత్రికూడా ప్రాసాదం పైనికి ఎక్కినాడు. "ఎవరా సింహద్వారం వద్ద ఉన్నది?' అని పైనుంచే అడిగినాడు. ఆ మాటవిని 'నేనే ఇక్కడ ఉన్నది' అని వీరవరుడు జవాబిచ్చినాడు. 'ఆహా! ఇతనెవరో మహాసత్త్వుడు. ఇంకింత గొప్పస్థానానికి అర్హుడు. ఇంతగా కుంభవృష్టి కురుస్తున్నా సింహద్వారాన్ని ఇతను వదలిపెట్టడం లేదు.'

ఈ విధంగా రాజు అనుకుంటుండగా దూరంనుంచి గుండె నీరుచేస్తూ ఎవరో స్త్రీ విలపిస్తుండడం వినిపించింది. "నా రాజ్యంలో దుఃఖితులు లేరు మరి ఈవిడ ఎవరు? ఎందు కేడుస్తున్నది?" అని ఆలోచిస్తూ ఆ రాజు వీరవరునితో ఇట్లన్నాడు: "ఓ వీరవరా! ఎవరో స్త్రీ ఏడుస్తుండడం దూరంనుంచి వినబడుతున్నది. ఆమె ఎవరు? ఆమెకు వచ్చిన దుఃఖ మేమిటి? అక్కడికి వెళ్ళి కనుక్కొని రా."

ఆ మాటవిని 'ఆజ్ఞ' అని వీరవరుడు బయలుదేరినాడు. చేయి ఝాడించి మొలలో బాకును దోపుకొని, అంత మెరుపులతో ఉరుములతో కుండపోతగా వాన కురుస్తుండగానే ఆ వీరవరుడు బయలుదేరినాడు. ఇది చూచి, ధారాపాతంతో రోదసి అంతా ఆచ్ఛాదితంకావడం చూచి, కుతూహలంతో, దయతో ఆ రాజు

ప్రాసాదాగ్రంనుంచి క్రిందికి దిగివచ్చి అతనికి కానరాకుండా అతనివెంటనే బయలుదేరినాడు.

ఆ రోదనం వస్తున్న దిక్కునకే వెడుతూ వీరవరుడు పట్టణం వెలుపల ఒక తటాకంవద్దకు చేరినాడు.

"హా నాథా! హా కృపాళో! హా శూరాగ్రేసరా! నీ వెలా నన్ను వదలిపెడతావు? నిన్ను విడిచి నే నెలా బ్రతుకగలను?" అని ఆ తటాకం మధ్యలో నిలిచి ఒక స్త్రీ రోదిస్తున్నది.

"అమ్మా! నీ వెందుకు దుఃఖిస్తున్నావు? ఏ నాథుని పిలుస్తున్నావు?" అని వీరవరుడు ప్రశ్నించినాడు.

ఆమె ఇట్లన్నది: "ఓ కుమారా! నేను భూదేవిని. విక్రమతుంగుడు నా రాజు. అతనికేమో నేటికి మూడవరోజున మృత్యువు రానున్నది. ఇది నిశ్చయం. ఇలాంటిపతి తిరిగీ నా కెక్కడ దొరుకుతాడు? కాబట్టి ఆయనను గూర్చి నేను శోకిస్తున్నాను. నన్నుగూర్చి నేను దుఃఖిస్తున్నాను."

## దేవపుత్ర సుప్రభుల కథ

ఇంకా ఆమె ఇలా అన్నది:

"నేనేమో రానున్న శుభాశుభాలను దివ్యదృష్టితో పరికింపగలను. స్వర్గంలోనున్న దేవపుత్రుడైన సుప్రభుని నే నెరుగుదును. అతని పుణ్యం క్షీణించి స్వర్గంనుంచి తిరిగి క్రిందికి పడిపోనున్నాడు. ఆ తర్వాత ఏడురోజులలో సూకరీగర్భంలో అతను జన్మిస్తాడు. ఈ సంగతి అతను దివ్యదృష్టితో తెలుసుకొన్నాడు. ఈ సూకరీగర్భవాసక్లేశాన్ని భావించుకొని దేవపుత్రుడు -- ననుభవిస్తున్న దివ్యభోగాలను తలచుకొని దుఃఖిస్తున్నాడు.

"ఓ స్వర్గమా! ఓ అప్సరసలారా! ఓ నందనలతా గృహా ల్లారా! నే నిక క్రోడగర్భంలో ఎలా వసిస్తాను? ఆ తర్వాత బురదలో ఎలా పొరలాడగలను?''

ఈ విధంగా విలపిస్తున్న అతనివద్దకు దేవేంద్రుడు వచ్చి ఈ విలాపానికి కారణ మేమని అడిగినాడు. అతను తన దుఃఖ కారణం విశదీకరించినాడు. అది విని ఇంద్రుడు అతనితో ఇట్ల న్నాడు:

"ఇందు కొక ఉపాయ మున్నది చెప్తాను విను. 'ఓం నమ శ్శివాయ' అని జపిస్తూ ఈశ్వరుని శరణుపొందు. అప్పుడు నీ పాపం పరిహారమై పుణ్యం పొందగలవు. సూకరయోనిలో పుట్టనూ అవసరం ఉండదు. స్వర్గంనుంచి పడిపోవలసిన పనీ లేదు."

ఈ విధంగా దేవరాజు చెప్పగా అలాగే ప్రభూ అని చెప్పి అతను 'నమశ్శివాయ' అని శంభుని శరణుజొచ్చినాడు. తన్మ యుడై ఆరురోజులు ఆ విధంగా జపిస్తూ ఈశ్వరప్రసాదం వల్ల సూకరీగర్భనివాసం తప్పించుకొనడ మేకాక, స్వర్గంనుంచి మరింత మరింత పైకివెళ్ళినాడు.

ఏడవరోజున దేవేంద్రుడు అతనిని స్వర్గంలో కానరాక, చూస్తుండగానే ఇతను మరింత ఉత్తమలోక ప్రాప్తిని పొందినాడే అని ఆలోచిస్తూ భవిష్యత్తులోని పాపాన్ని భావించుకొన్నాడు. అదేవిధంగానే నేను కూడా నా రాజు మరణాన్ని భావించుకొని దుఃఖిస్తున్నాను'' అన్నది భూదేవి.

ఈ విధంగా చెప్పిన భూదేవిని చూచి వీరవరుడిట్లా అన్నాడు: "అమ్మా! సుప్రభునికి ఇంద్రుడు చెప్పిన ఉపాయం లాంటి

ఉపాయ మేదైనా మన రాజును రక్షించడానికి ఉన్నదా?" అని వీరవరు డడుగగా ఆమె ఇట్లన్నది:

"ఒకటే ఉపాయ మున్నది. అది నీ అధీనంలోనే ఉన్నది.''

ఆ మాటవిని విప్రవీరవరు డిట్లన్నాడు: "దేవీ! అలాంటి దేదైనా ఉంటే నాకు వెంటనే చెప్పు. ప్రభువునకు శ్రేయస్సు సమకూరితే చాలు! నా ప్రాణాల నివ్వడానికైనా, దారపుత్రులను ధారవోయడానికైనా నేను సిద్ధమే. ఆ విధంగా నా జన్మ సఫలం కాగలదు.''

ఇలా అన్న ఆ వీరవరునితో పృథ్వీదేవి ఇట్లన్నది: "రాజ ప్రాసాదానికి సమీపంగా చండికాదేవి వెలసి ఉన్నది. ఆమెకు నీ కుమారుడు సత్త్వవరుని బలి ఇచ్చినావంటే అప్పుడు రాజు జీవించగలడు. ఇందుకు మరొక ఉపాయ మేమీ లేదు.''

ఈ వసుధా వాక్యం విని ధీరుడైన వీరవరుడు "దేవీ! నేను వెళ్ళి ఈ పనే చేస్తాను. ఇప్పుడే నా కుమారుని బలిఇస్తాను'' అన్నాడు. "ఇంతకంటే స్వామి హితం కోరేవా రెవరుంటారు? నీకు మంగళం కలుగుగాక!'' అని చెప్పి భూదేవి తిరోహితు రాలైనది.

అతని వెంటనే వచ్చినరాజు ఈ సంభాషణ సంతటినీ విన్నాడు: ఆ తర్వాత విక్రమతుంగమహారాజు కనబడకుండా అనుసరిస్తుండగా వీరవరుడు త్వరత్వరగా ఆ రాత్రే తన ఇంటికి వెళ్ళినాడు.

భార్య ధర్మవతిని మేల్కొల్పి ఆమెతో తమ కుమారుని రాజుకోసమై బలి ఇవ్వవలసి ఉన్నదని భూదేవి వచనంగా తెలియ

జేసినాడు. ఆ మాటవిని ఆమె "స్వామికి హితమైన కార్యమేదైనా చేయవలసినదే. మీ కుమారుని నిద్రలేపి ఈ సంగతి తెలియజేయ వలసింది'' అన్నది.

అంతట వీరవరుడు కుమారుని నిద్రలేపి రాజుకోసమై అతనిని బలి ఇవ్వవలసినదని భూదేవి చెప్పిన వృత్తాంతమంతా చెప్పినాడు. ఆ మాటవిని సత్త్వవరుడను సార్థకనామం కల ఆ బాలకుడు ఇట్లన్నాడు:

"ప్రభు కార్యానికి నా ప్రాణాలు ఉపయోగపడితే అంత కంటే పుణ్య మేమున్నది. ఆయన అన్నం తిని పెరిగి పెద్దవాడ నౌతున్నాను. కాబట్టి నన్ను తీసుకొనిపోయి ప్రభువుకోసమై దేవికి ఉపాహారం చేయవలసింది'' అని చెప్తున్న ఆ సత్త్వవరునిచూచి 'నిజంగా నీవు నా కుమారుడవే' అని ఏ మాత్రం చలించని ఆ బాలకునితో తండ్రి అన్నాడు.

ఇదంతా బయటనున్న విక్రమతుంగమహారాజు విన్నాడు. 'ఆహా! వీరందరూ సత్త్వంలో సమానులే' అనుకున్నాడు.

ఆ తర్వాత వీరవరుడు తన కుమారుడైన సత్త్వవరుని ఎత్తుకొన్నాడు. కూతురు వీరవతి, అతనిభార్య ధర్మవతి ఆయన వెనుక నడచినారు. ఇలా వారు చండికా గృహానికి వెళ్ళినారు. రాజు విక్రమతుంగుడు కూడా వారివెంటనే మెల్లగా నడచినాడు.

అక్కడ వీరవరుడు సత్త్వవరుని క్రిందికి దింపగా ఆ బాలుడు ధైర్యరాశి అయిన వాడు ఆ దేవికి నమస్కరించి ఇట్లన్నాడు: "ఓదేవీ! నా మూర్ధోపహారంతో మా ప్రభువు జీవించు గాక! విక్రమతుంగ మహారాజు భూమిని నిష్కంటకంగా శాసించు గాక!''

ఈ విధంగా అంటున్న కుమారుని చూచి 'సాధు! పుత్రా! సాధు!' అని మెచ్చుకొని తన కరవాలాన్ని బయటకుతీసి వీరవరుడు కుమారుని తలను నరికివేసినాడు. 'రాజునకు క్షేమం కలుగుగాక!' అని ఆ చండికాదేవికి నివేదనం చేసినాడు. స్వామి భక్తులకు పుత్రుడు, తాను అన్నస్పృహ ఉండదు కదా!

"సాధు! వీరవరా! సాధు! సుతుని ప్రాణాలనే సమర్పించి స్వామి జీవితాన్ని రక్షించినావు'' అన్న ఆకాశవాణి వినిపించినది.

ఇదంతా చూస్తూ వింటూ ఆ రాజు ఆశ్చర్యచకితుడైనాడు. వీరవరుని కుమార్తె అయిన వీరవతి, నరికివేసిన తన తమ్ముని తలను మూర్కొని, ఆలింగనం చేసుకొని, ముద్దిడుకొని 'ఓ సోదరా!' అని ఆక్రందనం చేస్తూ గుండెపగిలి చనిపోయినది. తన కూతురుకూడా చనిపోవడంచూచిన భార్య ధర్మవతి దైన్యంతో అంజలి ఘటించి వీరవరునితో ఇట్లన్నది:

"రాజునకు క్షేమం చేకూర్చినావు. ఇప్పుడు నాకు అనుజ్ఞ ఇవ్వవలసింది. ఈ చనిపోయిన పిల్లలతోపాటూ నేనూ అగ్ని ప్రవేశం చేస్తాను.'' దృఢంగా ఈ మాటలు పల్కుతున్న ఆమెను చూచి వీరవరు డిట్లన్నాడు:

"ఈ సమయంలో నేనేం చెప్పగలను? అలాగే చెయ్యి. పుత్రశోకమయమైన సంసారంలో నీకు సుఖం లేదు. నీకై చితిని ఏర్పరుస్తాను. అంతదాకా నిరీక్షించు" అని చెప్పి అక్కడున్న దేవీక్షేత్ర నిర్మాణ దారువులతో చితినిపేర్చి దానిపై పిల్లలనుంచి దీపాగ్నితో జ్వలింపజేసినాడు.

ఆ తర్వాత భార్య ధర్మవతి ఆయనకు పాదాభివందనం చేసి "ఓ ఆర్యపుత్రా! మరుజన్మలోకూడా నీవే నాకు భర్తవు

కావాలి. ప్రభువునకు మంగళమగుగాక!" అని అన్నది. ఆపైన జ్వాలాజటాలమైన ఆ చితాగ్నిలో చల్లటి సరోవరంలోనికి దిగినట్టుగా దిగినది.

అక్కడ గుప్తంగానున్న విక్రమతుంగుడు "వీరి ఋణాన్ని ఏ విధంగా నేను తీర్చుకోగలను?'' అని ధ్యానమోహితుడైనాడు.

అంతట ధీరచేతస్కుడైన వీరవరుడుకూడా ఇలా తలపోసుకున్నాడు: "స్వామికార్యం సంపన్నమైనది. దివ్యవాణి సాక్షాత్తూ వినబడినది. నేను సేవించిన ప్రభువు నాకు పెట్టిన అన్నం ఋణం పరిపూర్తిగా చెల్లించుకున్నాను. నా కుటుంబం ఉంటే రాజసేవ చేసి ఆ భృతితో కుటుంబాన్ని పోషించుకొనవలసి ఉండెను. నా ఒకనిపొట్ట నింపుకొనడంకోసం ఈ జీవన మెందుకు? కాబట్టి నన్ను నేనే అర్పణం చేసుకొని ఈ అంబికను అర్చిస్తాను'' అని వీరవరుడు సత్త్వనిష్ఠుడై చండికను సంకల్పించుకొని ఆ వరదురాలైన ఆమెను స్తోత్రం చేసినాడు.

"మహేశ్వరీ నీకు నమస్కారం. ప్రణతులకు అభయమిచ్చే దానవు నీవు. సంసార పంకమగ్నుడనైన నన్ను శరణాగతుడైన వానిని ఉద్ధరించు. నీవు సర్వ భూతాలకూ ప్రాణశక్తివి. నీ వల్లనే ఈ జగత్తు నడుస్తున్నది. సృష్టికి ముందు స్వయంగా జనించి శంభుని స్వయంగా చూచినావు. విశ్వాన్ని అంతటినీ దేదీప్యమానంగా నీవు ప్రకాశింపజేసి దుర్నిరీక్ష్యమైన తేజస్సుతో ఉన్నావు. ఉదయించిన అకాండోచ్చండ బాలార్క కోటి పంక్తివలె నున్నావు. భుజాలతో దిగంతాలను చక్రవాళం వలె సంఛాదితం చేసినావు. ఖడ్గ ఖేటక కోదండ శరశూలాది ధారిణివి. ఆ దేవుడైన

త్రిశూలి చేతనే సంస్థితురాలైన దానివి. ఓ చండీ! చాముండీ! మంగళా! త్రిపురా! జయా! నీకు నమస్కారం. నీవు ఒక అంశలో శివవు, దుర్గవు. నారాయణివి. సరస్వతివి. భద్రకాళివి. మహాలక్ష్మివి. సిద్ధినొనగూర్చు దానవు. రురు విదారిణివి. నీవే గాయత్రివి. మహారాజ్ఞివి. రేవతివి. వింధ్యవాసినివి. నీవే ఉమవు. కాత్యాయనివి. శర్వపర్వత వాసినివి. నీ కిలాంటి పేళ్ళెన్నో ఉన్నవి. ఆ పేళ్ళతో హరుడు నిన్ను స్తుతించినాడు. ఇది విని స్కందుడు, వసిష్ఠుడు, బ్రహ్మాదులు నిన్ను స్తుతించినారు. ఓ భగవతీ! అమరులు, ఋషులు, నరులూ నిన్ను స్తుతిస్తూ తాముకోరిన వానికంటే అధికమైన కోర్కెలను ఈడేర్చుకున్నారు. కాబట్టి నాకు ప్రసన్నురాలవు కమ్ము. నీవే నా శిరోపహారపూజను కూడా స్వీకరించు. మా ప్రభువునకు శ్రేయస్సు చేకూరు గాక!"

అని చెప్పి తన తలను నరికి వేసుకొనడానికి కత్తి ఎత్తగానే ఆకాశవాణి నభస్స్థలం నుంచి ఇలా వినవచ్చినది: "ఓ కుమారా! నీవు సాహసం చేయవద్దు. నీ సత్త్వప్రదర్శనంతోనే నేను సంప్రీతురాలైనాను. నీ కేవరం కావలెనో నన్నడిగి తీసుకో."

ఆ మాటవిని "ఓ దేవీ! నీవు సంతుష్టురాలవై ఉంటే విక్రమతుంగ మహారాజు మరొక నూరేళ్ళు జీవించుగాక! నా భార్య, సంతానం జీవింతురు గాక!" అని ప్రార్థించినాడు. అందుకు దివ్యవాణి "అలాగే కాని"మ్మని తిరిగి వినవచ్చినది.

వెంటనే అక్షతగాత్రులై అతని భార్య, పుత్రుడు, పుత్రిక బ్రతికినారు. ధర్మవతి, వీరవతి, సత్త్వవరుడు ముగ్గురూ తమ

దేహాలతో నిలబడినారు. ఆ విధంగా దేవి అనుగ్రహంతో జీవించిన వారిని సంతుష్టుడై వీరవరుడు తన ఇంటికి పిలుచుకొని వెళ్ళి తాను తిరిగి రాజసింహద్వారంవద్దకు వచ్చినాడు.

అతని వెంటనే విక్రమతుంగుడు దీని నంతటినీ చూచి ఆశ్చర్యమూ, సంతోషమూ కలుగగా తిరిగి తనఇంట కనబడకుండా ప్రవేశించి ప్రాసాదాన్ని అధిరోహించినాడు.

"సింహద్వారంలో ఎవరున్నారు?" అని పైనుంచే అడిగినాడు. దానిని విన్న అధిష్ఠితుడైన వీరవరుడు ఇట్లా జవాబిచ్చినాడు: "ఇక్కడ నేనే ఉన్నాను. మీరు చెప్పిన స్త్రీని చూచుటకై వెళ్ళి నేను తిరిగివచ్చినాను. ఆమె ఏదో దేవతవలె కనిపించి అంతర్హితురాలైనది.

ఈ మాటవిని ఆ అత్యద్భుత విషయాన్ని చూచిన ఆ రాజు ఆ రాత్రి ఒంటిగానుండి ఇట్లా ఆలోచించుకున్నాడు: "అపూర్వమైన ఈ పురుషాతిశయాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? అంత శ్లాఘ్యమైన పనిని చేసి దానిని చెప్పకొనకుండా ఎవడు దాచుకోగలడు? గంభీరమైనా, విశాలమైనా, మహాసత్త్వమైనా మహాసముద్రం కూడా మహావాతస్పర్శతోనే సంక్షుబ్ధమై పోటీ పడుతుందే! ఇతను రాత్రి పరోక్షంగా తన పుత్ర దారా వ్యయంతో నాకు ప్రాణదానం చేసినవాడు. ఈయనకు నేను ఏమి ప్రత్యుపకారం చెయ్యగలను?" ఇలా ఏవేవో ఆలోచించుకుంటూ ఆ రాజు ప్రాసాదంనుంచి దిగి అంతఃపురంలోనికి వెళ్ళి ఆశ్చర్యచకితుడై ఆ రాత్రిని గడిపివేసినాడు.

ఉదయం, వీరవరుడుకూడా ఉన్న తన మహాస్థానంలో, అద్భుతమైన ఆ రాత్రి జరిగిన కథ నంతటినీ చెప్పివేసినాడు.

అతనిని సభ్యులందరూ ప్రస్తుతిస్తుండగా, అతడు వద్దంటున్నా రాజు అతనిని పట్టబంధంతో గౌరవించినాడు. అనేక ప్రాంతాలను, అశ్వాలను, గజాలను, రత్నాలను, పదికోట్ల దీనారాలను సమర్పించినాడు. ఆయన భృతిని అరింతలు చేసినాడు. వెనువెంటనే ఆ ద్విజుడైన వీరవరుడు రాజతుల్యుడైనాడు. గౌరవసూచకంగా గొడుగులు పడుతుండగా కృతార్థుడై కుటుంబంతో పాటూ ఆనందంగా ఉన్నాడు."

ఈ కథను చెప్పి ఉపసంహరించి నరవాహనదత్తునితో మంత్రి గోముఖుడు తిరిగి ఇట్లన్నాడు:

"ఈ విధంగా ఓ దేవా! పుణ్యయోగంవల్ల రాజులకు ఏకైక వీరులైన భృత్యులు కొందరు దొరుకుతుంటారు. వారు స్వామ్యర్థమై తమ దేహత్యాగాన్ని కూడా లెక్కించపక ఉభయ లోకాలలోను సుసత్త్వులై జయాన్ని పొందుతారు. కాబట్టి ప్రభూ! ఈ ద్విజ ప్రవీరుడు నీ కలాంటి సేవకుడుగానే కన్పిస్తున్నాడు. నవాగతుడు, అధికాధిక సత్త్వగుణుడు, స్థిరసౌష్ఠవాకృతి గలవాడు అయిన ప్రలంబబాహుడు అలాంటివాడే కావచ్చును.

—ఈ విధంగా ఉదారసత్త్వుడు, విమలమతి అయిన ఆయనను గురించి, తనమంత్రి గోముఖునిద్వారా విని, నరవాహనదత్త రాకుమారుడు మనసులో అపార పరితోషాన్ని చెందినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో అలంకారవతీలంబకంలో
తృతీయ తరంగం.

# చతుర్థ తరంగం

## నరవాహనదత్తుని వేట

వత్సరాజైన తండ్రి ఇంటిలో గోముఖాదులైన నిజ సచివులు అనురక్తితో సేవింపగా నరవాహనదత్తుడు నివసిస్తున్నాడు. తనపై అనురాగంగల దేవి అలంకారవతి తోడుగా నున్నది. మాన విఘ్నాన్ని సహించనిది కావడం వల్ల ఈర్ష్య అణగారి పోగా ప్రేమోపకర్షవల్ల అనురాగవతి అయిన అలంకారవతితో ఆయన విహరిస్తున్నాడు.

ఇట్లా ఉంటూ ఒక సారి తన రథంపై వెనుక గోముఖుని కూర్చుండబెట్టుకొని వేటకై నరవాహనదత్తుడు అరణ్యానికి వెళ్ళినాడు. విప్రవీరుడైన ప్రలంబబాహుడు ముందు నడిచినాడు. తన అనుచర సైనికులతో కలిసి అక్కడ మృగయా వినోదంతో క్రీడించినాడు. సర్వ ప్రాణులూ పర్వెత్తుతుండగా వాటి వేగాన్ని కూడా జయించి ప్రలంబబాహుడు ముందు వెళ్ళిపోతూనే ఉన్నాడు.

రాజు రథంపై నిలిచి సింహ వ్యాఘ్రాదులను బాణాలతో వధించినాడు. ప్రలంబబాహుడేమో పాదచారిగానే ఉండి వానిని చంపివేస్తున్నాడు. ఆ విప్రుని చూచి చూచి ఏమి శౌర్యం! ఏమి జంఘా జవం! అని నరవాహనదత్తుడు విస్మితుడైనాడు. వేట ముగించుకొని అలసిపోయి సారథి, గోముఖులతో పాటూ ప్రలంబ బాహుడు తనముందు నడుస్తుండగా రథారూఢుడై దప్పిగొని

నీటికోసం వెతుకుతూ వత్సరాజ కుమారుడు మరొక మహారణ్యం లోనికి ప్రవేశించినాడు.

పోగా పోగా వికసిత కాంచన కమలాలతో ఒక దివ్యమైన గొప్ప సరస్సు కనిపించింది. అనేక సూర్య బింబాలతో భూమి గతమైన రెండవ ఆకాశం వలె ఉన్నదది. అందులో స్నానంచేసి నీరుత్రావి తన అనుచరులందరూ కూడా స్నానాదులు నిర్వర్తింపగా ఒకవేపున నలుగురు పురుషు లుండడం దూరం నుంచి నరవాహనదత్తుడు చూచినాడు.

దివ్యాకృతిగల వారు, దివ్య వస్త్రాభరణాదులను ధరించిన వారూ అయిన ఆ పురుషులు ఆ సరస్సులోని బంగారు కమలాలను కోసి తీసుకొంటున్నారు. వారిని సమీపించగా "మీ రెవరు?" అని వారు ప్రశ్నించినారు. రాజు తన వంశాది వృత్తాంతాన్ని వారికి వినిపించినాడు.

## దివ్యపురుషుల కథ

వారు కూడా ఈయనను చూచి సంతుష్టులై తమ్ము గూర్చి ఆయన ప్రశ్నింపగా ఇట్లా చెప్పినారు:

"మహాసముద్ర మధ్యంలో ఒక గొప్ప విశాల సుందర ద్వీపం కలదు. దానినే నారికేళ ద్వీపమని అంటారు. దాని సౌందర్యం లోకప్రసిద్ధమైనది. అక్కడ నాలుగు పర్వతాలున్నవి. అవి దివ్యభూములు. వానిపేరు మైనాకం, వృషభం, చక్రం, వలాహకం. ఆ నాలుగు పర్వతాలలో మేము నలువురమూ నివసిస్తుంటాము.

మాలో ఒకనిపేరు రూపసిద్ధి, అతను వివిధరూపాలను ధరించగలడు. మరొకని పేరు ప్రమాణసిద్ధి. అతను సూక్ష్మమైన

అనేక ప్రమాణాలను పరికించగలడు. మూడవవాడు జ్ఞానసిద్ధి. అతను భూత వర్తమాన భవిష్యత్తుల నెరిగినవాడు. నాల్గవవాడు దేవసిద్ధి. సర్వదేవతా సిద్ధులను సాధించిన వాడు.

మేము ఇప్పుడు ఈ హేమ కమలాలను తీసుకొని శ్వేత ద్వీపంలోని శ్రీ పతిని పూజించుటకై వెడుతున్నాము. మేమంద రమూ ఆ విష్ణుమూర్తి భక్తులము. ఆయన అనుగ్రహంతో ఆ మా పర్వత రాజ్యాలలో అధిపత్యం వహించి సిద్ధియుక్తులమై సంపదల ననుభవిస్తూ ఉంటాము. ఆ శ్వేతద్వీపంలోని హరిని మీరుకూడా దర్శింతురుగాని రండి. మీ కిష్టమైతే అంతరిక్షమార్గం లో తీసుకొని పోతాము.''

అని ఈ విధంగా వారు చెప్పగా అందు కంగీకరించి నర వాహనదత్తుడు కావలసిన జలఫలాదులు గల ఆ చోటనే గోముఖా దులను ఉండమని చెప్పి తాను శ్వేతద్వీపానికి బయలుదేరినాడు. వారిలోని దేవసిద్ధి తన్ను ఒడిలో కూర్చుండ బెట్టుకొని గగన మార్గంలో బయలుదేరగా నరవాహనదత్తుడు వారితో వెళ్ళినాడు.

## నరవాహనదత్తుని శ్వేతద్వీప గమనం, విష్ణుసేవా ప్రాప్తి

ఆ శ్వేత ద్వీపానికి దూరంలో, అక్కడ ఆకసం నుంచి దిగి మెల్లగా ముందుకు నడిచి పార్శ్వస్థిత లక్ష్మీయుతుడు, పాదాంతస్థ వసుంధరుడు అయిన శ్రీ పతిని దర్శించుకొన్నాడు. శంఖచక్ర గదాపద్మములు ఆకారం ధరించి సేవిస్తుండగా, గంధ ర్వాదులు, నారదాదులు భక్తితో స్తుతిగీతా లాలపిస్తుండగా దేవ తలు, సిద్ధులు, విద్యాధరులూ ప్రణమిల్లుతుండగా ముందు గరుడుడు కూర్చొని ఉండగా, శేష శయ్యాగతుడై ఉన్న ఆ శ్రీ

పతిని ఆ నలువురు దేవ పుత్రకులు కొనిపోగా నరవాహనదత్తుడు సేవించుకున్నాడు.

సాధు సమాగమం ఎవరికి మాత్రం అభ్యుదయకారి కాదు?

ఆ తర్వాత ఆ దేవపుత్రకులు అర్చింపగా, కశ్యపాదులు స్తుతింపగా నరవాహనదత్తుడు అంజలి ఘటించి, ఆ విష్ణుమూర్తి నిట్లా స్తుతించినాడు:

"భక్త కల్ప తరువైన ఓ భగవాన్! నీ కిదే నమస్కారం. లక్ష్మీకల్ప లతాశ్లిష్ట దేహుడవు నీవు. అభీష్టదాయివి. దివ్యహంసుడవు. సత్పురుషుల మానసంలో నివసించువాడవు. సంతతోదితనాథుడవు. పరాకాశ విహారివి అయిన నీ కిదే నమస్కారం. అతి సర్వుడవు. సర్వాభ్యంతరవర్తివి. గుణాతిక్రాంత రూపుడవు. పూర్ణషాడ్గుణ్య మూర్తివి అయిన నీ కిదే నమస్కారం.

నీ నాభికమలంలో బ్రహ్మ ఉద్భవించి స్వాధ్యాయం చేస్తూ మృదుధ్వనిని కల్పించినాడు. తదుద్భూత బహుచరణుడైనప్పటికీ అతను షట్ చరణుడు.

నీకు భూమిపాదము, ఆకాశం శిరస్సు. దిక్కులు చెవులు. సూర్యచంద్రులు లోచనాలు. బ్రహ్మాండం నీ జఠరం. ఇలాంటి ఒకానొక పురుషోత్తముడుగా నిన్ను బుధులు స్తుతిస్తారు.

నీతో కాంతిని గ్రహించి భూతగ్రామమంతా సంచరిస్తుంది. ఓ ప్రభూ! ప్రజ్వలిస్తున్న అనలం నుంచి పైకెగిరే విస్ఫులింగాల వంటిదీ భూతగ్రామం.

సాయం కాలం పక్షులన్నీ తాము నివసించే చెట్టును చేరునట్టుగా తిరిగి ఈ భూతగ్రామ మంతా ప్రళయ కాలంలో నీలోనే ప్రవేశిస్తుంది.

అనంతవేలాక్షుభితమైన వారిధి తరంగాలను వలె నీవు ఉల్లాసంతో నీ అంశలో ఈ భువనేశ్వరులను సృష్టి స్తావు.

నీవు విశ్వరూపుడవైనా అరూపుడవు. విశ్వకర్మ వైనా అక్రియుడవు. విశ్వాధారుడవైనా అనాధారుడవు. నీతత్త్వం ఎవరికి తెలుసు?

నీవు ప్రసన్నుడవై కటాక్షించడంతో దేవతలు సమృద్ధిని పొందుతారు. ప్రసన్నుడవై నాపై అనుగ్ర హించు. ఆర్ద్ర దృక్కులతో నన్ను చూడు."

ఈ విధంగా స్తుతిస్తున్న నరవాహనదత్తుని సానుగ్రహ వీక్ష ణాలతో చూస్తూ ఆ విష్ణుమూర్తి నారదునితో ఇట్లన్నాడు: "నారదా! పాలసముద్రంలో పూర్వం పుట్టిన అప్సరసలను దేవేం ద్రునివద్ద ఇల్లడ ఉంచినాను. నీవు వెళ్ళి నా మాటగా చెప్పి వా రందరినీ వెదికి తీసుకొని ఒక రథంపై కూర్చుండబెట్టుకొని ఇక్కడికి రా!''

ఈ విష్ణుమూర్తి మాటలు విని నారదుడు 'చిత్త'మనిచెప్పి వెళ్ళి, ఆ అప్సరసల నందరినీ ఇంద్రుని వద్దనుంచి, అతని రథం లోనే కూర్చుండబెట్టుకొని మాతలితో పాటూ వచ్చినాడు.

ఆ అప్సరసలు దగ్గరకువచ్చి ప్రణమిల్లగా, వత్సరాజ పుత్రుని చూచి భగవంతు డిట్లా ఆదేశించినాడు: "ఓ నరవాహన

దత్తా! వీరందరినీ నీకు నేను దత్తం చేస్తున్నాను. విద్యాధరేంద్రు లకు నీవు భావిచక్రవర్తివి. వీరికి తగిన భర్తవు నీవు. వీరు నీకు తగిన భార్యలు. పూర్వం నిన్ను కామదేవతావతారంగా ఈశ్వరుడు సృష్టించినాడు."

ఆ మాటవిని వత్సేశ్వరకుమారుడు నారాయణుని పాదా లపై పడినాడు. భగవదనుగ్రహాన్ని పొంది సంతుష్టుడు కాగా విష్ణుమూర్తి మాతలి నిట్లా ఆదేశించినాడు. "అప్సరసలతోపాటు ఈ నరవాహనదత్తుని, అతను ఏ దారిలో కోరితే ఆ దారిలో, స్వగృ హానికి కొనిపోవలసింది."

ఈ విధంగా భగవంతుడు ఆజ్ఞాపింపగా అప్సరసలతోపాటు ఆయనకు నమస్కరించి నరవాహనుడు మాతలి సారథిగాగల ఆ రథంపై ఎక్కినాడు.

## నరవాహనదత్తుని నారికేళద్వీప గమనం

ఆ దేవపుత్రులతోపాటు దేవతలకుకూడా ఈర్ష్యజనింపజేసే నరవాహనదత్తుడు నారికేళ ద్వీపానికి బయలుదేరినాడు. అక్కడ రూపసిద్ధి ప్రభృతులైనవారితో సత్కృతుడై ఆ నలుగురు దివ్య పురుషులతోను, మాతలితోను కలిసి, మైనాక వృషభాద్రులైన వారి నివాసభూములందు క్రమంగా ఆ అప్సరసలతో కలిసి స్వర్గోపభోగాన్ని మించిన దివ్యానుభూతులను పొందినాడు.

అంతలో వసంతం రాగా వికసించిన కుసుమసంచయంతో కూడిన నానాతరువనాదులయందు, ఆ ఉద్యానభూములయందు కుతూహలంతో అతను విహరించినాడు.

"చూడు! ఈ తరుమంజరులు వికసించిన విశాల పుష్ప నేత్రాలతో వస్తున్న వసంతకాంతుని చూస్తున్నట్టున్నవి. తమ

జన్మక్షేత్రంలో సూర్యాతపోష్ణంతో కలిగిన సంతాపం మనకు రాకుండుగాక అని సరస్సు విరిసిన తామరలతో కప్పబడిపోయి నది. చూచావా కర్ణికారం సౌరభరహితమైనప్పటికీ ఎంత ఉజ్జ్వలంగా ఉన్నదో! దీనినుంచి తుమ్మెదలు, శ్రీమంతులు సాధువుల నుంచి దూరంగా తొలగినట్టు తొలగి పోతున్నవి. ఇక కిన్నరీ గీతాలతో, కోకిల కూజితాలతో, తుమ్మెదల రొదలతో ఋతురాజునకు సంగీతమేళకం ఇక్కడ జరుగుతున్నట్టున్నది.''

ఈ విధంగా దేవపుత్రులు అభివర్ణిస్తూ నరవాహనదత్తునకు తమ వనావళిని చూపించినారు. వారి పట్టణాలలోను వసంతోత్సవంలో నృత్యం చేస్తున్న పౌరబృందాలను చూస్తూ వత్సరాజ కుమారుడు వినోదించినాడు.

అప్సరసలతో కలిసి అమరోచితాలైన భోగాల ననుభవించినాడు. సుకృతులు వెళ్ళిన చోట్లకు ముందుగానే ఇలాంటిబుద్ధులు వెడుతాయి కదా!

ఈ విధంగా మూడునాలుగు రోజులు గడిపి ఆ దేవపుత్రకులను, తనకు మిత్రులైనవారిని, నరవాహనదత్తుడు ఇట్లా ఉద్బోధించినాడు:

"మా తండ్రిని చూచుటకు కుతూహలంగా ఉన్నది. నేను మా పట్టణానికి వెళతాను. కాబట్టి మీరుకూడా మా పట్టణానికి వచ్చి మమ్ములను కృతార్థులనుచేయండి. మా ప్రదేశాలను చూడండి."

ఆ మాటవిని వారిట్లా అన్నారు: "ఆ పట్టణ సౌభాగ్యం ముందే చూచి ఉన్నాము. విద్యాధరత్వం పొందిన తర్వాత మీరు మమ్ములను జ్ఞాపకం పెట్టుకుంటే చాలు. ఇంకేం కావాలి" అని

చెప్పగా వారిని వీడ్కొని వారు ఇంద్రుని రథం కొనిరాగా నర వాహనదత్తుడు దాని సారథి మాతలితో ఇట్లన్నాడు:

"నా మిత్రులు గోముఖాదులు ఉండిపోయిన సర స్తీరానికి ముందువెళ్ళి ఆ మార్గంలో కౌశాంబీపట్టణానికి నన్ను చేర్చవల సింది."

అతను 'సరే' అని అనగా అప్సరసలతో పాటూ అతనా రథాన్ని ఆరోహించి గోముఖాదులున్న సరస్సును చేరుకున్నాడు. "నాతోపాటు రండి. త్వరగా ఇంటికి వెళితే ఆ తర్వాత జరిగిన వృత్తాంతమంతా చెబుతాను" అని అతను వారందరితో పాటు ఇంద్రరథంలో కౌశాంబికి వెళ్ళినాడు.

అక్కడ ఆకసంనుంచి క్రిందికిదిగి మాతలిని సత్కరించి పంపివేసి, అప్సరసలతో పాటూ తన మందిరంలో ప్రవేశించి నాడు. వారి నక్కడ ఉంచి వత్సేశ్వరుని దగ్గరకువెళ్ళి తనరాకతో సంతోషిస్తున్న తన తండ్రి పాదాలకు నమస్కరించినాడు. ఈతనిని చూచి తల్లి వాసవదత్త, పద్మావతీదేవి సంతృప్తదృష్టులై అభినందించినారు.

ఆ తర్వాత రథారూఢుడై గోముఖుడు సారథితో పాటూ, ఆ విప్రుడు ప్రలంబబాహునితో పాటూ అక్కడికి వచ్చినాడు. వారందరూ కూర్చుండగా తండ్రి ప్రశ్నించడంతో నరవాహన దత్తుడు మహాద్భుతమైన తన వృత్తాంతాన్ని వినిపించినాడు.

ఈశ్వరుడు సుకృతకర్ములైన వారిని అనుగ్రహింప జూస్తాడు. అలాగే వారికి కల్యాణ మిత్ర సంయోగాన్ని కల్పి స్తాడు అని అక్కడున్న వారందరూ ప్రశంసిస్తుండగా వత్స

రాజు సంతుష్టుడై తన తనయునికి కల్గిన అచ్యుతానుగ్రహాన్ని అభినందించినాడు.

ఆ తర్వాత గోముఖుడు కొనిరాగా హరిప్రసాదలబ్ధలైన తన కోడండ్రైన అప్సరసలు ఆయనకు పాదాభివందనం చేసినారు. వారు దేవరూప, దేవరతి, దేవమాల, దేవప్రియ. అలాగే పరిచారికలతో కూడిన పృష్టుడనేవాడు కూడా వారిలో ఉన్నాడు.

"నేనెక్కడ? ఈ అప్సరస లెక్కడ? రాజపుత్రుడైన నరవాహనదత్తుడు భూమినే స్వర్గం చేసివేసినాడు కదా!" అని కౌశాంబీనగరం ఉత్సవం చేసుకుంటూ ఎగురుతున్న రక్తపతాకాల నుండి సిందూరం రాలుతుండగా అనుకుంటున్నట్టున్నది.

నరవాహనదత్తుడు తండ్రికి నయనోత్సవం చేసి, తన మార్గాన్ని నిరీక్షిస్తూ ఉండిన తన భార్యలను సంభావించినాడు. ఆ నాలుగురోజులే నాలుగేళ్ళుగా విరహ మనుభవించినట్టు కృశీభూతలైన వారిని అభివర్ణిస్తూ ఆనందింపజేసినాడు.

గోముఖు డేమో మార్గంలో రథవాజులను రక్షిస్తూ ప్రలంబబాహువు సింహాదులను వధించిన పరాక్రమక్రమాన్ని నివేదించి నాడు.

ఈ విధంగా శ్రుతిసుఖాలైన కథాలాపాలను వింటూ, ఆ కాంతల నయనామృత రూపాలను అభివర్ణిస్తూ చాటూక్తులాడుకుంటూ మంత్రులతో పాటూ మధుసేవనం చేస్తూ నరవాహనదత్తుడు సుఖంగా కాలక్షేపం చేసినాడు.

ఒకసారి నరవాహనదత్తుడు అలంకారవతీ విలాసగృహంలో తనతో మంత్రులు పరివేష్టించి ఉండగా, వెలుపల పెద్దతూర్య

కోలాహలం విన్నాడు. అప్పుడు సేనాపతి అయిన హరిశిఖుని "అదేదో పెద్దగా తూర్యనాదం వినపడుతున్నది. హఠాత్తుగా ఇదేమిటి ?" అని అడిగినాడు.

## సముద్ర వైశ్యకథ

అది వినగానే బయటికివెళ్ళి వెంటనే తిరిగి లోనికివచ్చి హరిశిఖుడు తన ప్రభువైన వత్సరాజ సుతునితో ఇట్లా విన్నవించు కున్నాడు: "ఓ దేవా! ఈ నగరంలో రుద్రుడనే పేరుగల వర్తకు డొకడున్నాడు. అతను వాణిజ్యార్థమై సువర్ణద్వీపానికి వెళ్ళినాడు. తిరిగి వస్తూండగా తను సంపాదించుకున్న అర్థసంచయమంతా నౌకాభంగంతో సముద్రంలో మునిగి నాశనమైపోయినది. తానొ క్కడే సముద్రంనుంచి బ్రతికి బయటపడి ఆరురోజులముందు ఆపన్నుడై తన ఇంటికి తిరిగివచ్చినాడు.

దుఃఖితుడై కొన్ని దినములు ఇక్కడ ఉండగానే తన ఉద్యానంలో దైవవశాత్తూ అతనికి ఒక గొప్ప నిధి దొరికినది. ఆ సంగతిని వాని దాయాదులు వత్సరాజుకు తెలియజేసినారు. అందువల్ల ఆతనేవచ్చి ప్రభువుతో ఇట్లా విన్నవించుకున్నాడు:

"నలభైకోట్ల హేమరూపధనం, రత్నాలు నాకు దొరికినవి. దేవరవారు ఆదేశిస్తే నేను వానిని సమర్పించుకుంటాను" అన్నాడు. అందుకు "జలాశయం దోపిడీ చేయగా, దీనుడైన నిన్ను బ్రహ్మ దేవుడు చూచి కృపతో దీని నను గ్రహించినాడు. దానిని ఏ మూఢుడు అపహరింపగలడు? నీవే వెళ్ళి నీ ఇష్టం వచ్చినట్టు నీ భూమిలో నీకు దొరికిన ధనాన్నంతటినీ అనుభవించు" అని వత్సరాజు ఆదేశించినాడు.

అప్పుడా వర్తకుడు ఆనందం పట్టలేక ఆయన పాదాలపై పడి లేచి వివిధతూర్య ధ్వనులతో తన అనుచరులతో పాటు తన ఇంటికి పోతున్నాడు —

ఈ విధంగా హరిశిఖుడు చెప్పగా తన తండ్రి ధార్మికతను విని నరవాహనదత్తుడు విస్మితుడై తన మంత్రులతో ఇట్లా అన్నాడు: "తానే ధనాన్ని అపహరించి వెంటనే వానికి ధనం సమకూరుస్తూ విధి నరులకు ఉన్నతి నిపాతాలను కల్పిస్తూ వారితో ఆడుకుంటూ ఉంటాడు. ఎంతచిత్ర మిది?" అన్నాడు.

ఆ మాటవిని గోముఖుడు విధివిలాసం ఇలాంటిదే. సముద్ర శూరుని కథను ఒకదానిని చెప్తాను వినండి:

## సముద్రశూరుని కథ

"హర్షపురమనే పేరుగల అందమైన నగరం ఒకటి కలదు. పూర్వం హర్షవర్మ అనే రాజు దానిని పాలిస్తున్నాడు. అందు లోని ప్రజలందరూ సత్పరిపాలనలో సుఖంగా ఉండేవారు.

ఆ నగరంలో సముద్రశూరుడను పేరుగల మహావర్తకు డొకడు కలడు. అతడు కులీనుడు. ధార్మికుడు. ధీరసత్త్వుడు. బహుధనేశ్వరుడు. అతను వ్యాపారార్థమై ఒకసారి సువర్ణద్వీపా నికి పోదలచుకున్నాడు. సముద్రతీరంవరకు వెళ్ళి అందులో ఒక నౌకను ఆరోహించినాడు.

అతనలా సముద్రంలో వెడుతుండగా ఇంకా స్తదూరంలో సువర్ణద్వీపం ఉన్నదనగా ఘోరమైన వర్షం ఆరంభమైనది. దానికితోడు పెనుగాలి వీవగా సముద్రమంతా సంక్షుభితమైనది. ఆ అలలవేగంతోనూ, మొసళ్ళతాకిడితోనూ ఆ నావ భగ్నం కాగా

అతను తన బట్టలను గట్టిగా కట్టుకొని ఆ సముద్రంలో దుమికినాడు.

అతను కాస్తదూరం చేతులతో ఈదుకుంటూ వెళ్ళేలోగా ఎప్పుడో చనిపోయిన ఒక పురుషుని శవం గాలికి కొట్టుకొని వచ్చినది. దానిపైనెక్కి చేతులతో నీటిలో ఈదుకుంటూ విధివశాత్తూ అనుకూలవాయువు మూలంగా సువర్ణద్వీపాన్ని చేరుకొన్నాడు.

అక్కడి ఇసుక తిన్నెలపై దిగి ఆ శవం నడుమునకున్న పంచలో ఏదోపెట్టి ముడివేసి కట్టిఉండడం చూచినాడు. ఆ గుడ్డను తీసి ముడిని విప్పి చూడగా అందులో రత్నాలు పొదిగిన కంఠాభరణం ఒకటి కన్పించినది. ఆ అనర్ఘమైన ఆభరణాన్ని తీసుకొని స్నానంచేసి సముద్రంలో పోయిన తన ధనమంతా దీని ముందు తృణప్రాయంగా భావించి సంతోషించినాడు.

అక్కడినుంచి బయలుదేరి క్రమంగా కలశపురమనే పట్టణం చేరుకొన్నాడు. ఆ కంఠాభరణం చేతపట్టుకొనే ఒక దేవాలయంలో ప్రవేశించినాడు. అక్కడ నీడలో కూర్చొని నీటిలో ఈదివచ్చిన శ్రమతో అలసి అలాగే నిద్రపోయినాడు.

విధిమోహితుడై నిద్రపోతున్న అతనివద్దకు హఠాత్తుగా పురరక్షకులు వచ్చినారు. అతని చేతిలో అసంవృతంగా ఉన్న కంటెను చూచినారు. అది రాజకుమార్తె కంఠంలో ఉండిన కంటెయేనని దానిని దొంగిలించుకొనిపోయిన దొంగ ఇతనేననీ వారు నమ్మినారు. అలా అనుకొని వారతనిని నిద్రలేపి రాజకులానికి కొనిపోయినారు.

అక్కడ రాజు స్వయంగా ప్రశ్నింపగా అతను జరిగినదంతా వివరించినాడు. వీడబద్ధాలు చెప్తున్నాడని ఆ కంఠాభరణం

చూస్తే ఇతనే దొంగ అని తేలుతున్నదని సభ్యులకు చూపుతుండగా మెరిసిపోతున్న ఆ కంటెను ఆకసంనుంచి అతివేగంతోవచ్చిన ఒక గ్రద్ద తన్నుకొని ఎక్కడికో కనిపించకుండా పోయినది.

అయినప్పటికీ ఆర్తుడైన ఆ వర్తకుని, శివుని శరణుఅంటూ ఆక్రందిస్తున్న వానిని, కోపంతో రాజు వధించవలసిందిగా ఆజ్ఞాపించినాడు. అప్పుడు ఆకసంనుంచి ఒక దివ్యవాణి ఇలా వినవచ్చినది:

"ఓ రాజా! ఇతనిని వధింపవద్దు. ఇతను హర్షపురంనుంచి వచ్చిన వర్తకుడు. సాధువు. సముద్రశూరుడని ఇతనిపేరు. మీ దేశానికి వచ్చినాడు. కంటెను దొంగిలించుకొనిపోయిన దొంగ పురరక్షకుల భయంతో విహ్వలుడై రాత్రి సముద్రంలో దుమికి చనిపోయినాడు. ఇతను ఆ చోరునిశవంపై నెక్కి తన నావ భగ్నమైపోవడంవల్ల ఎలాగో సముద్రాన్నిదాటి ఇక్కడకు వచ్చినాడు.

ఆ శవానికికట్టిన బట్టలో ముడివేసిఉన్న కంఠాభరణాన్ని చూచి అతను తీసుకొని వచ్చినాడు. మీ ఇంటినుంచి దొంగిలించలేదు. చోరుడుకాని ధార్మికుడైన ఈ వర్తకుని విడిచిపెట్టవలసింది. ఈ సముద్రశూరుని వధించకుండా సమ్మానించి వదలివేయవలసింది" అని ఆ వాక్కు విరమించినది.

ఈ మాటవిని సంతోషించి ఆ రాజు ఆ వర్తకుని వధించవద్దని విడిపించి ధనాలతో సత్కరించి తనదారిన తనను పొమ్మన్నాడు. ఆ ధనంతో మరొక భాండాన్నికొని బిడారుతో తిరిగీ భయంకరమైన సముద్రంలో ప్రయాణంచేసి గాలివేగంతో స్వదేశానికి బయలుదేరినాడు.

సముద్రం దాటిన తర్వాత ధనంతోపాటూ క్రమంగా ప్రయాణించి ఒకరోజు సాయంకాలానికి ఒక అడవిని చేరుకొన్నాడు. అక్కడ ఆ రాత్రి ఆ బిడారును నిలిపి తాను జాగరూకుడై ఉండగా దుర్జయమైన చోరసేన ఒకటి వచ్చిపడినది. అతని బిడారును చంపివేసి ఆ ధనాన్ని దోచుకొంటున్న ఆ దొంగల గుంపును చూచి సముద్రశూరుడు కనబడకుండా పరువెత్తి ఒక మఱ్ఱిచెట్టుపైనికి ఎక్కి కూర్చున్నాడు.

ఆ అపార ధనాన్నంతటినీ దోచుకొని చోరసైన్యం వెళ్ళిపోగా అతను భయాకులుడై దుఃఖార్తుడై ఆ రాత్రెల్లా ఆ చెట్టు మీదనే గడిపివేసివాడు.

ఆ మరునాటి ఉదయం దైవవశాత్తూ చెట్టుపైన చూడగా దీపప్రభవలె ఆకులమధ్య ఏదో మెరిసిపోతుండడం కన్పించినది. విస్మయంతో పైనికి ఎక్కిపోయి ఒక గ్రద్దగూటిని చూచినాడు. ఆ గూటినిండా భాస్వరమై అమూల్య రత్నాభరణ సంచయం కన్పించింది. దానినుంచి ఆ మొత్తం ఆభరణాల నన్నిటినీ తీసుకొన్నాడు. వాటిమధ్య ఆ కంఠాభరణం కూడా కన్పించింది. సువర్ణద్వీపంలో తనకు దొరికి, గ్రద్ద తన్నుకపోయిన ఆభరణమే అది!

ఈ విధంగా అమితధనాన్ని సముపార్జించుకొని, మఱ్ఱి చెట్టుపైనుండి క్రిందికి దిగి, ఆనందిస్తూ క్రమంగావెళ్ళి తన హర్షపురాన్ని చేరుకొన్నాడు.

అక్కడ ఆ వర్తకుడు-సముద్రశూరుడు ఇంక వేరే ద్రవ్యం మీది ఆశలేకుండా, తన బంధుజనంతో పాటు హాయిగా, యథేచ్ఛగా సుఖించసాగినాడు.

సముద్రంలో పడిపోవడం, తన ధనం నాశం కావడం, తిరిగీ సముద్రాన్ని దాటడం, ఆ కంటె దొరకడం, తిరిగి అది పోవడం, నిష్కారణంగా వధ్యశిలపైకి పోవలసిరావడం, తిరిగి రాజు అనుగ్రహంవల్ల ధనలాభం పొంది సముద్రాన్ని దాటి పయనించడం, దారిలో దొంగలుపడి సర్వాన్నీ అపహరించుకొని పోవడం, ఆ దగ్గరలోనున్న చెట్టుమీదినుంచి తిరిగీ ఆ వర్తకునకు హఠాత్తుగా కాంచన సంప్రాప్తి కలగడం—ఇదంతా చూస్తే విధి చేష్టిత మెంతటి చిత్రమైనదో తెలుస్తుంది. పుణ్యాత్ముడు తొలుత దుఃఖం పొందినా దానిని తప్పించుకొని తిరిగీ సుఖాన్ని పొందుతాడు''

—అని ఈ విధంగా గోముఖుడు చెప్పిన దానిని శ్రద్ధగా విని మనసు కలగిపోగా నరవాహనదత్తుడు స్నానాది దివసక్రియలకై లేచి వెళ్ళినాడు.

మరునాడు ఆయనవచ్చి కొలువుతీరగా, బాలసేవకుడు శూరుడు, సమరతుంగుడను రాజపుత్రుడు ఇట్లా విన్నవించినాడు. "ఓ దేవా! సంగ్రామవర్షుడను నా దాయాది వీరజితాది పుత్ర చతుష్టయంతో కలిసి నా దేశాన్ని నాశంచేశాడు. ఇప్పుడే వెళ్ళి ఆ ఐదుగురనూ బంధించి కొనివస్తాను. ఇది ప్రభువులవారికి తెలిసి ఉండవలె" నని చెప్పి అతను వెళ్ళిపోయినాడు.

తనసైన్యం తక్కువగా, శత్రువులు భూరిసేనా సమేతులై ఉండడం చూచి వత్సరాజ కుమారుడు అతనికి తన సైన్యాన్ని సహాయంగా పంపుతానన్నాడు. అయినప్పటికీ ఆ అభిమానవంతుడైన రాకుమారుడు వారి సాయం తీసుకోకనే వెళ్ళి ఆ శత్రువులను తన చేతులతోనే జయించి బంధించి కొనివచ్చినాడు.

అలా విజయుడై వచ్చిన ఆ వీరుని ఆ ప్రభువు సమ్మానించి తన బాలసేవకుని ప్రశంసించినాడు. విషయాక్రమణం చేసి సబలులై ఇంద్రియాలవలెనున్న శత్రువులను జయించి పురుషార్థాన్ని సాధించినాడు. చిత్రంకదా!"

అది విని గోముఖుడు ఇట్లా అన్నాడు: "ఇలాంటి కథ మీరు విని ఉండకపోతే చమరవాలు డనే రాజుకథ చెప్తాను వినండి.

## చమరవాల రాజుకథ

హస్తినాపురం అనే పట్టణం ఒకటి కలదు. అక్కడ చమరవాలుడనే రాజు కోశదుర్గ బలాన్వితుడై ఉన్నాడు. అతనికి తన రాజ్యం సీమాంతంలో సమరబలుడు మొదలైన రాజులు కలరు. అతనికి దాయాదులైన వారంతా కలుసుకొని ఇట్లా ఆలోచించుకొన్నారు.

"ఈ చమరవాలుడు మనలను ఒక్కొక్కసారి ఒక్కొక్కరిని బాధిస్తున్నాడు. ఎల్లప్పుడూ ఇలాగే జరుగుతున్నది. మనమంతా కలిసి ఒకేసారి అతనిపైబడి పరాభవించాలి.''

ఈ విధంగా సంప్రతించుకొని అతనిని జయించవలెనను కొన్న ఐదుగురు రాజులూ దాడి వెడలే ముహూర్తంకోసం రహస్యంగా ఒక జ్యోతిష్కుని ప్రశ్నించినారు.

శుభలగ్నం కనబడకపోగా అపశకునాలను చూచి ఆ గణకుడు "ఈ సంవత్సరంలో మంచి ముహూర్తం లే'' దని చెప్పినాడు. "ఎలా పడితే అలా మీరు వెడితే జయం లభించదు. లక్ష్మీఫలం భోగమే. అది అతనికంటే మీకే అధికంగా ఉన్నది.

కాబట్టి మీ అనుబంధంవల్ల అతనికి సమృద్ధి కలుగుతుంది. మీరు విని ఉండక పోతే ఇద్దరు వర్తకుల కథ ఒకటి చెప్తాను వినండి:

బహుసువర్ణరాజ కథ

'పూర్వం కౌతుకమనే ఒక పట్టణం కలదు. అక్కడ బహు ధనవంతుడైన రాజు కలడు. బహు సువర్ణకుడన్న పేరు అతనికి సార్థకమైనది. యశోవర్ముడనే ఒక క్షత్రియ యువకుడు అతని వద్ద సేవకుడుగా ఉన్నాడు. 

అతనికి, ఆ రాజు దాతే అయినప్పటికీ, ఎప్పుడూ ఏమాత్రం ఏమీ ఇవ్వలేదు. ఎప్పుడెప్పుడు దైన్యంతో అతను రాజును అర్థిస్తే అప్పుడప్పుడు ఆదిత్యునిచూపి ఇలా అనేవాడు. "నాకు, ఏదో నీకు ఇవ్వాలనే ఉన్నది. కానీ ఈ సూర్యభగవానునకు నేనేమివ్వడమూ ఇష్టంలేదు. నన్నేం చెయ్యమంటావో చెప్పు?"

ఆ తర్వాత అతను అవసరాన్ని వెతుకుతూ దుఃఖితుడై ఉండగా ఒకసారి సూర్యగ్రహణం వచ్చింది. ఆ సమయంలో సతతసేవకుడైన ఆ యశోవర్మ వెళ్ళి భూరి దానాల నిస్తున్న ఆ రాజును చూచి ఇట్లా విన్నవించినాడు: 

"మహారాజా! మీరు నాకేమీ ఇవ్వకుండా అడ్డుపడుతున్న ఈ సూర్యుడు, తన పగవానిచేత ఇప్పుడు చిక్కి ఉన్నాడు. ఇప్పుడే నాకేమైనా ఇప్పించండి." 

ఆ మాటవిని నవ్వుతూ ఆ మహారాజు వస్త్రహిరణ్యాదులను అనేక దీనారాలను అతనికి దానం చేసినాడు. క్రమంగా ఆ ధనం లుప్తంకాగా ఖిన్నుడై, భార్య చనిపోయి యశోవర్మ వింధ్యవాసినీదేవి వద్దకు వెళ్ళినాడు.

"జీవన్మృతుడనైన నాకీ అర్థంతోగానీ, నిరర్థకమైన దేహంతోగానీ పని ఏమిటి? ఈ దేవివద్ద నా కోరికలైనా తీర్చుకుంటాను, లేదా ఆమెముందు మరణిస్తాను" అనిచెప్పి వింధ్యవాసినీ దేవిముందు ఒక దర్భాస్తరణంపై కూర్చొని తదేక మనస్కుడై నిరాహారుడై తపస్సుచేయసాగినాడు. అతనికి కలలో కనబడి దేవి ఇట్లా ఆదేశించినది:

"ఓ కుమారా! నేను సంతుష్టురాలనైనాను. నీకు అర్థశ్రీని ఇమ్మంటావా? లేక భోగశ్రీని ఇమ్మంటావో చెప్పు!" ఆ మాటవిని యశోవర్మ ఆ దేవితో ఇట్లన్నాడు: "ఈ శ్రీ ద్వయంలో ఉన్న భేదమేమిటో నాకు తెలియడం లేదు." అప్పుడా దేవి ఇట్లన్నది:

"నీ స్వదేశంలో భోగవర్మ, అర్థవర్మ అనే ఇద్దరు వర్తకులున్నారు. నీవు వెళ్ళి వారి సమృద్ధిని చూచి నీ కెలాంటిది రుచిస్తుందో దానిని తిరిగి ఇక్కడికి వచ్చి అర్థించు."

ఆ మాటవిని మేల్కొని ఉదయమే పారణచేసి తన కౌతుకపురానికి ఆ యశోవర్మ వెళ్ళిపోయినాడు.

### అర్థవర్మ భోగవర్మల కథ

అతను అక్కడ మొదట అర్థవర్మ ఇంటికి వెళ్ళినాడు. అర్థవర్మ అసంఖ్యాక కాంచనరత్నాది సంపత్సమృద్ధుడు. అతని సంపదను చూచి అతని దగ్గరకు వెళ్ళినాడు. అతిథిసత్కారం పొందిన ఇతనిని అతను భోజనానికి పిలిచినాడు.

ఆ తర్వాత అతను నేయి, మాంసం, వ్యంజనాదులతో కూడిన అతిథ్యోచితమైన ఆహారాన్ని అర్థవర్మ ప్రక్కన కూర్చొని భుజించినాడు.

అర్థవర్మ మటుకు రెండుతులాల నేతిలో వేయించిన పేలాలు కొంచెం అన్నం, మరికొంచెం మాంసం భుజించినాడు. సార్థవాహుడు అదేమిటిలా భోజనం చేస్తున్నావని కుతూహలంతో అడిగినాడు. అప్పుడు ఆ వర్తకు డిట్లా బదులుచెప్పినాడు:

"ఏదో నీ కోసమని మాంసం కొంత తిన్నాను. కొద్దిగా అన్నము, ఇంతనెయ్యి, పేలాలు తిన్నాను. మామూలుగా కేవలం పేలాలనే తింటాను. ఇంతకంటే ఎక్కువ తింటే అజీర్ణరోగం కల నాకు జీర్ణంకాదు" అని చెప్పగా విని ఆ యశోవర్మ ఆలోచిస్తూ, తన మనసులో ఆ అర్థవర్మ సంపద విఫలమైనదని భావించు కొన్నాడు.

ఆ తర్వాత చీకటిపడగా అన్నము, పాలను ఆ వర్తకుని కోసమై అర్థవర్మ తెప్పించినాడు. యశోవర్మ తిరిగి కావలసినంత భోజనం చేసినాడు. అర్థవర్మ ఏమో అందులో ఒక పలం పాలను మాత్రమే త్రాగినాడు. అక్కడే ఒకప్రక్కన వారిద్దరూ పడకలు పరుచుకొని పడుకొన్నారు. యశోవర్మ అర్థవర్మలు మెల్లగా నిద్రించినారు.

ఆ రాత్రి యశోవర్మ కలలో ఎవరో దండహస్తులైన, భయంకరులైన పురుషులు వచ్చినట్టు స్పష్టంగా కనబడినది. నీవు నేతి నెందుకు ఎక్కువ త్రాగినావని, మాంసాహారం తీసుకొన్నావని, పాలు త్రాగినావని క్రోధంతో పలుకుతూ వారు అర్ధవర్మను కర్రలతోనూ, కాళ్ళతోనూ తన్నినారు.

ఆ ఎక్కువగా భుజించిన దాని నంతటినీ, అతని కడుపు నుండి బయటకు లాగేవేసినారు.

అంతలో మేల్కొని యశోవర్మ చూడగా ప్రక్కనేఉన్న అర్థవర్మకూడా మేల్కొని కడుపునొప్పితో బాధపడుతున్నాడు.

అందుతో విలపిస్తూ పరిజనులు కడుపును పిసుకుతుండగా తాను అధికంగా తిన్న ఆహారాన్ని వమనం చేసుకొన్నాడు. అప్పుడాతని కడుపునొప్పి తగ్గగా యశోవర్మ ఈ విధంగా ఆలోచించుకొన్నాడు: "ఛీ ఛీ ఈ అర్థశ్రీతో లాభమేమిటి? అతని సంపద అనుభవం ఈ విధంగా నున్నది. ఈ విధంగా ధనానుభవం ఖలీకృతమైనది" అని విచారిస్తూ ఆ రాత్రిని అక్కడే గడిపివేసినాడు.

ఉదయం అర్థవర్మనుంచి సెలవు తీసుకొని అక్కడినుంచి బయలుదేరి యశోవర్మ భోగవర్మ అనే వర్తకుని ఇంటికి వెళ్ళినాడు.

అక్కడకూడా వెళ్ళగానే ఆదరంతో అతిథిసత్కారం చేసి ఆ వర్తకుడు అతనిని భోజనానికి పిలిచినాడు. అక్కడ గొప్పగా ధనసంపత్తి ఉన్నట్టు అతనికి కానరాలేదు. కానీ చక్కటి ఇల్లు, బట్టలు, ఆభరణాలు కన్పించినవి.

అక్కడ ఉండగా యశోవర్మ చూస్తుండగానే భోగవర్మ తన వర్తక వ్యవహారం కొనసాగించినాడు. ఒకరెవరో ధనం కొనిరాగా దానిని మరొకరికి ఇచ్చివేసినాడు. తన ధనం లేకనే ఆ లావాదేవీలో కొన్ని దీనారాలను సంపాదించుకొన్నాడు. వెంటనే వానిని తన భృత్యుని చేతికి ఇచ్చినాడు. విచిత్రాన్నపానసంపాదనార్థమై దానిని వినియోగించాలని తన భార్యకిమ్మని చెప్పినాడు.

ఒక క్షణంలో ఒక స్నేహితుడు ఇచ్ఛాభరణ నామకుడు వచ్చి గబగబా భోగవర్మతో ఇట్లన్నాడు: "భోజనం సిద్ధమైనది. మనం కలిసి భోంచేద్దాము లేవండి. మరి కొందరు మిత్రులు

కూడా కలిసినాము. మేమంతా మీ కోసమై ఎదురుచూస్తు న్నాము."

అప్పుడా భోగవర్మ "నేనీరోజు రాలేను. నా కొక అతిథి వచ్చి ఉన్నాడు" అని చెప్పగా తిరిగి ఆ స్నేహితుడిట్లా అన్నాడు: "అతనిని గూడా పిలుచుకొని పోదాం. ఆయన మాత్రం మనకు మిత్రుడు కాదా! త్వరగా బయలుదేరు" అని బలవంత పెట్టి ఆ మిత్రుడు భోగవర్మను బయలుదేర దీసినాడు.

అతను యశోవర్మను కూడా పిలుచుకొని వెళ్ళి అక్కడ అత్యుత్తమమైన ఆహారాన్ని భుజించినారు. పానగోష్ఠి కూడా జరిపి సాయంకాలం ఇంటికివచ్చి తిరిగీ యశోవర్మతో పాటూ విచిత్ర మైన పానభోజనాదులను తన ఇంట నిర్వర్తించినాడు.

చీకటిపడగా తన పరిజనుల నిట్లా అడిగినాడు: "అర్ధ రాత్రికి తగినంత మనకు కావలసిన పదార్థాలున్నాయా?" ఆ మాటకతను—"స్వామీ! ఇంక మిగిలిన వేమీ లేవు" అని చెప్పి నాడు. అంతట అతడు శయనించ నుద్యమించి "అపర రాత్రిలో నీరు మాత్రం త్రాగి ఎలా ఉంటాము?" అన్నాడు.

యశోవర్మకోసమై అతని ప్రక్కనే పడుకొని ఉన్న అత నికి, రాత్రి కలలో ఇద్దరు ముగ్గురు పురుషులు ఇంటిలో ప్రవే శించడం, వారివెంట మరి కొంద రుండడం కన్పించింది.

"భోగవర్మకు అపర రాత్రికి అవసరమైన ఏర్పాటు ఎందుకు చేయలేదు? మీరా సంగతినే ఆలోచించకుండా ఎక్క డున్నారు?" అని వారి వెనుకవచ్చిన పురుషులు తొలుత వచ్చిన వారిని క్రోధంతో కర్రలతో కొట్టినారు. "ఈ తప్పు ఒకటి మన్ని

చండి" అని చెప్తూ దండ ధరులైన పురుషులు బయటికి వెళ్ళి పోయినారు.

అదిచూచి మేల్కొంచిన యశోవర్మ ఇట్లా తలపోసుకొన్నాడు: "తలవని తలంపుగా ఈ భోగవర్మకు భోగశ్రీ లభిస్తున్నది. ఇదెంతైనా శ్లాఘ్యమైనది. అర్థవర్మకున్న సంపద సమృద్ధమైనా భోగరహితమైనది." ఇట్లా అత ననుకుంటుండగానే తెల్లవారింది.

యశోవర్మ ఆ వర్తకునితో సెలవు తీసుకొని తిరిగి వింధ్యవాసినీ పాదమూలాన్ని చేరుకొన్నాడు. తపోనిమగ్నుడై స్వప్నంలో కనబడిన ఆ దేవతను తనకు అర్థశ్రీ కంటే భోగశ్రీయే కావలెనని వరం కోరి సంపాదించు కున్నాడు.

అక్కడి నుంచి బయలుదేరి యశోవర్మ దేవీ ప్రసాద పాత్రుడై ఇల్లు చేరుకొని అచింతితంగా వచ్చిన ధనంతో హాయిగా ఉన్నాడు.

—ఈ విధంగా భోగార్హమైన సంపద కొద్ది పాటి ఉన్నా శ్రేష్ఠం. అనంతంగా ఉన్నా భోగరహితమైన సంపద వ్యర్థం. కావున చమరవాలుని కార్పణ్య సంపదతో పని ఏమి?

దాన భోగాలతో సుఖించకుండా, తన సంపదను చూచు కొనకుండా ఉన్నాడెందుకు? కాబట్టి వానికై భద్రకుని పంపడ మెందుకు? యాత్రాలగ్నం కూడా లేదు. జయ చిహ్నాలు కూడా లేవు." అని జ్యోతిష్కుడు చెప్పినా వినక ఆ రాజులు చమరవాల రాజును సహింపలేక వెళ్ళిపోయినారు.

వారంతా పొలిమేరలో విడిసినారని తెలుసుకొని రాజు చమరవాలుడు సమరార్థమై బయలుదేరదలచి ముందు స్నానం చేసి హరుని పూజించుకొన్నాడు.

అష్టషష్ట్యుత్తమ స్థాన నియతాలైన శుభనామాలతో ఆయ నను కీర్తించినాడు. అన్ని కోర్కెల నీడేర్చునని పాపఘ్నము లయినవి అయిన మాటలతో ఈశ్వరుని స్తుతిస్తుండగా ఆకాశవాణి ఇలా వినవచ్చినది: "ఓ రాజా! నీవు నిశ్శంకంగా యుద్ధానికి వెళ్ళు. పోరులో శత్రువులను జయిస్తావు."

అందుతో సంతోషించి సన్నద్ధుడై నిజసేనా సమేతుడై చమరవాలరాజు యుద్ధానికి బయలుదేరినాడు. ముప్పైవేల ఏనుగులు, మూడులక్షల గుఱ్ఱాలు, కోటి పదాతులు అతని శత్రు బలంలో ఉన్నవి. తన బలంలో ఇరవై లక్షల పదాతులు, పది వేల ఏనుగులు, లక్ష గుఱ్ఱాలూ కలవు.

ఆ ఉభయసేనల మధ్య మహాయుద్ధం ప్రారంభమైనది. వీరుడనే సార్థకనామం కల ప్రతీహారుడు మొదట నడుస్తుండగా చమరవాలుడు స్వయంగా ఆ సమర భూమి లోనికి భగవాన్ మహా వరాహుడు మహాసముద్రం లోనికి ప్రవేశించినట్లు ప్రవే శించినాడు.

తన సైన్యం అల్పము. పరసైన్యం అధికము అయినప్ప టికీ అతను దాడిచేసి అశ్వగజవాజి పదాతులను రాసులుగా పోసి నాడు. ముందు కురికివస్తున్న సమరబలుని చూచి శక్తితో కొట్టి పాశంతో లాగి కట్టివేసినాడు.

ఆ తర్వాత సమరశూరుని గుండెలపై బాణాలువేసి రెండవ వానిని కూడా మొదటివానిలాగే పాశంతోలాగి కట్టివేసినాడు. మూడవవాడైన సమరపతి అనే మహీపతిని, వీరాఖ్యుడైన అతని ప్రతీహారుడు బంధించుకొని అతని వద్దకు కొనివచ్చినాడు. అలాగే నాల్గవవాడైన ప్రతాపచంద్రుని బాణహతుని చేసి, తన సేనా పతి దేవబలుడు కొనివచ్చి సమర్పించినాడు.

ఇదంతా చూచి ఐదవవాడైన ప్రతాపసేనరాజు క్రోధంతో చమరవాలుని ఎదుర్కొన్నాడు. అతను ఆ బాణాలను తన శర పరంపరతో ఎగురగొట్టి మూడు బాణాలతో అతని లలాటాన్ని పగులగొట్టినాడు. గొంతుకు పాశంవేసి యమధర్మరాజు లాగి నట్టుగా లాగి శరాఘాతవిఘూర్ణితుడైన వానిని స్వాయత్తం చేసు కొన్నాడు.

ఈ విధంగా క్రమంగా ఆ ఐదుగురు భూపతులూ పట్టు వడగా హతశేషులైన వారిసైన్యాలు దిక్కులుపట్టి పారిపోయినవి. అమితమైన హేమరత్నాదులను అనేక అవరోధజనాన్ని చమర వాలరాజు వారినుంచి అపహరించుకొన్నాడు. వారి మధ్యలో మహాదేవి యశోలేఖ అనే విశ్రుతురాలైన ప్రతాపసేనుని రాణి అతనికి లభించినది.

ఆ తర్వాత వీరదేవబలులను తన సేనాపతులకు పట్టంకట్టి అనేక రత్నాలతో సత్కరించినాడు.

ప్రతాపసేనపట్టమహిషి అయిన యశోలేఖను క్షత్రధర్మా ర్జితురాలు గనుక తన అవరోధ జనంతో కలుపుకొన్నాడు. ఆమె కూడా భుజార్జితురాలను గనుక ఈయనను సహించవలసినదే అని అంగీకరించినది. కామమోహ ప్రవృత్తులైనవారి ధర్మవాసన విచి త్రంగా ఉంటుంది గదా!

కొన్నిదినములు జరిగిన తర్వాత రాణి యశోలేఖ ప్రార్థిం చగా రాజు చమరవాలుడు బందీలుగా ఉన్న ఆ ఐదుగురు ప్రతాపసేన ప్రభృతులను భూపతులను విడిచిపుచ్చినాడు. అంత వారు వినతులుకాగా వారిని సత్కరించి వారి రాజ్యాలు వారికే అప్పగించినాడు.

ఆ విధంగా నిష్కంటకము, విజిత విరోధిరాజమండలమూ అయిన తన రాజ్యాన్ని చమరవాల పృథ్వీపతి సమృద్ధంగా చిర కాలం పరిపాలించినాడు.

అలాగే అప్సరసలకంటే అధికరూప లావణ్యవతి అయిన యశోలేఖతో, శత్రుజయ పతాకవంటి దానితో సుఖ మనుభవించి నాడు.

ఈ విధంగా శత్రువులు అనేకులు ఉన్నప్పటికీ, వారు హఠాత్తుగా పైనవచ్చి పడినప్పటికీ, స్వపర స్వరూపజ్ఞానం లేక ద్వేషాకులమైనప్పటికీ, వారందరినీ ధీరుడైన ఒకేరాజు అనన్య సామాన్యమైన పౌరుషంతో జయించి, వారి దర్పజ్వరాన్ని యుద్ధభూమిలో అణచివేయగలడు.''

ఈ విధంగా గోముఖుడు చెప్పిన కథను విని, మెచ్చుకొని నరవాహనదత్తుడు గోష్ఠి చాలించి దినకృత్యాలకై వెళ్ళిపోయి నాడు.

ఆ రాత్రి సంగీతరసంతో ఆడుతూ, పాడుతూ తన అంగనా జనంతో, నభస్థ్సితురాలైన సరస్వతి ఆ ప్రియురాండ్రతో చిర కాలం సుఖించగలవని వరమిచ్చినట్టుగా ఆ రాత్రిని గడిపివేసి నాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో అలంకారవతీలంబకంలో
చతుర్థ తరంగం.

# పంచమ తరంగం

## మరుభూతి కథ

పిదప మరునాడు నరవాహనదత్తుడు అలంకారవతీ గృహంలో సర్వమంత్రులతో సమావిష్టుడై ఉండగా మరుభూతి సేవకుడు వచ్చినాడు. అతను సవ్విదల్లుడనే అంతఃపుర రక్షకుని సోదరుడు. అతనిట్లా విన్నవించుకున్నాడు:

"దేవా! మరుభూతివద్ద నేను రెండేళ్ళు కొలువు చేసినాను. భార్యతోపాటూ ఉన్ననాకు అన్నవస్త్రాదులాయన ఇచ్చినాడు. ఇవి కాక మొదట మాటలాడుకున్న ప్రకారం ఏటా యాభై దీనారాలను ఇస్తాననిచెప్పి ఒప్పుకున్నాడు. ఇప్పుడు నేను వాటికోసం అడుగగా ఆయన ఇవ్వడం లేదు. అడిగినానని కాలితో తన్నినాడు. అందువల్ల నేను మీ సింహద్వారంవద్ద కూర్చుంటున్నాను. తాము విచారించి ఏదైనా చేస్తేతప్ప ఇకనాకు అగ్నిప్రవేశమే శరణ్యం. అంతకంటే నేనేమి చెప్పుకోగలను?" అని అతను చెప్పి విరమించగా మరుభూతి ఇట్లన్నాడు:

"దేవా! నేను ఇతనికి దీనారాలను ఇవ్వవలసిన మాట నిజమే. కానీ ప్రస్తుతం అంత మొత్తం నావద్ద లేదు."

ఈ మాటవిని అక్కడున్న వారందరూ నవ్వినారు. అప్పుడు నరవాహనదత్తుడు మంత్రి మరుభూతితో ఇట్లన్నాడు: "ఏమిటి మూర్ఖత్వం? ఇంతకంటే నీకు బుద్ధి లేదా? వెంటనే వెళ్ళి అతనికి దీనారశతం ఇవ్వు."

ఈ ప్రభువు వచనం విని మరుభూతి సిగ్గుపడి అప్పుడే వెళ్ళి నూరుదీనారాలను తెచ్చి వానికి ఇచ్చివేసినాడు.

ఆ తర్వాత గోముఖుడు ఇట్లా అన్నాడు: "ఈ విషయంలో మరుభూతిని ఏమీ అనలేము. ప్రజాపతి సృష్టిలో చిత్రవిచిత్ర చిత్తప్రవృత్తు లున్నవి. ఈ విషయంలో చిరదాతుడనే రాజు, ప్రసంగుడనే ఆయన సేవకుని కథ సరిపడుతుంది. దానిని మీరు వినలేదా ?

## చిరదాత ప్రసంగుల కథ

పూర్వం చిరపురేశ్వరుడు చిరదాతుడు అనే రాజు కలడు. అతను మంచివాడైనప్పటికీ అతని పరివారమంతా దుర్జనమయమైనది. దేశాంతరంనుంచి వచ్చిన ప్రసంగుడనే ఒకడు తన ఇద్దరు మిత్రులతోపాటూ ఆయన కొలువులో చేరినాడు. వారు ఐదేళ్ళపాటు ఆ రాజునకు సేవచేస్తూ వచ్చినారు. ఏవో ఉత్సవాల సందర్భంలోకూడా ఆ రాజు వారికి ఏమీ ఇచ్చినవాడు కాదు. ఆ ప్రసంగున కేమో ప్రభువునకు విన్నవించుకొనే అవకాశం కూడా చిక్కలేదు. తన స్నేహితు లేమో అడగమని సదా ప్రేరేపిస్తున్నారు. కాని రాజపరివారం దుర్మార్గంవల్లనే అవకాశం చిక్కడం లేదు.

ఒకసారి ఆ రాజునకు పుత్రశోకం కలిగింది. దుఃఖితుడైన ఆ రాజు చుట్టూ భృత్యులు గుమిగూడి ఉన్నారు. వారి మధ్యలో ప్రసంగుడు కూడా ఉన్నాడు. అతను శోకిస్తున్నప్పటికీ, స్నేహితులు వారిస్తున్నప్పటికీ రాజునకు ఇట్లా మనవి చేసుకొన్నాడు:

"దేవా! బహుకాలంగా మేము మీకు సేవకులుగాఉన్నాము. అయినప్పటికీ మీరు మాకు ఏ కించిత్తూ ఇవ్వలేదు. అయినా మీ

కుమారునిమీది ఆశతో మిమ్ము సేవించుకుంటూ ఉంటిమి. మీ రేమీ ఇవ్వకపోయినా మీ కుమారుడైనా ఇస్తాడేమో ననే ఆశతో ఉంటిమి. దైవం ఆయననుకూడా కొనిపోయినాడు. ఇక ఇప్పుడు మా కిక్కడ ఆశ ఏమున్నది? మే మిక వెళ్ళిపోతాము.'' అని ఏదేదో సణుగుతూ ఆయన పాదాలమీద పడిలేచి తన ఇద్దరు స్నేహితులతో పాటూ బయటకు వచ్చినాడు.

"అయ్యో! నా పుత్రునిమీద కూడా వీరికి అనుబంధం ఉన్నదే. ఇలాంటి మంచి సేవకులను వదలుకోవడం సరికాదు'' అని రాజు తలపోసుకొని వెంటనే తిరిగీ ఆ ప్రసంగాదులను రప్పించి కావలసినంత ధనమిచ్చి ఇక వారికి పేదరికమనేది వచ్చే అవకాశం లేకుండా వారి కోరికను తీర్చినాడు."

— ఓ దేవా! ఈ విధంగా మనుష్య స్వభావాలు చిత్ర విచిత్రంగా ఉంటాయి. సకాలంలో ఇవ్వని ఆ రాజు అకాలంలో ఇచ్చినాడు'' అని చెప్పి కథలు చెప్పడంలో ప్రవీణుడైన గోముఖుడు వత్సేశ్వరసుతుని ఆదేశంపై మరొక కథనుకూడా ఇట్లా చెప్పుకొని వచ్చినాడు.

### కనకవర్షుని కథ

"పూర్వం గంగాతీరంలో కనకపురం అనే పేరుగల నగరోత్తమం కలదు. ఆ గంగాజలం అక్కడి పౌరులనందరినీ పవిత్రులను చేస్తూ ఉంటుంది. స్వర్గరాజ్యంవలె అది రమణీయమైనది.

అక్కడ బంధమనేది ఇతరత్రా కనబడదు. ఒక కవుల వాక్కులలోనే (బంధకవిత్వం) వినవస్తుంది. అక్కడ ఆకులను మాత్రమే ఛేదిస్తారు కానీ మరొకచోట ఛేదనం కనబడదు. స్త్రీల

ముంగురులలో మాత్రమే వక్రత కానవస్తుంది కానీ జనప్రవర్తనలో కనబడదు. ఖలత్వం అన్నది ఒక సస్య సంగ్రహణలోనే తప్ప జనంలో లేదు. (ఖలం=కళ్ళం-దుర్జనత్వం అని శ్లేష)

అక్కడ వాసుకి నాగేంద్రతనయుడైన ప్రియదర్శనునికి యశోధర అనే రాజపుత్రికి కలిగిన రాజు మహాయశస్వి అయిన కనకవర్షుడు అనే రాజు కలడు. సర్వభూభారాన్ని వహిస్తున్నప్పటికీ అతను అశేషగుణభూషితుడు. (భూభారం వహించేవాడు శేషుడన్నది ప్రసిద్ధం. ఇతడు శేషునివంటివాడైనా అ-శేషగుణభూషితుడనడంలో శ్లేష)

అతనికి లుబ్ధత్వం యశస్సుపైనే కాని అర్థంపై కాదు. అతను పాపభీతి కలవాడే కాని శత్రుభీతి కలవాడు కాదు. పరాపవాదాల విషయంలో మూర్ఖుడే కాని శాస్త్రవిషయంలో కాదు. అతనికి కోపంలోనే అల్పత్వం. అనుగ్రహంలో మహాత్ముడతను. అతని పిడికిలి బిగింపు ధనుస్సును పట్టుకున్నప్పుడే, దానం విషయంలో కాదు. అఖిల జగత్తునూ రక్షిస్తూ అద్భుతరూపుడైన అతను దృష్టిమాత్రంతో అబలాజనాన్ని మాత్రం మారవ్యథాకులం చేస్తుంటాడు.

ఒకసారి శరత్కాలం వచ్చినది. వేడి ఎక్కినది. వారణములు మదించినవి. రాజహంసలు గుంపులు కట్టినవి. ప్రజలు ఆనందంతో ఉత్సవం చేసుకొంటున్నారు. అప్పుడా రాజు నిజతుల్యగుణమైన ఆ శరత్కాలంలో వినోదార్థమై చిత్రప్రాసాదంలోనికి ప్రవేశించినాడు.

కమల పరిమళాలతో ఆకృష్టమై శీతలమారుతం వీవ దొడగినది. అక్కడ నిలిచి ఒక చిత్రాన్ని ప్రశంసిస్తుండగా అంతలోనే ప్రతీహారుడువచ్చి రాజునకిట్లా విన్నపం చేసుకొన్నాడు:

"విదర్భదేశం నుంచి అపూర్వ చిత్రకారు డొకడు వచ్చి ఉన్నాడు. చిత్రీకరణంలో తనసాటి ఇంకెవరూ లేరని అతను చెప్పుకొంటున్నాడు. అతని పేరు రోలదేవుడు. సింహద్వారం వద్ద ఉన్నాడు. అతని సంగతంతా ఒక వస్త్రంపై లిఖించి, వ్రేల దీసుకొని వస్తున్నాడు.''

ఈ మాటలు విని రాజు ఆదరంతో లోనికి ప్రవేశపెట్టమన్నాడు. వెంటనే ప్రతీహారుడు వెళ్ళి క్షణంలో చిత్రకారుని పిలుచుకొని వచ్చినాడు.

అతను లోనికి ప్రవేశించినాడు. చిత్రాలోకన విలాసంతో అక్కడ ఉన్న రాజు కనకవర్షుని చిత్రకారుడు ఏకాంతంగా చూచినాడు. వరనారీ స్తన సంగమానికై తనువు నప్పగించినవాడు, విలాసంగా చేతిలో తాంబూలవీటికను పట్టుకొన్నవాడు అయిన ఆ రాజును చూచి నమస్కరించినాడు. అతను ఆదరంతో తన ప్రక్కపై కూర్చుండబెట్టుకొన్నాడు.

అప్పుడు చిత్రకారుడైన రోలదేవుడు మెల్లగా విన్నపం చేసుకొన్నాడు. "దేవా! నేను నా సంగతిని వ్రాసి ఈ పట్టాన్ని వ్రేలదీయడం కేవలం మీ పాదాబ్జదర్శనం కోసమే. అంతే కానీ విజ్ఞానమదంతో కాదు. దీనిని మీరు మన్నించవలెను. మీ రిప్పుడు చిత్రపటంలో దేనిని లిఖించమంటారో చెప్పండి. అప్పుడు నా చిత్రకళాశిక్ష సఫలమౌతుంది'' అని చిత్రకారుడు చెప్పగా ఆ రాజు ఇలా అన్నాడు.

"ఉపాధ్యాయా! నీకు తోచినదానిని చిత్రించు. మాకు నేత్రపర్వం చెయ్యి. అంతేకానీ నీ కౌశల విషయంలో వివాద మేమున్నది?'' అని రాజు చెప్పగా అతని ప్రక్కనున్నవారు "ఎవ

రినో చిత్రించడంవల్ల ప్రయోజన మేమిటి? నీ వీ రాజుగారినే చిత్రించు'' అని అన్నారు.

ఆ మాటవిని చిత్రకారుడు సంతుష్టుడై ఆ రాజునే చిత్ర పటంపై గీసినాడు. ఎత్తైన వెదురువంటి నాసిక, దీర్ఘరక్తము లైన కనులు, విశాలమైన లలాటం, కుంచితాలై నల్లనైన కుంత లాలు, విస్తీర్ణమైన వక్షస్స్థలం, దానిపై బాణాదులు ఒరసికొనగా ఏర్పడిన వ్రణచిహ్నాలు. దిగ్గజాల తుండాలవలె మనోహరాలైన భుజాలు ఆ చిత్రంలో కన్నులపండువు చేస్తున్నవి.

తన పరాక్రమంతో ఓడిపోయి సింహకిశోరాలు కానుకలిచ్చి నవా అన్నట్టు పిడికిలిలో ఒదిగిపోగల నడుము. యౌవనగజాలకు ఆలానప్రాయమైన ఊరుయుగ్మం. అశోకపల్లవనిభమై మనో హరమైన చరణయుగళము. చూడగానే సరిగా రాజు రూపంతో పోలిన రూపాన్ని అలాగే ఆ చిత్రకారుడు చిత్రింపగా సర్వులూ 'భళా' అని పొగడినారు.

"రాజుగారిని ఒంటరిగా ఈ చిత్రభిత్తిపై చూడడం మా కిష్టంలేదు. ఇక్కడ ఎన్నో చిత్రపటాలు అలిఖితాలై ఉన్నవి. ఆ రాణులలో ఈయన రూపానికి అనురూపమైన ఒక దేవేరిని బాగా ఆలోచించి ఈయన ప్రక్కన లిఖించు. అలా మాకు సంపూర్ణ నేత్రోత్సవం కలిగించు."

ఆ మాటవిని ఆ చిత్రకారుడు అక్కడున్న చిత్రాలను చూచి ''ఇందరు రాణుల చిత్రాలిక్కడ ఉన్నా ఒక్కరుకూడా రాజునకు తుల్యురాలు లేదు. ఈ పృథ్విలో ఈయనకు అనురూపవతి అయిన అంగన ఎక్కడా లేదని నాకు తెలుసు. అయితే ఒకానొక రాజపుత్రి మాత్రం కలదు. ఆమెను గురించి చెప్తాను వినండి—

"విదర్భదేశంలో కుండిన మనే నగరం ఒకటి కలదు. అక్కడ దేవశక్తి అను పేరుగల మహీపాలుడు కలడు. ఆయనకు ప్రాణాధిక ప్రియురాలు మహారాణి అనంతవతి. వారికి కలిగిన కుమార్తె మదనసుందరి.

ఆమె రూపాన్ని వర్ణించడానికి ఈ ఒక్క నాలుకతో సాధ్యం కాదు. నాలాంటి వాడికి అసలే చేతకాదు. అయితే ఇంతవరకు నేను చెప్పగలను. విధాత ఆమెను నిర్మించి ఆ ప్రోత్సాహంతో మరొకరిని నిర్మించ దలచుకున్నప్పటికీ యుగయుగాంతరాలు దాటినా అలాంటి రూపవతిని మరొకరిని నిర్మించడ మెలాగో తెలియక ఆయన గిజగిజలాడుతున్నాడు.

ఈ భూమిలో ఆ రాజకన్యక ఒక్కతే ఈ రాజునకు సరి పోలునది. రూపలావణ్యాలతోను, వయస్సుతోను, వినయంతోను కులంతోనూ అన్నివిధాలా ఈయనకు ఆమె సమానురాలు.

నే నొకప్పుడు పట్నం పోతిని. ఆమె తన చెలికత్తెను పంపి పిలిపింపగా ఆ రాజపుత్రి అంతఃపురానికి నేను వెళ్ళాను.

అక్కడ ఆమెను దర్శించుకొంటిని. అప్పుడప్పుడే పూసు కొన్న చందనంతో మృణాల హారాలను ధరించి, తామర ఆకుల సెజ్జపై పడుకొని పొరలుతున్న దామె. సఖీజనులు అరటాకులతో వీచుతున్నారు. ఆమె బాగా పాలిపోయి ఉన్నది. ఆమె మదన జ్వరంతో బాధపడుతున్న లక్షణాలు స్పష్టంగా కన్పిస్తున్నవి.

"ఓ సఖులారా! ఈ చందనం పూతలతో ఈ అరిటాకుల వీవనలతో మీ రెంత ప్రయత్నించినా లాభం లేదు. ఈ విఫల ప్రయత్నంతో ప్రయోజన మేమిటి? మందభాగ్యురాలైన నన్ను

శిశిరాలు కూడా కాల్చివేస్తున్నవి" అని ఆమె వారిని వారిస్తున్నది. అయినా వారందరూ ఆమెను ఓదార్చుటకై ప్రయత్నిస్తున్నారు.

ఇదంతా చూస్తూ ఏమిటా అని ఆలోచిస్తూ నమస్కరించి ఆమె ముందు నేను కూర్చున్నాను. "ఓ ఉపాధ్యాయా! నేను గీస్తున్న ఈ రూపాన్ని పూర్తిగా చిత్రంగా లిఖించు" అని చెప్తూ వణకుతున్న చేతితో గట్టిగా ఒకవర్తిని పట్టుకొని మెలమెల్లగా ఆమె గీసిచూపినది.

ఒక రూపవత్తరుడైన యువకుని గీసినది. నేనా రూపాన్ని అతి సుందరంగా చిత్రించి ఇలా తలపోసుకొన్నాను: "ఈమె సాక్షాత్తూ కామునే చిత్రించినది. అయితే పుష్పచాపం మాత్రం చేతిలో లేదు. కాబట్టి ఇతను మన్మథుడు కాదన్నది నిజం. అంత రూపవంతుడైన మరొక యువకు డితను.

ఇతని నీమె ఎక్కడో తప్పక చూచి ఉండాలి, లేదా అతనిని గూర్చి విని ఉండాలి. అందువల్లనే ఈమె స్మరజ్వరంతో బాధ పడుతున్నట్టున్నది. కాబట్టి నేనిక్కడినుండి త్వరగా వెళ్ళిపోవాలి. మరి ఈ రాజేమో దండించుటలో అత్యుగ్రుడు. ఈమె తండ్రి అయిన ఆ రాజు దేవశక్తి దీనినంతా చూస్తే నన్ను క్షమింపడు' అని ఆలోచిస్తూనే మదనసుందరికి నమస్కరించి ఆమెతో సమ్మానితుడనై ఆ రాజకన్యతో సెలవు తీసుకొని వచ్చివేసినాను.

నేనేమో, మహారాజా! ఆమె పరిజనులు పరస్పరం సంభాషించుకుంటుండగా ఒకమాట విన్నాను. ఆ రాచకన్నె మిమ్ములను గూర్చి విన్నదని వారనుకొంటున్నారు. కాబట్టి ఆమె చిత్రపటాన్ని రహస్యంగా చిత్రించుకొని వెంటనే తమ పాదసన్నిధికి గబగబా కొనివచ్చినాను.

ఇక్కడ మీ రూపాన్ని చూచిన తర్వాత నా సందేహం నివృత్తి అయినది. నాచేత ఆమె లిఖింపజేసిన చిత్రం మీదే. ఆమెతో సమానమైన చిత్రం చిత్రించే శక్తి నాకు లేదని తమ చిత్ర పార్శ్వంలో ఆమెతో సమానురాలిని చిత్రించలేనని వదలి వేస్తున్నాను."

ఈ విధంగా చెప్పిన రోలదేవునితో రాజు ఇట్లన్నాడు. "అయితే నీ వింతకుముందు చిత్రించిన ఆమె చిత్తరువునైనా చూపించు." ఆ మాటవిని చిత్రకారుడు తన వల్గులిక (చిత్రాది సంచయాన్ని వేసుకొనే ఒక గోళాకార పాత్ర) నుండి ఆ పటాన్ని తీసి మదనసుందరీ పటాన్ని రాజునకు చూపించినాడు. రాజు కనకవర్షుడుకూడా కేవలం చిత్రపట రూపంలోనే ఉన్నా ఆమె అద్భుతలావణ్యాన్ని చూచి వెంటనే మన్మథవశుడైనాడు. చిత్ర కారునికి అతను కావలసినంత ధనాన్నిచ్చి ఆ ప్రియురాలి చిత్ర పటాన్ని తీసుకొని అంతఃపురంలోనికి వెళ్ళిపోయినాడు.

అక్కడ ఆమె రూపలావణ్యాలను ఎంతచూచినా సంతృప్తి చెందని నేత్రాలతో అన్ని పనులను వదలివేసి ఆమెతోనే నిండి పోయిన మనసుతో రాజు ఉండిపోయినాడు.

మన్మథుడు తన రూపంతో పోటీ పడుతున్నాడని ఈర్ష్య చెందినట్లు అతని ధైర్యాన్ని హరిస్తూ తన శరాలతో అతని అంత రాన్ని ఛేదించినాడు.

ఆ రాజు తన రూపాన్ని చూచి ఆశపడిన అనేక స్త్రీలను మన్మథాగ్నిపాలు చేసినవాడు. ఆ ఫలితం నూరుకొమ్మలతో విస్త రించినట్లు తానిపుడు బాధ ననుభవిస్తున్నాడు.

ఆ విధంగా దినములు గడచినకొద్దీ విరహంతో కృశించి తెల్లవడి పోయిన ఆ రాజును ఆప్తులైన మంత్రులు ఎందు కిలా అవుతున్నారని ప్రశ్నింపగా తన మనోగతాన్ని వెల్లడించినాడు.

తర్వాత ఆ మంత్రులతో సంప్రతించి మదనసుందరీ కన్యను అర్థించుటకై ఆ దేవశక్తి రాజువద్దకు ఒక దూతను పంపించినాడు.

ఆ దూతపేరు సంగమస్వామి. అతడు కాలజ్ఞుడు. కార్య వేది. విప్రుడు. ఆప్తుడు. కులీనుడు. మధురోదాత్తభాషణుడు.

అతను బయలుదేరి మహార్ఘములైన బహుమాన వస్తువులతో ఆ విదర్భదేశానికి వెళ్ళి కుండిననగరంలో ప్రవేశించినాడు. యథోచితంగా ఆ రాజు దేవశక్తిని సందర్శించుకొన్నాడు. తమ ప్రభువుకోసమై తమ కన్యను ఇవ్వవలసిందిగా ప్రార్థించినాడు.

ఆ రాజు తనలో ఇట్లనుకున్నాడు: "నా కుమార్తెను ఎప్పటికైనా ఒక అయ్యచేతిలో పెట్టవలసిందే. ఈ కనకవర్ష మహారాజు మాతో సమానుడు. కన్యాదానానికి అర్హుడైనవాడు. అతనే అడుగుతున్నాడు. కాబట్టి ఆయనకు నా పుత్రిక నివ్వడమే మంచిది" అని నిశ్చయించుకొన్నాడు. అందువల్ల ఆ సంగమ స్వామి మాటలకు తల ఊచినాడు. అతనికి తన కుమార్తె లావణ్యాన్ని ఆమె అద్భుతమైన నృత్తాన్ని ప్రదర్శింపజేసి చూపెట్టి నాడు.

ఆ తర్వాత తద్దర్శనంతో సంతుష్టుడైన సంగమస్వామికి తను కన్యాదానం చేయగలనని మాట ఇచ్చి సత్కరించి పంపించి నాడు. వివాహార్థమై లగ్నం నిశ్చయించి తరలిరావచ్చునన్న సందేశంతో ప్రతిదూతను పంపించినాడు.

సంగమస్వామి ప్రతిదూతతో పాటు తిరిగివచ్చి కనకవర్ష భూపాలునకు కార్యం సిద్ధించెనని నివేదించుకున్నాడు.

ఆ తర్వాత లగ్నాన్ని నిశ్చయించి ప్రతిదూతను సత్కరించినాడు. ఆ మదనసుందరిని కూడా తనపై అనురక్తురాలినిగా తెలుసుకొన్నాడు. ఆమెను వివాహమాడుటకై దుర్వారవీర్యుడు, నిశ్శంకమానసుడు అయిన రాజు కనకవర్షుడు ఆ కుండిన పట్టణానికి బయలుదేరినాడు.

పొలిమేరలలోనున్న అరణ్యంలో నివసిస్తూ ప్రాణుల ప్రాణాలను హరించే సింహాదులను అక్కడి శబరులను వలె సంహరిస్తూ వెళ్ళినాడు. విదర్భదేశం చేరుకొని కుండిన నగరంలో ప్రవేశించినాడు.

తనకు ముందే బయలుదేరిన దూత దేవశక్తి రాజును కలుసుకున్నాడు. ఆ నగర పురంధ్రుల నయనోత్సవాన్ని కల్పిస్తూ వివాహసంభారాన్ని సజ్జీకరించుకొని రాజమందిరంలోనికి వెళ్ళినాడు.

తన పరివారంతో పాటు ఆ రోజక్కడ విశ్రాంతి తీసుకొన్నాడు. దేవశక్తి నృపాలుడు ఉదారంగా ఉపచరించి అతనిని సంతోషింపజేసినాడు.

మరునాడు దేవశక్తి తన పుత్రిక మదనసుందరిని రాజ్యం తప్ప మిగత సర్వస్వంతో పాటు ఆయనకు ఇచ్చివేసినాడు. అక్కడ ఏడురోజులు ఉండి కనకవర్ష ప్రభువు నవవధువుతోపాటూ తన నగరానికి బయలుదేరినాడు.

కాంతాయుతుడై వెన్నెలతోడి చందమామవలె జగదానంద దాయకుడై ఆ రాజు రావడంతో ఆ పట్టణం గొప్పగా ప్రకాశించినది. ఆనందోత్సవం ప్రపూర్ణమైనది.

తనకు అంతఃపురకాంత లనేకు లున్నప్పటికీ అచ్యుతునకు రుక్మిణివలె రాణి మదనసుందరి ప్రాణాధికురాలైనది. అన్యోన్య వదనాసక్తలోచనులై, అందమైన కనురెప్పలతో మదనబాణాలతో కీలితులైనట్టుగా ఆ దంపతులు ఉండిపోయినారు.

ఒకసారి వికసత్కేసరావళి అయి మానినీ మాన మాతం గాన్ని విదళితం చేస్తూ మధుకేసరి అవతరించినది. తుమ్మెదల బారులనే అల్లెత్రాళ్ళతో వికసించిన చూతవల్లీ ధనుర్లతలతో పుష్ప ధన్వునకు ఆ వసంతుడు కావలసిన సామగ్రిని సంపాదించి పెట్టి నాడు.

సముద్దీపిత కాముములైన ఉపవనాలను పాంథస్త్రీ మనసు లను వలె కంపింపజేస్తూ మలయానిలం వీచినది.

'నదులు ఎండిపోయినా తిరిగి నిండి ప్రవహిస్తాయి. చెట్ల పువ్వులు వాడిపోయినా తిరిగి పుష్పిస్తాయి. చంద్రుని కళలు క్షీణించినా తిరిగి వృద్ధిచెందుతాయి. కానీ మానవుల యౌవనం ఒకసారి వెడిపోతే తిరిగిరాదు. కాబట్టి ప్రణయ కలహాలను మాని దయితాన్వితులై హాయిగా రమించండి' అని మధురాలాపాలతో కోకిలలు చెప్తున్నట్టున్నవి.

ఆ వసంతకాలంలో మధువనంలో విహరించుటకై కనకవర్ష మహారాజు సకలాంతఃపుర జనంతో ప్రవేశించినాడు. అశోకశ్రీని రక్తపరిజనాంబరాలతో దొంగిలిస్తూ, వరాంగనల గీతాలతో కోకిల భ్రమర ధ్వనులను చౌర్యంచేస్తూ దేవి మదనసుందరితో పాటూ ఆ మహారాజు అవరోధజనమెంతో ఉన్నప్పటికీ పుష్పాపచయాదు లతో విహరించినాడు.

అక్కడ చాలసేపు విహరించి స్నానార్థమై గోదావరిలోదిగి అంతఃపుర జనమంతటితో కలిసి జలక్రీడలాడినాడు. ముఖాలతో పద్మాలను, కలువలతో కళ్ళను, పయోధరాలతో చక్రవాకయుగళాలను, నితంబములతో పులినస్థలులను జయించి ఆ నది అంతర్యాన్ని రాజకాంతలు శోభింపజేసినారు.

ఆ నది, తరంగాలతో కోపించి బొమముడివేసినట్టు కానవచ్చినది. ఈ జలవిహారంతో వలువలు జారి అంగభంగిమలు బయటపడుతుండగా విహరిస్తున్న ఆ కాంతలనుచూచి కనకవర్ష రాజు మనసు రమించినది.

ఒక రాణిని హేమకుంభద్వయాన్ని పోలిన కుచయుగ్మంనుంచి వసనం విస్రస్తంకాగా ఆ రాజు చేతులతో నీళ్ళెత్తి చల్లినాడు. అది చూచి ఆమెయెడ మదనసుందరి అసూయచెంది "ఎంతకాలమని ఈ నది నిలా క్షోభపెడతారు?" అని ఉద్వేగంతో అన్నది. వెంటనే నీటిలోనుంచి పైకివచ్చి వేరే బట్టలను వేసుకొని కోపంతో తన చెలికత్తెలకు ప్రియాపరాధాన్ని చెప్తూ తన మందిరానికి వెళ్ళిపోయినది.

ఆ తర్వాత ఆమె ఆశయాన్ని తెలుసుకొన్నవాడై ఆ రాజు జలక్రీడను చాలించి ఆమె ఇంటికి వెళ్ళినాడు.

అక్కడ కోపంతో పంజరాలలోని చిలుకలుకూడా రా వద్దని వారిస్తున్నా అభ్యంతర గృహంలోనికి ప్రవేశించి ప్రణయ కుపిత అయిన దేవిని చూచినాడు.

ఆమె దిగులుగానున్న ముఖాన్ని ఎడమచేతిలో నిడుకొని స్వచ్ఛముక్తాఫలనిభములైన బాష్పబిందువులను వదలుతున్నది.

"విరహం అభిమానాన్ని సహించకపోతే దానిని సుఖా
న్నుంచి కూడా పరివర్జించాలి. విరహం అభిమా
నాన్ని సహించేటట్టుంటే దానినే వదలివేయాలి.
ఈ సంగతిని తెలుసుకొని దీనిలో దేనినో
ఒకదానిని ఆలంబనం చేసుకొని ఉండు.
అటొకకాలు ఇటొకకాలు ఉంచి నిలవా
లంటే నీవు మధ్యలో పడి
పోవడం తథ్యం."

తెల్లటి పలువరుస వెలుగును అపహరిస్తూ అపభ్రంశ ముగ్ధ అయిన మాటలతో ఈ అర్థంవచ్చే ద్విపదీఖండాన్ని బాష్పగద్గద కంఠంతో పఠిస్తూన్నది.

ఆ విధంగా ఉన్న ఆమెను చూడగా కోపంలోకూడా మనో హరంగా కన్పించింది. సిగ్గుపడుతూ బెదురుతూ ఆ రాజు ఆమెను సమీపించినాడు. పరాఙ్ముఖురాలు కాగా ఆమెను ఆలింగనం చేసు కొని ప్రేమపేశలాలైన వచనాలతో, వినయంతో ఆమెను ప్రసన్ను రాలిని చేసుకొనడానికై ప్రయత్నించినాడు.

వక్రోక్తులతో అక్కడి చెలికత్తెలు, సూచింపగా తాను అప రాధినని తన్నుతానే నిందించుకుంటూ ఆమె చరణాలపై పడి నాడు.

ఆ తర్వాత కోపంతో, రాలుతున్న కన్నీటితో తన కంఠాన్ని ఆలింగనం చేసుకొన్న మహీపతిని, రాణి శాంతపరచినది.

ఆ తర్వాత సంతుష్టుడైన ఆ రాజు, అలిగి అనుగ్రహించిన ఆమెతో ఆ రోజెల్లా భోగించి రాత్రి నిద్రపోయినాడు.

నిద్రపోతుండగా ఆయన కొక కలవచ్చినది. అందులో హఠాత్తుగా ఒక వికారస్వరూపురాలు కానవచ్చినది. మెడలోనుంచి ఏకావళిని, తలమీదినుంచి చూడారత్నాన్ని ఆమె అపహరించినది.

ఆ తర్వాత ఆ రాజునకు భేతాళుడు కన్పించినాడు. అతను నానాప్రాణ్యంగ విగ్రహుడుగా ఉన్నాడు. అతను బాహుయుద్ధానికి దిగగా ఆయన నేలపై పడవేసినాడు. చతికిలపడి లేచి పక్షివలె ఆకసంలో ఎగురుతూ ఆ రాజును తీసుకొని భేతాళుడు సముద్రంలో పారవేసినాడు.

అక్కడినుంచి కష్టంమీద బయటపడి కంఠంలోని ఏకావళిని తలమీద చూడామణిని పూర్వంవలెనే ధరించి ఉన్నట్టు గ్రహించినాడు.

ఈ కలగని మేల్కాంచి అతను ఉదయమే వచ్చిన పరిచితుడైన క్షపణకుని ఆ రాజు ఆ స్వప్నఫలాన్ని గురించి అడిగినాడు.

(ఒక శ్లోకపంక్తి మూలంలోనే ఇక్కడ లుప్తమైనది)

"అప్రియమైన దానిని దేనినీ చెప్పకూడదు. కానీ నీవడిగినపుడు చెప్పకపోవడ మెలాగు? నీవు ఏకావళిని చూచినావు. చూడామణి కూడా అపహరింపబడినది. అంటే నీ దేవితో నీకు వియోగం కలుగుతుంది. అలాగే నీ పుత్రునితో కూడా నీకు ఎడబాటు కలుగుతుంది, అయినా ఏకావళి, రత్నం నీకు తిరిగి దొరికినవి. సముద్రంలో పడే పైకి రాగల్గినావు. అంటే ఆ వియోగ దుఃఖం తర్వాత నీకు తిరిగి దేవీ, పుత్ర సమాగమం కలుగగలదు."

అని ఆ క్షపణకుడు చెప్పగా తన్నలోతాను విమర్శించుకొని ఆ రాజు ఇట్లన్నాడు: "నాకింకా కొడుకే పుట్టలేదు. అతను పుట్టిన తర్వాత సంగతి కదా!" ఆ మాటకు క్షపణకుడు, ఒక పౌరాణికుడు వచ్చి చెప్పగా రామాయణ కథ విన్నాను. దశరథ మహారాజు పుత్రార్థమై ఎన్నో క్లేశాల ననుభవించి ఆ భాగ్యం పొందలేదా? దాని కేమిటి?'' అని క్షపణకుడు వెళ్ళిపోయినాడు.

ఆ క్షపణకుడిలా చెప్పి వెళ్ళిపోగా కొడుకు కలుగలేదే అన్న దిగులుతో ఆ రోజెల్లా ఆ రాజు గడిపినాడు.

ఆ రాత్రి నిద్రపట్టక ఏకాకిగా పడుకొనిఉన్న రాజు తలుపు మూసి ఉన్నప్పటికీ లోపలికి ఒకస్త్రీ ప్రవేశించడం చూచినాడు.

వినీతురాలు, సౌమ్యాకారం గలది అయిన ఆమెను చూచి ఆశ్చర్యంతో లేచినాడు. ఆమెకు నమస్కరింపగా ఆమె ఆశీర్వదించి ఆ రాజుతో ఇట్లన్నది:

"కుమారా! నేను నాగరాజైన వాసుకి కుమారికను. మీ తండ్రికి జ్యేష్ఠ భగినిని. నా పేరు రత్నప్రభ. రక్షణార్థమై నీ అంతికంలో అదృశ్యరాలనయ్యే నివసిస్తున్నాను. ఈ రోజు నీవు చాల దిగులుపడుతున్నట్టు కన్పించడంవల్ల నీకు ప్రత్యక్షమైనాను. నీ బాధను నేను చూడలేను. దానికి కారణమేమిటో చెప్పు" అని తన మేనత్త అడుగగా ఆ రాజిట్లా అన్నాడు:

అమ్మా! నేను ధన్యుడను. నీవు నా ఎడల ప్రసన్నురాలవు కావలసింది. నా చింత ఎల్లా నాకు పుత్రోత్పత్తి కోసమే అయినప్పటికీ పూర్వం రాజర్షులైన దశరథాదులు స్వర్గార్థం కోరికలతో బాధపడినారంటే నావంటివారికి కోరిక లుండవా?" ఈ కనకవర్ష

మహారాజు మాటవిని నాగిరత్నప్రభ తన సోదర పుత్రునితో ఇట్లన్నది :

"కుమారా! అలా అయితే ఒక ఉపాయం చెప్తాను విను. అలా చెయ్యి. కుమారస్వామివద్దకు వెళ్ళి సంతానార్థమై ఆయన అనుగ్రహం పొందు. విఘ్నం కల్గించుటకయ్యే తలమీదపడే దుస్సహమైన కుమారధారను, నేను నీలో ప్రవేశించడం వల్ల నా ప్రభావంతో సహించగలవు. విఘ్నపరంపరను జయించి నీ వాంఛితాన్ని తీర్చుకో." ఈ విధంగా చెప్పి ఆమె అంతర్హితురాలై నది. రాజు సంతోషించి ఆ రాత్రిని గడిపివేసినాడు.

ఉదయం మంత్రులపై రాజ్యభారంమోపి పుత్రకాంక్షతో కుమారస్వామి పాదసన్నిధికి ఆ రాజు వెళ్ళిపోయినాడు.

అక్కడ ఆ స్వామి సమారాధనకై తీవ్రంగా తపస్సు చేసినాడు. ఆ నాగిని తన శరీరంలో ప్రవేశించి తనకు ఎనలేని బలం సమకూర్చినది.

అంతట పిడుగుపాటువంటి కుమారవారిధార నిరంతరం అతని తలపై పడసాగినది. తన శరీరాంతర్గతురాలైన నాగిని బలంవల్ల ఆ బాధను సహించగలిగినాడు.

ఆ తర్వాత అతని తపస్సును భంగం చేయుటకై కుమారస్వామి వినాయకుని ప్రేరేపించినాడు. ఆ హేరంబుడేమో ఆ ధారామధ్యంలో మహావిషపూరితమైన అజగరాన్ని కల్పించినాడు. అయినప్పటికి దానితోకూడా అతను చలించలేదు.

అంతట వినాయకుడు సాక్షాత్తూ అతని ఉరఃస్థలాన్ని దంతాఘాతాలతో బాధింపదొడగినాడు. దేవతలకు కూడా అజేయుడైన

విఘ్నేశుడు ఇలా బాధింప దొడగగా ఆయన దుర్జయుడని తెలుసు కొని రాజు దానిని సహిస్తూ ఆయనను స్తోత్రంతో అర్చింపదొడగి నాడు.

'సర్వార్థ సంసిద్ధి నిధి కుంభోపమమైన లంబోదరు నకు సర్వాభరణునకు నమస్కారం. విలాసంగా తొండంతో అతను కూర్చున్న పద్మాన్ని కదిలించి బ్రహ్మను కూడా కంపింపజేయగలవాడవు నీవు. ఓ గజాననా! నీకు నమ స్కారం.

లోకైక శరణ్యుడవైన నీవు సంతోషించనిది సురా సుర మునీంద్రు లెవ్వరికీ ఏ సిద్ధులూ సిద్ధింపవు. శంకర ప్రియుడవు నీవు. ఘటోదరుడవు. శూర్పకర్ణుడవు. గణా ధ్యక్షుడవు. మదోత్కటుడవు. పాశహస్తుడవు. అంబరీషు డవు. త్రిశిఖాయుధుడవు. పాపఘ్నములైన అష్టషష్టి నామాలతో సురోత్తములు కూడా ఇలాంటి స్తోత్రాలతో నిన్ను స్తుతిస్తారు.

నిన్ను స్మరించినా, స్తుతించినా రణంవల్లగాని, రాజ కులంవల్లగాని, చౌర్యంవల్లగాని, ద్యూతంవల్లగాని, అగ్ని వల్లగాని, క్రూరమృగాదుల వల్లగాని కలిగే భయం నశి స్తుంది.'

అని ఈ విధమైన స్తోత్రంతో అలాంటి అనేక ఇతర స్తోత్రా లతో కనకవర్ష మహారాజు విఘ్నేశ్వరుని పూజించినాడు.

అప్పుడా విఘ్నేశ్వరుడు సంతుష్టుడై "కుమారా! నీకు విఘ్న మేమీ కల్పింపను. నీకు పుత్రోదయ మౌతుంది" అని అంటూ అంతర్ధానమైనాడు.

అంతట కుమారస్వామి తన ధారాధారి అయిన ఆ రాజుతో ఇలా అన్నాడు: "ధీరా! నీయెడ సంతృప్తి చెందినాను. ఏదైనా వరం కోరుకో."

ఆ మాటవిని ఆనందోత్ఫుల్ల హృదయుడైన రాజు ఇట్లా విన్నవించుకొన్నాడు: "దేవా! తమ అనుగ్రహంతో నాకు పుత్రోదయం కలుగవలెనని కోరుకొంటున్నాను"

ఆ మాటకు కుమారస్వామి "రాజా! అలాగే నీకు కుమారుడు కలుగుతాడు. అతడు నా గణాంశజుడై ఉంటాడు. అతనికి హిరణ్యవర్షుడనే పేరు పెట్టు" అని చెప్పి తన గర్భగృహంలోనికి రావలసినదని రాజును ఆహ్వానించినాడు. విశేషానుగ్రహాన్ని చూపుటకై కుమారస్వామి అలా ఆదేశించినాడు.

అప్పుడు తన శరీరంలో ప్రవేశించి అదృశ్యురాలుగా ఉన్న నాగి బయటకు వచ్చివేసినది. శాపభీతివల్ల స్త్రీలు కుమారస్వామి గర్భగృహంలోనికి ప్రవేశించరు.

అంతట కనకవర్షరాజు తన సొంతమైన మానవతేజస్సుతో ఆ దేవుని గర్భభవనం లోనికి ప్రవేశించినాడు. ఆ నాగిని బయటకు వెళ్ళిపోవడం వల్ల పూర్వతేజస్సు తగ్గిపోయి మామూలుగానున్న అతనిని చూచి కుమారస్వామి కూడా ఇదేమిటని చింతించినాడు.

ఆలోచించి నాగిబల వ్యాజంతో ఈ విషమవ్రతాన్ని కొనసాగించె నని కనుగొని కోపించి ఆ రాజును కుమారస్వామి శపించినాడు. నీ విదంతా వంచనతో చేసినావు గనుక నీకు కలిగిన కుమారునితోను, మహాదేవితోను నీకు భయంకరమైన వియోగం కలుగుతుంది."

నిర్ఘాత దారుణమైన ఈ శాపాన్ని విని ఆ రాజు మోహాన్ని వదలి మహాకవి గనుక సూక్తులతో ఆయనను సంతృప్తి పరచినాడు. ఆ సుభాషితాలతో సంతుష్టుడైన షణ్ముఖుడు రాజుతో ఇట్లన్నాడు:

"రాజా! నీ సూక్తులతో సంతుష్టుడనైనాను. నీకు శాపాంతాన్ని నిర్దేశిస్తున్నాను. నీ పత్నీ పుత్ర వియోగం ఒక సంవత్సర పర్యంతం ఉంటుంది. మూడు గండాలనుండి నీవు బయటపడుతావు. ఆ తర్వాత శాపం తీరిపోతుంది." అని చెప్పి స్కందుడు విరమించగా ఆయనకు నమస్కరించి ఆ రాజు కనకవర్షుడు ఆయన అనుగ్రహ సుధతో సంతృప్తుడై తన నగరానికి తిరిగి వెళ్ళినాడు.

అక్కడ చంద్రచంద్రికలనుంచి అమృత స్యందం వలె దేవి మదనమంజరికి క్రమంగా ఒక కుమారుడు కలిగినాడు. పదే పదే కుమారుని ముఖాన్ని చూచి ఆ రాజు, రాణి అత్యానంద సమాయుక్తులై అతనినుంచి చూపులను మళ్ళించుకోలేక పోయినారు. ఆ సమయంలో గొప్ప ఉత్సవాన్ని చేసి ధనాన్ని వర్షిస్తూ కనక వర్షుడనే తన పేరును లోకంలో ఆ రాజు సార్థకం చేసుకొన్నాడు.

ఐదురాత్రులు గడవగా ఆరవరాత్రి ప్రసూతిగృహంలో ఎంత రక్షావిధి కల్పించినా అశంకితంగా మేఘాగమనం జరిగింది. ఆ మబ్బుతునక పెరిగి పెరిగి పెద్దదైనది. ప్రమాదవశాత్తూ శత్రువు ఉపేక్షించిన రాజ్యాన్ని రాజువలె క్రమంగా ఆకసాన్నంతా ఆక్రమించుకొన్నది.

అప్పుడు వాతమత్త గజేంద్రం మదధారలను వర్షిస్తూ చెట్లను కూల్చివేస్తూ పరువులెత్త నారంభించినది. ఆ క్షణంలో

గడియవేసి ఉండినప్పటికీ తలుపును తెరుచుకొని ఒక భీషణరూప అయిన స్త్రీ, బాకును చేతగొని ఆ సూతికాగృహంలో ప్రవేశించినది.

అక్కడ మదనసుందరి స్తన్యం గ్రోలుతున్న బాలకుని ఆమెనుండి లాగివేసుకొని అక్కడున్న పనివారి నందరినీ సమ్మోహింపజేసి పరువెత్తి పోయినది. 'అయ్యో! నా శిశువును రాక్షసి కొనిపోయెనే' అని విహ్వలయై రోదిస్తూ ఆ చీకటిలోనే రాణీ ఆ స్త్రీ వెంట పరువెత్తినది.

కొంతదూరం పోయి ఆ స్త్రీ బాలకునితో పాటు అక్కడ కన్పించిన సరస్సులో దుమికినది. పసిపాపని మీది ప్రేమతో రాణీకూడా అందులోనే దుమికినది. క్షణంలో మేఘాడంబరం తగ్గిపోయినది. రాత్రికూడా గడచిపోయినది. ఆ సూతికాగృహంలో పరివారజనాక్రందనం మాత్రం వినబడసాగినది.

రాజు కనకవర్షుడు అది విని జాతగృహానికి వచ్చి పుత్రప్రియా శూన్యమైన దానిని కనుగొని మూర్ఛిల్లినాడు. తర్వాత తెప్పరిల్లి "ఓ దేవీ! ఓ పుత్రా!" అంటూ పలవరిస్తూ ఏడాదిపాటూ ఆ శాప ముంటుందని జ్ఞాపకం చేసుకొన్నాడు.

"భగవచ్ఛాప సంప్రాప్తుడైన ఈ మందభాగ్యునకు ఎందుకు వర మిచ్చితివి? విషామృత సన్నిభమైన ఒక ఏడాదిని నే నెలా గడపగలను? ప్రాణాధిక అయిన మదనసుందరీ దేవిని వదలి నే నెలా ఉండగలను?" అని ఆక్రందనం చేస్తూ ఈ వృత్తాంతమంతా తెలిసి వచ్చిన మంత్రులందరూ ఉద్బోధించినప్పటికీ ఆ దేవితో పాటే పోయిన ధైర్యాన్ని ఆ రాజు కూడగట్టుకొనలేక పోయినాడు.

క్రమంగా మదనావేగ వివశుడై పట్టణం నుంచి బయలుదేరి ఉన్మత్తునివలె తిరుగుతూ వింధ్యాటవిలోనికి ప్రవేశించినాడు.

అక్కడ జింకపిల్లల కళ్ళతో ప్రియురాలి లోచనశ్రీని జ్ఞాపకం చేస్తూ, చమరీవాల సంచయంతో కబరీభార సౌందర్యాన్ని తలపునకు తెస్తూ, కరికరేణువుల నడకలతో ఆ దేవి మందగమనాన్ని తలపునకు తెస్తూ మన్మథుడు అతని మదనాగ్నిని మరింత ప్రజ్వలింప జేసినాడు.

తిరిగి తిరిగి దప్పిగొని ఎండకు వడలిపోయి వింధ్యపర్వత పాదానికి చేరుకొన్నాడు. అక్కడ సెలయేటి నీరుత్రావి ఓ చెట్టు నీడలో కూర్చున్నాడు.

అంతలో వింధ్య గుహాముఖం అట్టహాసం చేస్తున్నదా అన్నట్టు గర్జించుకుంటూ సింహ మొకటి ఎగిరివచ్చి అతనిని చంపుటకు పై బడినది. ఆ క్షణంలోనే గగనం నుంచి ఒకానొక విద్యాధరుడు అతి వేగంగా వచ్చి క్రిందికి దుమికి ఒక కత్తివ్రేటుతో దానిని రెండుగా చీల్చివేసినాడు.

ఆ తర్వాత రాజు దగ్గరకు వచ్చి ఆ ఖేచరుడు ఇట్లా అడిగినాడు: "ఓ కనకవర్ష మహారాజా! నీ వీ ప్రాంతాని కెలా వచ్చినావు?"

అది విని జ్ఞాపకం తెచ్చుకొని ఆ రాజు, విరహానల నిక్షిప్తుడనైన నన్ను నీ వెలా ఎరుగుదువని ప్రతిప్రశ్న వేసినాడు.

అంతట విద్యాధరుడు 'నేను పూర్వం ప్రవ్రాజకుని రూపంలో బంధుమిత్రు డనే పేరనున్న మానవుడను. పూర్వం నీ పట్టణంలోనే నివసించినాను. నీవు సహాయం చేయగా నేను వీర బేతాళ సాధనచేసి విద్యాధరత్వాన్ని పొందినాను. కాబట్టి నిన్ను గుర్తించి నీకు ప్రత్యుపకారం చేయదలచినాను.

ఈ సింహం నిన్ను చంపనుండగా దానిని ఖండించివేసి నాను. నా పేరు ఈ విద్యాధరరూపంలో బంధుప్రభుడు" అని ఆతడు చెప్పగా రాజు కనకవర్షుడు అతనిపై ప్రీతికలిగి ఇట్లా అన్నాడు:

"ఇప్పుడే జ్ఞాపకం వస్తున్నది. పూర్వ మైత్రిని నీవు మరచి పోలేదు. మరి నా భార్యాపుత్రులతో నాకు సమాగమం ఎప్పుడు కలుగుతుందో చెప్పు?"

ఆ మాటలను విని తన విద్యాప్రభావంతో కనుగొని విద్యాధరుడైన బంధుప్రభుడు ఆ మహీపతితో ఇట్లన్నాడు:

"వింధ్యవాసినీదేవి దర్శనంతో నీవు నీ పత్నీ పుత్రులను కలుసుకోగలవు. కాబట్టి నీ వక్కడికి వెళ్ళు. నేను నా లోకానికి వెళ్ళిపోతాను" అని చెప్పి అతను ఆకసానికి ఎగిరిపోగా మెల్లగా కనకవర్ష మహారాజు కూడా వింధ్యవాసినీ దర్శనార్థమై బయలు దేరినాడు.

ఆయనలా వెడుతుండగా ఆ అటవీమార్గంలో తలను విదిలించుకుంటూ తొండాన్ని విదిలిస్తూ మదపుటేను గొకటి అతనివైపు రాదొడగినది. దానిని చూచి శ్వభ్రమార్గంలో రాజు ప్రక్కకు తొలగినాడు.

ఆ ఏనుగు అతని వెంటనే పరుగెత్తుతూ ఆ గుంటలో పడి చనిపోయినది. అంతట మార్గాయాస క్లిన్నుడైన రాజు క్రమంగా వెడుతూ ఉద్దండ పుండరీకాఢ్యమైన ఒక గొప్ప సరస్సుని చేరుకొన్నాడు.

అక్కడ స్నానంచేసి, దప్పితీర్చుకొని, తామరతూళ్ళను విరుచుకొని తిని ఒక చెట్టునీడలో విశ్రాంతి తీసుకొంటూ ఒక క్షణంలో నిద్రపోయినాడు.

అంతలో వేటకోసమై వెళ్ళి తిరిగివస్తున్న శబరులు ఆ దారిని వస్తూ నిద్రపోతున్న సులక్షణుడైన ఆ రాజును చూచినారు. వారు దేవికి బలి ఇవ్వడానికై ఆయనను కట్టివేసి శబరరాజైన ముక్తా ఫలుని వద్దకు కొనిపోయినారు. ఆ శబరాధీశుడు కూడా ప్రశస్తి నిగా భావించి బలిఇవ్వడానికై ఆ నృపాలుని వింధ్యవాసినీ నికేత నానికి కొనిపోయినాడు.

ఆ దేవిని చూచీ చూడగానే నమస్కరించి, ఆమె అనుగ్రహం వల్లనూ, షణ్ముఖ ప్రసాదంవల్లనూ ఆ రాజు బంధన చ్యుతుడై నాడు. అది చూచి అద్భుతంగా భావించి దేవ్యనుగ్రహపాత్రుడని ఆ రాజును శబరాధిపతి వధించకుండా వదిలివేసినాడు. ఈ విధంగా కనకవర్షరాజు మూడు గండాలనుంచి తప్పించుకో గలిగినాడు.

ఈ లోగా అతని శాపసంవత్సరం కూడా పూర్తిచెందినది. అప్పుడు నాగి, రాణి అయిన మదనసుందరిని పుత్రునితో పాటూ అక్కడికి తోడ్కొని వచ్చినది.

అంతట ఆమె ఇట్లన్నది: "రాజా! కుమారస్వామి శాపాన్ని తెలుసుకొన్న దానినై నేనే వీరిని యుక్తితో మా ఇంటికి కొని పోయి రక్షిస్తూ వచ్చినాను. ఇప్పుడు నీవు నీ భార్యా పుత్రులను స్వీకరించ వలసింది. నీ శాపం తీరిపోయినది గనుక ఈ పృథ్వీ రాజ్యాన్ని అనుభవింపవలసింది" అని చెప్పి అతను అభివాదనం చేయగా వీడ్కొని ఆ నాగిని తిరోధానం చెందినది.

రాజుకూడా తన భార్యాపుత్రుల సమాగమం ఏదో కలగా భావించినాడు. ఆ తర్వాత రాజూ రాణీ చిరకాలం గాఢాలింగనంలో పెనవేసుకొని పోయినారు. హర్షభాష్పాంబువులతో పాటూ వారి విరహక్లేశం కూడా జారిపోయినది.

అంతట కనకవర్ష మహారాజును బంధించినందుకు పశ్చాత్తప్తుడై శబరేంద్రుడు ముక్తాఫలుడు, ఆయన పాదాలపై పడినాడు. అతనిని క్షమించి అతని పల్లెకు రాజు వెళ్ళగా విధివిహితాలైన ఉపచారాలతో, భార్యాపుత్రులతో నున్న ఆ మహారాజును అతను ఉపచరించినాడు.

ఆ రా జక్కడ ఉండి, దూతలను పంపి తన మామగారైన దేవశక్తిని తన పట్టణంలోని తన సేననూ అక్కడికి రప్పించుకొన్నాడు.

ఆ తర్వాత కరేణువుపై తన ప్రియురాలు మదనసుందరి నెక్కించి శరజన్ముడు చెప్పినట్టే తన కొడుకునకు హిరణ్యవర్షుడని నామకరణం చేసినాడు.

అక్కడినుంచి అత్తవారింటి మీదుగా వారందరితో పాటూ కనకవర్ష మహారాజు తన నగరానికి బయలుదేరినాడు.

కొన్నిరోజులు ప్రయాణంచేసి విదర్భరాజ్యంలోని మామగారి కుండిన పట్టణం చేరుకొన్నాడు. అక్కడకూడా సమృద్ధంగా దేవశక్తి మహారాజుతో సత్కృతుడై భార్యాపుత్ర సేనాయుతుడై ఆ నగరంలో కొన్నిదినాలు గడిపినాడు.

అక్కడినుంచి మెల్లగా బయలుదేరి తన నగరమైన కనకపురాన్ని చేరుకొన్నాడు. చిరకాలం ఉత్సుకతతో ఉన్న పౌరవధూజనం తమ నయనాలతోనే ఆయనను త్రావివేసినారు.

రాజధానిలో ప్రవేశించి ప్రమోద శోభాన్వితుడైన ఆ రాజు రూపుగొన్న ఉత్సవం వలె కన్పించినాడు. అక్కడ మదనసుందరిని పట్టబంధంతో అభిషేకించి సర్వాంతఃపుర కాంతలతో పట్టపు

రాణిగా చేసినాడు. ఆ దేవితో పాటూ ఆ కుమారునితో పాటూ నిత్యోత్సవం చేసుకొంటూ తిరిగి వియోగదుఃఖం పొలకువలేకుండా నిష్కంటకంగా భూమండలాన్ని కనకవర్ష మహారాజు పాలించినాడు.''

ఈ విధంగా తన మంత్రిముఖ్యుడైన గోముఖుడు ఈ మనోహరమైన కథను చెప్పగా విని నరవాహనదత్త రాజపుత్రుడు అలంకారవతీ సమేతంగా సంతోషించినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో అలంకారవతీలంబకంలో
పంచమ తరంగం

---

# షష్ఠ తరంగం

ప్రియాసఖుడైన నరవాహనదత్తుడు గోముఖుడు చెప్పిన కథను విని ఆనందించినాడు. ఈర్ష్యతో కోపంగా ముఖం ముడుచుకొని ఉన్న మరుభూతిని చూచి అతనిని అనురంజింప జేయాలని ఇట్లన్నాడు: "మరుభూతీ! నీవుకూడా ఒక కథను చెప్పకూడదేమిటి?''

అంతట మరుభూతి "తప్పకుండా చెప్తాను'' అని సంతుష్టచిత్తుడై ఈ కథను చెప్పడానికి ఉపక్రమించినాడు —

**చంద్రస్వామి, అతని కుమారుని కథ:**

—పూర్వం కమలవర్ణ మహారాజునకు చెందిన కమలపురమనే నగరంలో చంద్రస్వామి అనే బ్రాహ్మణోత్తముడు ఒకడు కలడు. అతనికి లక్ష్మీ సరస్వతులతో పాటు మూడవదైన వినయోజ్జ్వల దేవమతి అను భార్యకలదు. సుమతికి సరిపోలునదామె. ఆ విప్రోత్తమునకు ఆమెకు సులక్షణుడైన ఒక కుమారుడు కలిగినాడు.

ఆ సమయంలో దివ్యవాణి ఇలా వినిపించినది: "ఓ చంద్రస్వామీ! నీ కొడుకునకు మహీపాలుడు అనే పేరు పెట్టవలసింది. ఇతడు రాజై చిరకాలం భూమిని పాలించగలడు.''

ఈ దివ్యవాక్యాన్ని విని చంద్రస్వామి తన కుమారునకు ఉత్సవపూర్వకంగా మహీపాలుడనే పేరు పెట్టినాడు. క్రమంగా

ఆ మహీపాలుడు పెద్దవాడై శస్త్రాస్త్ర వేదవిద్య లన్నిటియందు సమానంగా శిక్షితుడై నాడు.

ఆ తర్వాత ఆ చంద్రస్వామి భార్య, సర్వాంగసుందరి అయిన దేవమతి అనే కన్యను ప్రసవించినది. ఆమెకు చంద్రవతి అని పేరుపెట్టినాడు. వారిరువురూ తండ్రి ఇంటిలో పెరుగుతూ వచ్చినారు.

అంతట ఒకసారి ఆ దేశంలో అనావృష్టిమూలంగా దుర్భిక్ష విప్లవం చెలరేగినది. ఎండ వేడికి పంటలన్నీ కాలిపోయినవి. ఆ దోషంతో అక్కడి రాజు ప్రజలనుంచి ధనాన్ని సత్వాన్ని వదలి అధర్మంగా తస్కరించడానికి ఆరంభించినాడు.

అప్పుడు దేశమంతా అల్లకల్లోలం కాగా భార్య దేవమతి విప్రుడు చంద్రస్వామితో ఇట్లన్నది: "రండి. ఈ నగరాన్ని వదలి మా పుట్టింటికి వెడదాము. ఇక్కడే ఉంటే మన పిల్లలు ఎప్పుడో నశింపవచ్చును.''

ఆ మాటవిని చంద్రస్వామి తన గృహిణితో ఇట్లన్నాడు: "మన పెద్దల ఇంటినుంచి దుర్భిక్షానికి భయపడి పారిపోవడం మంచిది కాదు. కాబట్టి నేను ఈ పిల్లలను మీ పుట్టింటికి తీసుకొని వెళ్ళి వదలిపెడతాను. నీ విక్కడే ఉండు. నేను త్వరలో తిరిగి వస్తాను" అని చెప్పి సరేనన్న ఆమెను తన ఇంటిలోనే ఉంచి చంద్రస్వామి తన పిల్లలు మహీపాలుడు, చంద్రవతి ఇద్దరితో ఆ నగరంనుంచి తన భార్యపుట్టింటికి బయలుదేరినాడు.

వెడుతూ వెడుతూ క్రమంగా మూడు నాలుగు రోజులలో ఒక మహారణ్యంలో ప్రవేశించినాడు. అక్కడి ఇసుక సూర్య రశ్మితో వేగిపోతున్నది. అక్కడొకటి ఇక్కడొకటి ఎండిపోయి

చెట్లు కనబడుతున్నవి. అక్కడ తన పిల్లలు దప్పిగొని బాధ పడుతుండగా వారి నక్కడ ఉండమని చంద్రస్వామి, వారికై నీటిని వెదకడంకోసం చాలదూరం వెళ్ళినాడు.

అక్కడ ఒక శబరాధిపుడు తన అనుచరులతో పాటూ ఎదురుగా వస్తున్నాడు. అతని పేరు సింహదంష్ట్రుడు. ఏదో పని మీద ఎక్కడికో వెడుతున్నాడు. ఇతనిని చూచి, అడిగి జలార్థి అని తెలుసుకొని ఆ భిల్లుడు తన భృత్యునకు సైగచేసి 'ఈయనను నీటివద్దకు కొనిపొండు' అని చెప్పినాడు.

ఆ మాటవిని అతని భృత్యులు ఇద్దరు ముగ్గురు, తన యజమాని భావాన్ని అర్థం చేసుకొని చంద్రస్వామిని తమపల్లెకు కొనిపోయి బందీని చేసినారు.

నరబలి కోసమై తన్ను బంధించినారని తెలుసుకొన్న చంద్రస్వామి అడవిలో నున్న తన పిల్లలకోసమై శోకించినాడు.

"హా! మహీపాలా! హా! చంద్రవతీ! తావుగాని తావున మహారణ్యంలో సింహవ్యాఘ్రాలకు ఆహారంగా మిమ్ము వదలి వచ్చితినే! నేనుకూడా దొంగల పాలబడి చిక్కితినే. నా కిక శరణ్యమేమిటి?'' అని ఆక్రందిస్తూ ఆ విప్రుడు సూర్యుని ఆకసంలో చూచినాడు.

"ఛీ ఛీ ఈ మోహాన్ని వదలివేసి నా ప్రభువునే నేను శరణు పొందుతాను". అని ఆలోచించి ఆ విప్రోత్తముడు సూర్యుని స్తోత్రం చేయడానికి ఆరంభించినాడు.

"స్వామీ! ముల్లోకాలనూ వ్యాపించిన విష్ణువు నీవే. శ్రేయోనిధివైన శివుడవు నీవు. నిద్రిస్తున్న విశ్వాన్ని చైతన్యవంతం

చేసే పరమ ప్రజాపతివి నీవు. ప్రకాశరహితులైన చంద్రాగ్నులలో నీ ఆత్మ తేజాన్ని ఉంచి దయతో ప్రకాశింపజేస్తున్నావు. రాత్రిని ఆ విధంగా అంతర్హితం చేస్తున్నావు. నీవు ఉదయించినప్పుడు రాక్షసులు పరువెత్తి పోతారు. దొంగలు పారిపోతారు. గుణవంతులు సంతోషిస్తారు.

కాబట్టి ఓ సూర్యదేవా! ఆపన్నుడనైన నన్ను రక్షించు. త్రిలోకైక దీపానివి నీవు. ఈ దుఃఖాంధకారాన్ని తొలగించు. నాపై దయచూపు.''

ఇలాంటి వాక్యాలతో భక్తిపూర్వకంగా చంద్రస్వామి రవిస్తుతి చేయగా గగనంనుంచి ఈ మాటలు వినబడినవి: "ఓ స్వామీ! నీ ఎడల నేను సంతృప్తుడనైనాను. నిన్నెవడూ వధింపలేడు. నా అనుగ్రహంవల్ల పుత్రాది సంగమం కూడా నీకు సమకూరుతుంది."

ఈ దివ్యవాణితో ఆశ పొటమరిల్లగా చంద్రస్వామి శబరులు తెచ్చిన స్నానభోజనాలతో తృప్తిచెంది అక్కడే ఉన్నాడు.

ఈలోగా మహీపాలుడు, అతని చెల్లెలు అరణ్యంలో తండ్రి రాలేదని ఆక్రందిస్తూ అశుభాన్ని శంకిస్తూ ఉన్నారు. ఇంతలో ఆ మార్గంలో వర్తకుల బిడారొకటి వచ్చినది. ఒక గొప్ప సార్థధరుడనే వర్తకుడు వీరి వృత్తాంతం అడిగినాడు. దయతో వారిని ఓదార్చి ఆ బాలకుని సులక్షణునిగా భావించి అతని చెల్లెలితో పాటూ వారిని అక్కడినుంచి ఆ సార్థవాహుడు తన దేశానికి కొనిపోయినాడు.

అక్కడ మహీపాలుడు బాలుడైనా అగ్నిక్రియారతుడై ఆ వర్తకుని ఇంటిలో, అతను తన సొంత కొడుకువలె చూచుకొంటుండగా ఉండిపోయినాడు.

ఒకసారి తారాపుర నివాసి అయిన తారాధర్ముడను రాజు పనిపై అతని మంత్రి అయిన అనంతస్వామి ఆ దారిన వచ్చినాడు. మిత్రుడైన ఆ సార్థవాహుని ఇంటిలోనికి ఆ ద్విజోత్తముడు ప్రవేశించినాడు.

హస్త్యశ్వ పదాతికసభికుడైన అనంతస్వామి ఆ ఇంటిలో కాస్త విశ్రాంతి తీసుకొంటూ ఉండగా, శుభాకృతి అయిన మహీపాలుడు కన్పించినాడు. జపాగ్ని కార్యాదిరతుడైన ఆ బాలకుని వృత్తాంతాన్ని అడిగి తెలుసుకొన్నాడు. తాను సంతానహీనుడు గనుక, ఆ బాలకుడు తనకు సవర్ణుడని సార్థవాహునివల్ల తెలియరాగా, అపత్యార్థి అయి ఆ మంత్రి, ఆ ఇద్దరినీ తన కిమ్మని ఆ వర్తకుని యాచించినాడు.

ఆ విధంగానే ఆ వర్తకుడు ఆ పిల్లల నివ్వగా వారిని తీసుకొని అనంతస్వామి తారాపురానికి వెళ్ళిపోయినాడు.

అక్కడ మహీపాలుని, ఆ మంత్రి తన పుత్రునిగా దత్తత చేసుకొన్నాడు. విద్యావిపులసంపత్సంయుతమైన ఆ భవనంలో ఆ పిల్లవాడుండి పోయినాడు.

ఈ లోగా పల్లెలోని తన ఇంటిలో బద్ధుడైన చంద్రస్వామి వద్దకు వచ్చి భిల్లరాజైన సింహదష్ట్రుడు ఇట్లా అన్నాడు:

"ఓ బ్రాహ్మడా! నాకు కలలో సూర్యదేవుడు కన్పించి నన్నిలా ఆదేశించినాడు: 'ఈ బ్రాహ్మణుని సత్కరించి ఆహారాదులివ్వవలసింది. ఆయనను చంపకూడదు". కాబట్టి నీవు లేచి స్వేచ్ఛగా నీ ఇష్టంవచ్చిన చోటకి వెళ్ళవచ్చును అని చెప్పి అతనికి విమోచనం కల్పించినాడు. ముత్యాలు, కస్తూరి ఇత్యాదులిచ్చి, తగినంతమంది అనుయాయుల నిచ్చి వదలివేయగా, ఆ

చంద్రస్వామి అడవిలోనికి వచ్చి, అక్కడ తన కుమారుడైన మహీ పాలుని వెదుకుతూ, కానరాక తిరుగుతూ తిరుగుతూ సముద్ర తీరంలో జలపురమనే పట్టణాన్ని చేరుకొన్నాడు

అక్కడ ఒకానొక విప్రుని ఇంటిలో అతిథిగా ప్రవేశించి నాడు. అక్కడ తన వృత్తాంతాన్ని ముక్తసరిగా చెప్పగా, విన్న ఆ గృహస్థు చంద్రస్వామితో ఇట్లన్నాడు:

"కనకవర్మ అనే పేరుగల ఒక వర్తకుడు కొన్ని దినాల క్రిందట ఇక్కడికి వచ్చినాడు. అతనికి అడవిలో చెల్లెలితో పాటూ ఉన్న ఒక బ్రాహ్మణ కుమారుడు దొరికినాడట. వానిని తీసుకొని ఆ భవ్య సోదరీ సోదరులతో పాటూ ఇక్కడినుంచి వెళ్ళిపోయినాడు. నారికేళ మహాద్వీపానికి వెళ్ళినట్టున్నది. పేరు మొదలైనవి చెప్ప లేదు.''

ఆ మాట విని 'వారు తప్పకుండా నా పిల్లలే' అని తలపోసు కుంటూ చంద్రస్వామి ఆ ద్వీపానికి వెళ్ళదలచుకున్నాడు.

ఆ రాత్రి గడిపి విష్ణుశర్మ అనే వర్తకుని దగ్గర, అతను నారికేళ ద్వీపానికి వెడుతున్నట్టు తెలుసుకొని, అతనితో పరిచయం చేసుకొన్నాడు. అతనితోనే ఒక నౌక నెక్కి పిల్లలమీది మమకా రంతో సముద్రమార్గంలో చంద్రస్వామి బయలుదేరినాడు.

అక్కడ విచారించగా ఆ పురవర్తకులు, కనకవర్మ అనే వర్తకుడు అక్కడికి వచ్చినమాట నిజమేనని, అడవిలో దొరికిన విప్ర బాలికా బాలకులను సురూపులను కొనివచ్చినాడని, అయితే ప్రస్తుతం అతను వారితో పాటూ కటాహద్వీపం వెళ్ళిపోయెనని చెప్పినారు.

ఆ మాటవిని ఆ విప్రుడు దానవర్మ అనే వర్తకుడు వెడుతుండగా అతనితో పాటూ అతని నావలో కటాహద్వీపానికి వెళ్ళినాడు.

అక్కడ కూడా ఆ వర్తకుడు వెళ్ళిపోయెనని, కనకవర్మ కర్పూర ద్వీపానికి వెళ్ళి ఉండవచ్చునని అక్కడివారు చెప్పినారు.

ఈ విధంగా అతను కర్పూరద్వీపం, సువర్ణద్వీపం, సింహళం వర్తకులతో పాటూ వెళ్ళినప్పటికీ ఆ వర్తకుడాయనకు కన్పించలేదు. సింహళంలో మాత్రం కనకవర్మ స్వదేశమైన చిత్రకూట పురానికి వెళ్ళినని విన్నాడు.

అంతట కోటీశ్వరు డనే పేరుగల వర్తకునితో కలిసి అతని నావలో సముద్రాన్ని దాటి చంద్రస్వామి చిత్రకూటానికి వెళ్ళినాడు. అక్కడ కనకవర్మ అనే వర్తకుని కలుసుకొని పిల్లలమీది కుతూహలంతో తన సర్వ వృత్తాంతాన్నీ తెలియజేసినాడు.

ఆ కనకవర్మ ఇతని బాధను చూచి తనకు అరణ్యంలో దొరికిన పిల్లలను చూపించినాడు. ఆ ఇద్దరినీ చంద్రస్వామి చూడగా తన పిల్లలుకారని, వారెవరోననీ గ్రహించినాడు.

అందుతో కన్నీరు విడుస్తూ శోకార్తుడై నిరాశతో విలపించినాడు. "ఇంతగా ఇన్ని దేశాలు తిరిగినప్పటికీ నాకు నా కుమార్తెగానీ, కుమారుడుగానీ కానరాలేదు. బ్రహ్మదేవుడు దుష్టప్రభువు వలె ఆశ చూపించినాడుగాని దానిని పూరించలేదు. ఆ దురాత్ముడు నన్ను వ్యర్థంగా ఒక చోటినుంచి మరొకచోటికి ఎంతో దూరాభారం భ్రమించేట్టు చేసినాడు."

ఈ విధంగా శోకిస్తున్న కనకవర్మను మెల్లగా ఆ వర్తకుడు ఓదార్చినాడు. అప్పుడు చంద్రస్వామి అతనితో ఇట్లన్నాడు: "ఇంకొక సంవత్సరంలో భూచక్రమంతా వెతుకుతూ తిరిగినా, నా పిల్లలు నాకు దొరక్కపోతే, అప్పుడు గంగా తీరంలో తపస్సు చేస్తూ శరీరాన్ని త్యజించి వేస్తాను."

అలా అతనంటుండగా అక్కడ ఉన్న ఒకానొక జ్ఞాని ఆయనతో "నారాయణీ ప్రసాదం వల్ల నీవు నీ పిల్లలను తప్పకుండా కలుసుకుంటావు" అన్నాడు.

ఆ మాట విని సంతుష్టాంతరంగుడై భాస్కరానుగ్రహాన్ని స్మరించుకొని వర్తక సత్కృతుడై చంద్రస్వామి ఆ పట్టణంనుంచి బయలుదేరినాడు.

క్రమంగా అగ్రహారాలను, గ్రామాలను, నగరాలను వెదుకుతూ, వెదుకుతూ తిరిగి తిరిగీ ఒకనాటి సాయంకాలం ఒక వనాన్ని చేరుకొన్నాడు.

అక్కడ అత్యున్నత పాదపాలు అనేకాలున్నవి. ఆ రాత్రి అక్కడే గడుపుదామని పళ్ళతోనూ, నీళ్ళతోనూ ఆకలి తీర్చుకొని సింహ వ్యాఘ్రాదుల భయంతో ఒక చెట్టు నెక్కి కూర్చున్నాడు.

అక్కడ నిద్రలేకనే ఉన్న అతను, అర్ధరాత్రి ఆ చెట్టు క్రిందికి మహన్నారాయణీ ముఖ్యమైన మాతృ చక్రం రావడం చూచినాడు. వారు రకరకాల ఉపాహారాలను తమకు అర్హమైన వానిని కొనివచ్చి, భైరవ దేవుని ఆగమనం కోసం ప్రతీక్షిస్తున్నట్టున్నారు.

"ఇదేమిటి, మన స్వామి ఆలస్యం చేస్తున్నాడు" అని ఆ మాతలు అనుకుంటూ నారాయణిని అడుగగా, ఆమె నవ్వి ఊర

కున్నదిగానీ ఏమీ చెప్పలేదు. మరీ బలవంతం చేసి వారు చెప్ప మని నిర్బంధింపగా అప్పుడామె ఇట్లన్నది:

"ఇది లజ్జాకరమైనప్పటికీ మీ రడుగుతున్నారు గనుక చెప్తాను - ఈ సురపుర నగరంలో సురసేనాఖ్యుడనే రాజున్నాడు. అతనికి విద్యాధరి అను పేరుగల అతి రూపవతి అయిన కుమార్తె కలదు.

ఆమెను సమరూపుడైన రాజు, విమలాఖ్య రాజ తనయుడైన ప్రభాకరునకు ఇవ్వవలసి ఉన్నది.

అతనట్లా ఇవ్వదలచుకున్నాడని ఆమెకూడా విన్నది. విమ లుడుకూడా నిజ పుత్రానురూపిక అయిన కుమార్తె కలదని విన్నాడు. ఆ తర్వాత విమలుడు విద్యాధరిని తన కుమారునకు ఇవ్వవలసినదని శూరసేనుని యాచించినాడు. అతనుకూడా సంపదపేక్షతో అతని కొడుకునకు కుమార్తె నిచ్చినాడు. యథా విధిగా ఆ ప్రభాకరునకు ఇచ్చి వివాహం చేసినాడు.

ఆ తర్వాత విమలపురమనే మామగారి పట్టణానికి వచ్చి విద్యాధరి తన భర్తతోపాటూ రాత్రి పడకటింటికి వెళ్ళినది.

అక్కడ సంభోగ ప్రస్తావన లేక నిద్రిస్తున్న ప్రభాకరుని ఉత్కంఠతో నిరీక్షిస్తూ కడకు అతను నపుంసకుడని కనుగొన్నది.

"హతాస్మి! తుదకు నాకు షండుడు పతిగా ప్రాప్తించెనే!" అనుకుంటూ రాజపుత్రి దుఃఖిస్తూ ఆ రాత్రిని గడిపివేసినది.

తర్వాత, నన్ను నపుంసకునికి వెదకి వెదకి మీరిచ్చినారే మని తండ్రికి ఒక ఉత్తరం వ్రాసి ఆమె పంపించినది. అతను ఆ లేఖను చదువుకొని విమలుడు తన్ను వంచించినాడనుకొన్నాడు.

ఏదో మిషతో ఈ పని చేసెనని ఆమె తండ్రి విమలునిపై క్రోధం వహించినాడు. "ఏ వ్యాజంతో నీవు నా కుమార్తెను నపుంసకుడైన నీ కుమారునకు ఇచ్చునట్టు చేసినావో ఆ ఫలాన్ని అనుభవిస్తావు. నేను వచ్చి నిన్ను చంపుతాను చూడు" అని అతనికి ఆ రాజు తానొక జాబు వ్రాసి సందేశం పంపించినాడు.

విమలుడుకూడా ఆ లేఖ చేరగా మంత్రులతో సంప్రతించి, ఎదుటివాడు దుర్జయుడని తెలుసుకొన్నాడు. దీనినుండి తప్పించుకొనుటకు తనకు ఏ ఉపాయమూ కన్పించలేదు.

అప్పుడు పింగదత్తుడనే మంత్రి విమల మహారాజుతో ఇట్లన్నాడు: "ఇప్పుడు ఒకే ఒక ఉపాయమున్నది. మన శ్రేయస్సుకై దానినే తాము అనుసరించవలె. స్థూలశిరుడను పేరుగల ఒక యక్షుడు ఉన్నాడు. అతనిని నే నెరుగుదును. ఒక మంత్రముతో ఆరాధిస్తే అతను ఇష్టమైన వరాన్ని ఇస్తాడు. మీరు ఆ మంత్రాన్ని ఉపదేశం పొంది, యక్షుని ఆరాధించి పుత్రార్థమై పుంస్త్వాన్ని యాచించండి. అలా అయితే ఇప్పటికి శత్రుత్వం శమిస్తుంది'' అని మంత్రి చెప్పగా అతని నుంచి ఆ మంత్రోపదేశం పొంది ఆ రాజు యక్షుని ఆరాధించి పుత్రార్థమై పుంస్త్వాన్ని యాచించినాడు.

అతనడిగినట్టే యక్షుడు వరమివ్వగా ఆ రాజకుమారుడు ప్రభాకరుడు పురుషత్వం సంపాదించుకొన్నాడు. ఆ యక్షుడేమో నపుంసకుడైనాడు. ఆ విద్యాధరి తన భర్త ప్రభాకరుడు పురుషుడగుట చూచి, అతనితో రతి సౌఖ్యాన్ని పొంది ఇట్లా తలపోసుకొన్నది: "నేను కేవలం పొగరుబోతుతనంతో భ్రాంతి పడినాను. నా భర్త నపుంసకుడు కాడు. ఈ సుభగుడైన భర్త పురుషుడే.

ఇంకొక విధంగా తలంచడానికి వీలులేదు.'' ఈ విధంగా ఆలో చించుకొని ఇదే విషయంలో తిరిగీ తండ్రికి సిగ్గుపడుతూ ఉత్తరం వ్రాసినది.

అది చూచి అతను ఉపశమించినాడు. ఈ వృత్తాంతం తెలిసి కుపితుడైన దేవేంద్రుడు ఆ స్థూలశేఖరుడనే యక్షుని భైర వునితో పిలిపించి శపించినాడు. "నీవు లింగత్యాగం చేసి షండుడ వైనావు గనుక జీవితాంతం షండుడవుగానే ఉండిపోదువుగాక! ఆ ప్రభాకరుడు పురుషుడుగానే ఉండిపోవునుగాక!"

ఈ విధంగా నపుంసకుడైన యక్షుడు దుఃఖపడసాగినాడు. ప్రభాకరుడేమో పురుషీభూతుడై భోగసుఖాల ననుభవించినాడు.

అందువల్ల ఈ పనిపడి భైరవదేవునకు ఆలస్యమైనది. త్వరలోనే ఆయన రాగలడు.'' అని దేవి నారాయణి మాతృక లతో చెప్తుండగనే చక్రేశ్వరదేవుడైన భైరవుడు అక్కడికి వచ్చి నాడు. ఆయనను వారందరూ ఉపాహారాలతో పూజించినారు. అతనొక క్షణం యోగినీసఖుడై తాండవనృత్యం చేసినాడు. ఇదంతా చెట్టుమీద కూర్చొని ఉన్న చంద్రస్వామి విలోకించినాడు. ఒక దాసి అతనిని నారాయణికి చూపించినది. ఆమెకూడా అతనిని చూచినది.

అన్యోన్యాభిలాషతో వారు ఒకరినొకరు చూచుకుంటుండగా దేవి నారాయణి వారి మనసును గ్రహించినది.

మాతృసహితుడై భైరవుడు వెళ్ళిపోగా కొంత ఆలస్యంచేసి నారాయణి చెట్టుపైనున్న చంద్రస్వామిని ఆహ్వానించినది. అతను చెట్టు దిగి రాగా తన పరిచారికతో ఆమె "మీకు ఒకరిపై ఒకరికి అభిలాష కలదా?" అని ప్రశ్నించినది. "అవును దేవీ" అని వారి

ద్దరూ చెప్పగా ఆమె కోపగింపక చంద్రస్వామితో ఇట్లన్నది. "మీరు నిజమే చెప్పినారు గనుక నాకు సంతోషం కలిగినది. మిమ్ములను నేను శపింపను. ఈ నా దాసిని నీకిస్తాను. మీరు సుఖించండి.''

ఆ మాట విని ఆ విప్రుడు ఇట్లన్నాడు: "దేవీ! మనసు చంచలమైనా దానిని నిగ్రహించుకోగలను. అంతేకానీ పరస్త్రీని స్పృశింపను. ఇది మనోధర్మం. దానిని కాయికమైన పాపం నుంచి ఎలాగో రక్షించుకోవాలి.''

ఇలా చెప్పిన ధీరుడైన విప్రునితో దేవి ఇట్లన్నది: "నేను నీ మాటకు సంతోషించినాను. నీకో వరమిస్తున్నాను. నీ పుత్రాదులను త్వరలో కలుసుకోగలవు. ఈ వాడని కలువను నేను నీకిస్తాను, ఇది విషదోషాదులను పరిహరిస్తుంది'' అని చెప్పి తన చేతిలోని ఆ కలువనిచ్చి చంద్రస్వామిని వీడ్కొని తన దాసితో పాటూ నారాయణి తిరోధానం చెందినది.

ఆ కలువను తీసుకొని తెల్లవారగా ఆ విప్రుడు తిరుగుతూ తిరుగుతూ తారాపుర పట్టణానికి వెళ్ళినాడు. అక్కడనే తన కుమారుడు మహీపాలుడు, చంద్రవతి, మంత్రి అయిన అనంతస్వామి ఇంటిలో ఉన్నారు.

భోజనం కోసమై ఆ మంత్రిఇంటికే అతను వెళ్ళినాడు. ద్వారంలో ప్రాధ్యయనం చేసినాడు. అది విని ఆ ప్రియుడైన అతిథిని ప్రతీహారులద్వారా ఆ మంత్రి తన ఇంటిలోనికి పిలిపించుకొన్నాడు. చూడడంతోనే విద్వాంసుడుగా గ్రహించి అతనిని భోజనానికి పిలిచినాడు. అందు కంగీకరించి ఆ దగ్గరలో ఉన్న

పాపహరమైన సరస్సునకు అనంతహ్రదమను పేరుగల దానికి స్నానార్థమై వెళ్ళినాడు.

స్నానంచేసి తిరిగి వస్తుండగా నగరమంతటా 'హా కష్టం' అన్న నినాదం వినిపించినది. దానికి కారణ మేమిటని విచారించగా ఆ జన మిట్లా చెప్పినారు: "ఇక్కడ మహీపాలుడనే బ్రాహ్మణ పుత్రకు డున్నాడు. అడవిలో సార్థవాహుడైన సార్థధరునకు అతను దొరికినాడు. భగినీ సఖుడైన అతని సులక్షణాలను చూచి అనంత స్వామి అనే మంత్రి ఎంతో ప్రయత్నించి అతనిని తెచ్చుకొన్నాడు. తాను అపుత్రకుడై నందువల్ల వానిని పుత్రునిగా దత్తత చేసు కొన్నాడు. ఎంతో ప్రియంగా చూస్తున్నాడు. ఈ రాజ్యానికి రాజైన తారావర్మకు ఆ సద్గుణుడైన బాలకుడు ఎంతో ఇష్టుడు. ఆ బాలకు నిప్పుడు నల్లత్రాచు కరిచినది. అందుకే పట్టణమంతటా హాహారవాలు చెలరేగినవి."

ఈ మాట విని వాడు తన పుత్రకుడే అయి ఉంటాడని తల పోసుకుంటూ గబగబా చంద్రస్వామి మంత్రిగృహానికి వచ్చినాడు. అక్కడ జనం చుట్టూ చేరి ఉన్న పుత్రకుని గుర్తించినాడు. దేవీ దత్తమై తన చేతిలో ఉన్న ఉత్పలాన్ని చూచుకొని సంతోషించి నాడు. దానిని ఆ మహీపాలుని నాసికలో దూర్చినాడు. ఆ నీలో త్పలమే తన పరిమళంతో వాని విషాన్ని హరించినది. మహీ పాలుడు నిద్రనుండి మేల్కొన్నట్టుగా లేచి కూర్చున్నాడు.

అప్పుడా పట్టణ మంతటా జనం రాజుతోపాటూ ఉత్సవం చేసుకొన్నారు. చంద్రస్వామి ఏదో దైవాంశసంభూతుడని మంత్రి అనంతస్వామి, పౌరులు ఆ మహారాజు కూడా అర్ఘ్యాదులతో ఎంత గానో సత్కరించినారు. అతనా పట్టణంలోనే ఆ మంత్రి ఇంటి లోనే సత్కృతుడౌతూ ఉండిపోయినాడు. తన కుమారుడు మహీ

పాలుని, కూతురు చంద్రవతిని చూచుకుంటూ ఉన్నాడు. వారు ఒకరినొకరు గుర్తుపట్టినప్పటికీ బయటపడకుండా ఉండినారు. కార్యాపేక్షులైన విజ్ఞులు అకాలంలో తమ్ము బయటపెట్టుకొనరు గదా!

ఆ తర్వాత ఆ మహీపాలునియెడ గుణములతో అంతస్సంతుష్టుడైన రాజు తారావర్మ, తన కూతురు బంధుమతిని ఇచ్చి వివాహం చేసినాడు. అతనికి వేరే సంతానం లేనందువల్ల తన రాజ్యంలో సగ పాలిచ్చి రాజ్యభారాన్ని అప్పగించి అక్కడే సుఖంగా ఉన్నాడు.

మహీపాలుడు కూడా రాజ్యాన్ని అధివసించి, తన తండ్రికి, తన చెల్లెలికి ఉచితస్థానాల నిచ్చి యథాసుఖంగా ఉండిపోయినాడు.

ఒకసారి అతనితో తండ్రి చంద్రస్వామి ఏకాంతంగా ఇట్లన్నాడు: "మీ తల్లిని కొనిరావడానికి స్వదేశానికి వెడదాం రా. నీవు రాజువైనావు. ఈ సంగతి ఆమెకు తెలియవచ్చును. నీవు ఆమె నెలా మరచిపోయినావు? రాజ్యం నీకు లభించినదని తెలుసుకొని, తన్ను మరచిపోయినావని భావించి, క్రుద్ధురాలై, చిరకాల దుఃఖితురాలైన ఆమె నిన్నొకవేళ శపించినా శపించవచ్చు. మాతాపితృశప్తుడైన వాడెవ్వడూ సుఖపడలేడు. ఈ విషయంలో పూర్వం జరిగిన వణిక్పుత్రుని కథ నొకదానిని చెప్తాను విను:

## వర్తక కుమారుని కథ

ధవళపుర మనే నగరంలో చక్రుడు అను పేరుగల వణిక్పుత్రు డొక డున్నాడు. తలిదండ్రులకు ఇష్టం లేకున్నా అతను వర్తకంకోసం స్వర్ణద్వీపానికి వెళ్ళినాడు. అక్కడ ఐదేళ్ళుండి

అపార ధనాన్ని సముపార్జించుకొని రత్నపూరితమైన నౌకలో ఎక్కి సముద్రప్రయాణం సాగించినాడు. సముద్రంలో ఇంక కొంత దూరం వెళ్ళవలసి ఉండగా, పెను గాలివాన చెలరేగినది. సముద్రమంతా అల్లకల్లోలమైనది.

తలిదండ్రుల నితను అవమానించి ఎందుకిలా వచ్చినాడూ అన్న కోపంతోవలె మహాతరంగాలు అతని నౌకను భగ్నం చేసినవి. అందులోనున్న కొందరు నీటిలో మునిగి చనిపోయినారు. కొందరు మొసళ్ళవాత పడినారు. చక్రునిమటుకు వాని ఆయుర్బలంవల్ల తరంగాలు గట్టునకు త్రోసివేసినవి. అక్కడ నిస్సహాయుడై ఉన్న అతనికి స్వప్నంలోవలె రౌద్రనీలాకృతి గలవాడు, పాశహస్తుడు అయిన ఒక పురుషుడు కన్పించినాడు.

అతను ఇతనినెత్తుకొని, పాశంతో కట్టివేసి, దూరంగా సింహాసనస్థుడైన ఒక పురుషుడున్న సభలోనికి కొనిపోయినాడు. అతని ఆజ్ఞతో వణిక్కుమారుని ఆ పాశధారి లాగుకొనిపోయి లోహమయమైన గృహంలో ఉంచినాడు.

ఆ ఇంటిలోపల చక్రునకు ఒక పురుషుడు కన్పించినాడు. నిరంతరాయంగా అతని తలపై కాలుతున్న ఒక లోహ చక్రం తిరుగుతున్నది.

"ఎవరు నీవు? ఈ అశుభం నీ జీవితంలో ఎందుకేర్పడినది?" అని అడిగినాడు.

చక్రునితో అతనిట్లా అన్నాడు: "నా పేరు ఖడ్గుడు. నే నౌక వర్తక కుమారుడను. నేను తలిదండ్రుల మాట వినకపోయినందువల్ల కోపించి, నన్ను వారు శపించినారు. "మా తలమీద ఇనుప చక్రంవలె మమ్ములను పీడిస్తున్నందువల్ల ఓ దురా

చారుడా! నీకుకూడా ఇదే గతి పట్టుగాక! అని వారు. నేను దుఃఖి స్తుండగా "ఈ పీడ నీకు ఒక నెల మాత్రమే ఉంటుంది'' అని తిరిగి అన్నారు.

ఆ మాట విని నేను దుఃఖంతో పడుకొనే ఆ రోజంతా గడిపి నాను. రాత్రి స్వప్నంలోవలె ఒక భయంకర పురుషుని చూచి నాను. అతను బలవంతంగా నన్ను కొనిపోయి ఈ లోహమయ గృహంలో పడవేసినాడు. నా తలపై ఈ కాలుతున్న చక్రాన్ని తిరుగునట్టు చేసినాడు. ఇది నా పితృశాపం గనుక నా ప్రాణాలు మాత్రం పోవడం లేదు. వారు పెట్టిన నెల గడువూ పూర్తి అయి పోయినది. కానీ నాకు విముక్తి కలగలేదు" అని చెప్తున్న ఆ ఖడ్గునియెడ జాలిపడి చక్రుడిట్లా అన్నాడు.

"నేనుకూడా ధనార్థినై నా తలిదండ్రుల మాట వినలేదు. "నీకు వచ్చిన ధనమంతా నాశనమై పోతుం"దని వారు శపించి నారు. అందువల్ల ద్వీపాంతరంలో నేనెంతో కష్టపడి సంపాదించు కొన్న ధనం నష్టమై పోయినది. ఈ పరిస్థితిలో ఇంకొకచోటకూడా ఇలాగే జరుగవచ్చును. కాబట్టి నేను బ్రతికిమాత్రం ప్రయోజనం ఏమిటి? నీవు నీ తలపై తిరుగుతున్న చక్రాన్ని నా తలపై ఉంచు. నీ శాపం తొలగిపోవుగాక!'' అని అతను చెప్తుండగానే ఒక దివ్యవాణి ఇలా వినబడినది:

"ఓ ఖడ్గా! నీవు ముక్తుడవైనావు. ఆ చక్రాన్ని చక్రుని తలపై ఉంచు.''

ఆ మాటవినగానే చక్రుని శిరస్సుపై ఆ జ్వాలచ్చక్రాన్ని ఉంచి బయలుదేరగా ఏదో అదృశ్యశక్తి అతనిని తండ్రి ఇంటికి కొనిపోయినది.. అక్కడ అతను తిరిగి తలిదండ్రుల శాసనాన్ని ధిక్కరించకుండా ఉండిపోయినాడు.

చక్రుడేమో తనపై ఆ చక్రాన్ని మోసుకుంటూ అక్కడే ఉన్నాడు. "ప్రపంచంలోని పాతకులు తమ పాపాలనుంచి విముక్తులగుదురుగాక! ఆ పాపక్షయం అయిపోయేవరకు నా తలపై ఈ చక్రం తిరుగుతుండుగాక!" అని అంటున్న ఆ చక్రుని ధీరసత్త్వాన్ని ప్రశంసిస్తూ నభాస్థితులైన దేవతలు పుష్పవర్షం కురిపించి పరితుష్టులై ఇట్లన్నారు:

"సాధు! మహాసత్త్వా! సాధు! ఈ కరుణతో నీ పాపం హరించి పోయినది. నీ విక వెళ్ళవచ్చును. నీకు ధనం అక్షయంగా ఉంటుంది'' అని ఆ దేవత లనగానే అతని తలపై తిరుగుతున్న అయశ్చక్రం కనబడకుండా ఎక్కడికో పోయినది.

అప్పుడు ఆకసం నుంచి ఒక విద్యాధర కుమారకుడు వచ్చినాడు. అతనియెడ సంతుష్టుడై దేవేంద్రుడు పంపిన అమూల్యరత్న సంచయాన్ని ఇచ్చినాడు. ఆ చక్రుని తన ఒడిలో నుంచుకొని ధవళమనే అతని పట్టణానికి కొనిపోయి వదలిపెట్టి తన దారిన తాను పోయినాడు.

ఆ చక్రుడు తలిదండ్రుల దగ్గరకు వెళ్ళి బంధుజనమంతా సంతోషిస్తుండగా ఈ యావద్ వృత్తాంతాన్ని తెలియచెప్పి ధర్మపరిచ్యుతుడు కాకుండా ఉండిపోయినాడు.

ఈ విధంగా మహీపాలునికి చెప్పి చంద్రస్వామి తిరిగీ ఇట్లన్నాడు: "మాతాపితృ విరోధులకు ఇలాంటి పాపఫలం కలుగుతూ ఉంటుంది. వారి మీది భక్తి కామధేనువు వంటిది. ఇందుకొక కథ చెప్తాను విను:

## గర్విష్ఠి అయిన ముని, పతివ్రతల కథ

పూర్వం ఒకానొక ముని కలడు. అతను వనచారి. మహాతపస్సంపన్నుడు. అతనొక చెట్టునీడలో కూర్చొని ఉండగా ఆ

చెట్టుపైనున్న కొంగ రెట్టవేసినది. దానితో మహాక్రుద్ధుడై దాని వైపతను తేరి చూచినాడు. ఆ చూపుతోనే ఆ కొంగ భస్మమై పోయినది. అందుతో ఆ ముని తన తపఃప్రభావాన్ని చూచుకొని అహంకారి అయినాడు.

ఒకసారి ఆ ముని నగరంలోని ఒక బ్రాహ్మణ గృహానికి వెళ్ళినాడు. "భిక్షాం దేహి" అన్నాడు. "కాసేపుండు నాయనా, నా భర్తృ పరిచర్య పరిపూర్తి చేసివస్తాను" అని పతివ్రత అయిన ఆ గృహిణి అన్నది. అతనేమో అందుకు కోపించి తీవ్రంగా చూచినాడు. ఆమె నవ్వుతూ "ఓ మునీ! నేను కొంగను కాదు కాలిపోవడానికి" అన్నది.

ఆ మాటవిని అతను ఆశ్చర్యపడుతూ అక్కడే కూర్చున్నాడు. 'ఈమెకు ఈ సంగతి ఎలా తెలుసూ' అని ఆలోచిస్తున్నాడు.

ఆ తర్వాత తన భర్తకు అగ్నికార్యాదులలో తోడ్పడి శుశ్రూష చేసి, ఆ సాధ్వి భిక్షవేయడానికి మునివద్దకు వచ్చినది.

అతను అంజలి ఘటించి ఆమెతో ఇట్లన్నాడు: "పరోక్షంలో జరిగిన బలాక వృత్తాంతం మీ కెలా తెలిసినది? ఆ సంగతి ముందు చెప్తే తర్వాత భిక్ష తీసుకుంటాను" అన్నాడు.

ఆ మాటవిని ఆ పతిదేవత ఆ ఋషితో ఇట్లన్నది: "పతిభక్తి తప్ప మరొక ధర్మం నాకు తెలియదు. ఆ అనుగ్రహంతోనే ఇలాంటి విజ్ఞానం నాకు కలిగినది.

మరొక్క మాట: ఇక్కడ మాంసాన్ని విక్రయించి జీవించే ధర్మవ్యాధుని వద్దకువెళ్ళి దర్శించుకో. అందువల్ల నీకు శ్రేయస్సు నిరహంకారం కలుగుతుంది."

ఆ విధంగా సర్వవేది అయిన ఆ పతివ్రత చెప్పిన మాటలు విని, ఆ ఆతిథ్యం తీసుకొని ఆమెకు నమస్కరించి, ఆ ముని అక్కడినుంచి బయలుదేరినాడు.

మరునాడు ధర్మవ్యాధుని వెదుక్కుంటూ వెళ్ళి బజారులో మాంసం విక్రయించుకొంటున్న అతనివద్దకు చేరినాడు.

ధర్మవ్యాధుడు ఆ మునిని చూడగానే "ఓ మునీశ్వరా! ఆ పతివ్రత నిన్ను పంపినదా?" అని అడిగినాడు. ఆ మాట విని ఆశ్చర్యచకితుడై ధర్మవ్యాధునితో ఆ ముని ఇట్లన్నాడు :

"కేవలం మాంసం విక్రయించుకొనే నీకు ఈదృశమైన జ్ఞానం ఎలా కలిగినది?"

ఆ ప్రశ్నకు ధర్మవ్యాధు డిట్లా అన్నాడు:

"నేను కేవలం మాతాపితృ భక్తుడను. వారే నాకు సర్వస్వం. వారికి స్నానం చేయించి నేను స్నానం చేస్తాను. వారితో భోజనం చేయించిన తర్వాత నేను భోంచేస్తాను. వారు నిద్రించిన తర్వాత నేను నిద్రిస్తాను. ఇందువల్లనే నాకీ జ్ఞానం కలిగినది. ఇతరులు చంపి తెచ్చిన మృగాదుల మాంసాన్ని జీవనార్థం విక్రయిస్తాను. స్వధర్మ నిరతుడనై ఈ విక్రయం చేస్తున్నాను గానీ అర్థలోభినై కాదు.

జ్ఞానానికి విఘ్నం కల్గించేది అహంకారం. నేను, ఆ పతివ్రత దానికి దూరంగా ఉన్నాము. అందుకే మా జ్ఞానం నిర్బాధితంగా ఉన్నది. కాబట్టి నీవు కూడా అహంకారం నుండి విముక్తుడవై, పరిశుద్ధుడవై మునివ్రతాన్ని పాలించు. స్వధర్మపరుడవైతే నీవు పరంజ్యోతిని పొందగలవు."

ఈ విధంగా ధర్మవ్యాధుడు బోధింపగా అతని ఇంటికి వెళ్ళి అతని దినచర్యను చూచి తుష్టుడై ముని అరణ్యానికి వెళ్ళిపోయి నాడు. ఆ ముని ఆ ఉపదేశంతో సిద్ధుడైనాడు. వారు కూడా ఆ ధర్మచర్యతో సిద్ధిని పొందినారు.

కాబట్టి పతిభక్తి, పితృభక్తి, మాతృభక్తి ప్రభావం ఇలాంటిది.

ఇక—మీ తల్లి నిన్ను చూడాలని పరితపిస్తూ ఉంటుంది. ఆమెను వెళ్ళి చూతాం పద," అని చంద్రస్వామి మహీపాలునకు చెప్పినాడు.

అతనుకూడా తల్లి అనురోధంతో స్వదేశానికి వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాడు.

ధర్మపిత అయిన అనంతస్వామికి ఈ సంగతి తెలియజేసి, ఆయనకు రాజ్యభారాన్ని అప్పగించి, తండ్రితో కలిసి అక్కడి నుంచి బయలుదేరినాడు.

క్రమంగా స్వదేశానికి వచ్చి తల్లిని దర్శించి వసంతం కోకిలను వలె అతడామెను ఆనందింపజేసినాడు. కొంతకాలం మహీపాలుడక్కడ బాంధవ సత్కృతుడై ఉండినాడు. తల్లితో పాటూ తండ్రి గతవృత్తాంతాన్నంతా చెప్తుండగా కాలం గడిపి నాడు.

అక్కడ తారాపురంలో ఆయన భార్య అయిన రాకుమారిక తెలవారే సరికి నిద్రనుంచి మేల్కొన్నది. తన పతి ఎక్కడికో వెళ్ళిపోయెనని గమనించి విరహ విహ్వల అయి ప్రాసాదంలో గానీ, ఉపవనాదులలోగానీ ఎక్కడికి వెళ్ళినా సంతృప్తిని చెం

లేక పోయినది. తన హారం ద్విగుణితమౌనటుగా బాష్పధార కారగా రోదిస్తూ, ఒకే విధంగా పలవరిస్తూ మృత్యువులోనే సుఖ శాంతులు పొందవలెనని అనుకున్నది.

అప్పుడు "ఏదో పనిమీద పోతున్నానని, త్వరలోనే వత్తునని నీ పతి చెప్పి వెళ్ళినాడు. నీవు దుఃఖించవలసిన అవసరం లే"దని ఆశావహమైన మాటలతో అనంతస్వామి ఓదార్చినాడు. ఆ మంత్రి ఓదార్చగా అతికష్టంమీద ఆమె గుండెదిటవు చేసుకొన్నది.

ఆ తర్వాత దేశాంతరగతుడైన భర్త పోవడిని తెలుసుకొనుటకై ఎప్పుడూ పూజలుచేస్తూ బ్రాహ్మణులను దానాలతో సంతృప్తి పరుస్తున్నది.

సంగమదత్తుడనే పేరుగల దీనుడైన ఒక విప్రుడు దానం కోసంరాగా, తన భర్త పేరూ, ఊరూ మొదలైన వివరాలనన్నిటినీ చెప్పి, ఆయన సంగతి అడిగినది.

అప్పుడా మాటకు అతను, అలాంటి వాడెవడూ తనకు కనబడలేదని, అయినప్పటికీ అధైర్యపడవలసిన అవసరం లేదని, శుభకార్యాలుచేస్తే అభీష్ట సంయోగం కలగగలదని అన్నాడు. అయినా తాను చూచిన ఒక ఆశ్చర్యకరమైన దృశ్యాన్ని చెప్తాను వినుమని ఇలా చెప్పసాగినాడు.

"నేను తీర్థయాత్రలు చేస్తూ హిమాద్రిలోని మానససరస్సునకు వెళ్ళినాను. అక్కడ అంతర్మణిమయమైన అద్దంలాంటి గృహాన్ని చూచినాను. అ ఇంటిలోనుంచి ఖడ్గపాణి అయిన ఒక పురుషుడు హఠాత్తుగా బయటికి వచ్చి సరస్తీరం పైనికెక్కి దివ్య నారీమణులతో కలసినాడు. వారితోపాటూ ఆ ఉద్యానంలో విహ

రించి, పానగోష్ఠిలో వినోదించినాడు. దూరంనుంచే నేను కుతూహలంతో వారికి కనబడకుండా ఇదంతా చూడసాగినాను.

అంతలో ఎక్కడినుంచో ఒక సుభగుడైన మరొక పురుషుడు వచ్చి కలవగా అతనికి నేను చూచినదంతా వివరించాను. దూరంనుంచే కుతూహలం కొద్దీ ఆ నారీసహితుడైన ఆ పురుషుని చూపించినాను. చూచిన వెంటనే అతను తన వృత్తాంతాన్ని నాకు ఇలా చెప్పసాగినాడు :

"త్రిభువన మనే పేరుగల నగరంలో త్రిభువనుడనే రాజు కలడు. అక్కడ చాలకాలం నాకు సేవచేస్తూ ఒక పాశుపతుడు (శైవులలో ఒక వర్గం) ఉన్నాడు.

(ఇక్కడ ఒక శ్లోకం మూలంలోనే పోయినది.)

ఒకసారి ఎందుకు నాకిలా సేవచేస్తున్నావని అడుగగా బిల ఖడ్గ ప్రసాధనంకోసం తనకు సాయపడవలసిందని ప్రార్థించినాడు. నేను దానికి అంగీకరించినాను.

ఆ తర్వాత నాతోపాటూ అతను అరణ్యంలోకివెళ్ళి రాత్రి పూట హోమాదులను చేసి ఒక బిలాన్ని కన్పింపజేసి ఆ పాశుపతుడు నాతో ఇట్లా అన్నాడు:

"ఓ వీరుడా! నీవు ముందు లోనికి వెళ్ళు. ఖడ్గాన్ని తీసుకొని తిరిగి బయటికి వచ్చి నన్ను లోన ప్రవేశపెడతానని మాట ఇవ్వు."

ఆ మాటకు 'సరే' నని మాట ఇచ్చి ఆ వివరంలో ప్రవేశించినాను. అక్కడ ఒక రత్నమయమైన గృహం కానవచ్చినది. దానిలోనుంచి ఒక ప్రధాన అసురకన్యక బయటికివ

ప్రేమతో ఆ ఇంటిలోనికి నన్ను ప్రవేశపెట్టి నాకొక ఖడ్గ మిచ్చి నది.

"ఈ ఖడ్గం సర్వసిద్ధిప్రదమైనది. ఆకాశగమనం చేకూర్చు నది" అని ఆమె చెప్పగా ఆమెతో అక్కడ ఉన్నాను. తర్వాత జ్ఞాపకం వచ్చి ఆ ఖడ్గాన్ని చేతపట్టుకొని, బిలంలోనుంచి బయటికి వచ్చి ఆ పాశుపతుని ఆ అసురమందిరం లోనికి ప్రవేశపెట్టినాను.

అక్కడ పరివారంతో కూడిన ఆ మొదటి అసురకన్యతో నే నుండిపోగా, అతను రెండవ అసురకన్యతో ఉండిపోయినాడు.

ఒకసారి నేను తాగిన మత్తులోనుండగా ఏదో మిషపై ఆ పాశుపతుడు గబాలునవచ్చి నా ప్రక్కనున్న ఖడ్గాన్ని అపహ రించి తన చేత పట్టుకొన్నాడు. అది తన చేతికి రాగానే మహా సిద్ధి కలిగి, చేతితో నన్ను పట్టుకొని బిలంలోనుంచి బయటకు పార వేసినాడు.

అంతట ఆ బిలముఖం వద్దనే అత నెప్పుడైనా బయటికి రాగలిగితే పట్టుకోవచ్చునని వెదుకుతూ నేను పన్నెండేళ్ళు గడిపి నాను.

ఆ శఠుడే నా కిక్కడ దృష్టిగోచరుడైనాడు. నాకు చెందిన ఈ అసురకన్యతో క్రీడిస్తున్నాడు."

ఆ త్రిభువనరాజు నాతో ఏదో కబుర్లు చెబుతున్నాడు. అంతలోనే తాగిన మత్తుతో ఆ పాశుపతుడు నిద్రపోయినాడు.

అత డలా నిద్రపోతుండగా అతని ప్రక్కనే ఉన్న ఖడ్గాన్ని రాజు చేతికి తీసుకొని తిరిగీ దివ్యప్రభావ సంపన్నుడైనాడు.

ఆ తర్వాత ఆ పాశుపతుని కాలితో తన్ని నిద్రలేపి వానిని దండించి, ఆ ఆపన్నుని చంపకుండా వదలివేసినాడు. తిరిగి సపరివారంగా ఆ అసురపురంలోనికి ఆ రాజు ప్రవేశించినాడు. ఆ సిద్ధి మూలంగానే తొలి అసురకన్యతో పాటూ లోనికి వెళ్ళిపోయినాడు.

సిద్ధిభ్రష్టుడైన పాశుపతుడు కష్టాల పాలైనాడు. కృతఘ్నులు చిరసిద్ధార్థులైనప్పటికీ తుదకు భ్రష్టులు కావడం తథ్యం కదా!

—దీని నంతటినీ నేను సాక్షాత్తూ నా కళ్ళతో చూచి, దేశాటనం చేస్తూ ఇక్కడికి వచ్చినాను. కాబట్టి ఓ దేవీ! కొంత ఆలస్యమైనా ఆ త్రిభువనునకు కలిగినట్టే నీకూ తప్పక ప్రియసంయోగం కలుగగలదు. మంచిచేసిన వా డెప్పటికీ చెడిపోడు.''

ఈ విధంగా ఆ ద్విజుడు చెప్పగా విని, దేవి బంధుమతి సంతోషం చెందినది. ఆ విప్రునకు కావలసినంత ధనమిచ్చి కృతార్థుని చేసినది.

ఆ మరునాడు మరొక విప్రుడు దూరదేశం నుంచి వచ్చినాడు. అతనినికూడా ఆ బంధుమతి ఉత్కంఠతో ఆనవాళ్ళన్నీ చెప్పి తన భర్త విషయమేమైనా తెలుసునా అని ఆ బ్రాహ్మణుని అడిగినది.

"దేవీ, ఎక్కడా ఆయన నాకు కన్పించలేదు. అయితే సుమనుడనే సార్థకనామధేయుడనైన నేను మీ ఇంటికి ఇప్పుడు వచ్చినాను. నీకు త్వరలోనే సౌమనస్యం చేకూరగలదని నా మనసు చెబుతున్నది. చిరకాలం విడిపోయిన వారికికూడా పున

స్సంయోగం కలిగే తీరుతుంది. ఈ విషయంలో నేనొక కథను చెప్తాను విను.

## నల దమయంతి కథ

పూర్వం నిషధాధిపతి అయిన నలుడనే చక్రవర్తి కలడు. ఇతని రూపంతో నిర్జితుడైన కాముడు అవమానంతో త్రిపురారి నేత్రాగ్నిలో తన తనువును హవనం చేసుకొన్నా డనుకుంటాను.

అవివాహితుడైన ఆయన, సదృశురాలైన భార్యకోసం వెదకుతూ విదర్భాధిపతి అయిన భీముని కుమార్తె దమయంతి కలదని విన్నాడు.

భీమరాజుకూడా తన కూతునకు సదృశుడైన పతికోసం భూమినంతా వెదుకుతూ, నలునికంటే మరొకడు లేడని తెల్సుకొన్నాడు.

ఈలోగా తన నగరంలో ఒక సరోవరంలోనికి జలక్రీడార్థమై దమయంతి వెళ్ళి అందులో దిగినది. అక్కడ ఒక రాజహంసను చూచినది. అది కలువలను, తామరలను విరుచుకొని తింటున్నది. ఆ కన్యక యుక్తిగా తన ఉత్తరీయాన్ని దానిపై వేసి వినోదార్థం బంధించినది.

బందీ అయిన ఆ దివ్యహంస మానవభాషలో ఇట్లన్నది: "రాజపుత్రీ! నీకు ఉపకారం చేస్తాను. నన్ను వదిలిపెట్టు. నీ మనసులో సద్గుణగుంఫితమైన హారంవలె తమ హృదయంపై దివ్యాంగనలుకూడా వహించే నైషధుడైన నలుడను రాజు కలడు. నీ వతనికి తగిన భార్యవు. అతను నీకు తగిన భర్త. ఈ తుల్యసంయోగంకోసం మీ ఇద్దరిమధ్య నేను కామదూతగా పనిచేస్తాను."

ఆ మాట విని నిజమే చెప్తున్నదని అలాగేనని దమయంతి ఆ దివ్యహంసను వదలివేసినది. 'నేను నలుని తప్ప మరొకరిని వరించ' ననికూడా చెప్పినది. తన శ్రుతిమార్గంలో ప్రవేశించిన ఆయనతో అపహృతచిత్త అయినది.

ఆ హంస వెంటనే నిషధదేశానికి వెళ్ళినది. అక్కడ, నలుడు జలక్రీడలాడే సరసులో దిగినది. ఆ నలమహారాజు మనోహర మైన ఆ రాజహంసను చూచి కుతూహలంతో విలాసంగా తన ఉత్తరీయాన్ని దానిపై వేసి కట్టివేసినాడు.

అప్పుడా హంస ఇట్లన్నది: "రాజా! నన్ను విడిచివుచ్చు. నీకు ఉపకారం చేయడంకోసమే ఇక్కడికి వచ్చినాను. నేను చెప్పే మాట విను. విదర్భదేశంలో భీమరాజు కూతురు భూలోక తిలో త్తమ వంటిది, దేవతలకుకూడా అపేక్షణీయ అయినది - దమయంతి అను కన్య కలదు. ఆమె నీ గుణములు వర్ణింపగా విని నీపై బద్ధానురాగ అయి నిన్ను వరించినది. ఆ సంగతిని నీకుకూడా చెపుదామని వచ్చినాను.''

సత్ఫలాలవలె ఉజ్జ్వలాలైన ఆ మాటలతో కామబాణాలతో వలె నలుడు ఆవిద్ధుడైనాడు.

ఆ హంసతో ఇట్లన్నాడు: "విహగోత్తమా! ధన్యుడను. మనోరథ సంపత్తి మూర్తి గొన్నట్టు నన్నామె వరించినది" అని చెప్పి అతను వదలిపెట్టగా తిరిగివెళ్ళిదమయంతికి ఈ వృత్తాంతం యథాక్రమంగా చెప్పి ఆ హంస తన దారిన తాను పోయినది.

దమయంతికూడా ఉత్కంఠితురాలై మాతృముఖంగా ఉపా యంతో నలప్రాప్తికోసమై స్వయంవరం ప్రకటించవలెనని తండ్రికి తెలియజేసినది. అతనందుకు సరే నన్నాడు.

తన కుమార్తె స్వయంవరమని భూలోకంలోని రాజులందరకూ భీమమహారాజు దూతలను పంపించినాడు. ఆ దూతలు వెళ్ళిన రాజులందరూ విదర్భకు బయలుదేరినారు. నలుడుకూడా ఉత్సుకుడై రథారూఢుడై బయలుదేరినాడు.

అంతట ఈ నల దమయంతీ స్వయంవరం సంగతి నారదుని ద్వారా ఇంద్రాదులైన లోకపాలురుకూడా విన్నారు. ఇంద్ర వాయు అగ్ని యమ వరుణాదులు తమలో తాము సంప్రతించుకొని దమయంతిమీది ఆశతో నలుని దగ్గరకే వెళ్ళినారు.

విదర్భకు వస్తూ దారిలో ఉన్న నలునిచేరి, ఆయన ప్రణమిల్లగా ఇట్లా కోరినారు: "రాజా! నీవు వెళ్ళి మా వచనంగా దమయంతితో ఇలా చెప్పవలసింది. 'మర్త్యుడైన నలునితో పని ఏమిటి? మా ఐదుగురిలో ఎవరినో ఒకరిని వరించు. మర్త్యులు మరణధర్ములు. త్రిదశులు అమరులు అని చెప్పు. మా వరంవల్ల ఆమె పార్శ్వానికి నీవు అదృశ్యుడవై వెళ్ళగలవు.''

ఈ మాటవిని దేవాజ్ఞను శిరసావహించి నలుడు దమయంతి అంతఃపురంలోనికి ప్రవేశించి అదృశ్యుడై, వారు చెప్పినట్టే దేవ సందేశాన్ని ఆమెకు వినిపించినాడు.

ఆ మాటవిని ఆ సాధ్వి "దేవతలు గొప్పవారే కావచ్చు. అలాగే కానీ! అయినప్పటికీ నాకు నలుడే భర్త. త్రిదశులు నన్నాశింపరాదు'' అని ఖరాఖండిగా చెప్పగా ఆ మాటవిని తన్నెరుక పరుచుకొని నలుడు తిరిగివెళ్ళి ఆమె చెప్పిన మాటలనే వారికి విన్పించినాడు.

అతను నిజమే చెప్పెనని అతనికి తాము వశులమైతిమని, స్మరణమాత్రంతో సాక్షాత్కరించగలమని చెప్పి ఇంద్రాదులు సంతుష్టులై నలునకు వరాలిచ్చి వెళ్ళిపోయినారు.

ఆ తర్వాత నలుడు సంతుష్టుడై విదర్భకు వెళ్ళినాడు. దమయంతిని వంచింపవలెనని ఇంద్రాదులు తాముకూడా నల రూపాన్నే ధరించినారు. భీమరాజు మహాసభకు వెళ్ళి మానవ రూపాలతో ఆ స్వయంవరంలో నలుని ప్రక్కనే కూర్చున్నారు.

అంతట దమయంతి తన అన్నతోపాటూ సభలోనికి వచ్చి ఒక్కొక్క రాజునుగూర్చి అతను వివరిస్తుండగా, ఒకొరొకరిని దాటి వెడుతూ క్రమంగా నలుని దగ్గరకు వచ్చినది.

అక్కడ ఛాయానిమేషాది గుణాలుగల ఆర్గురు నలమహా రాజులను చూచినది. అన్న సముద్భ్రాంతుడుకాగా, ఆమె వ్యాకులత చెంది ఇలా తలపోసుకొన్నది: "నిజంగా ఆ ఐదుగురు లోకపాలురూ ఏదో మాయచేసినారు. ఆ ఆరవవాడే నలుడను కొంటాను. ఇంకొక మార్గాంతరం నాకు లేదు" అని ఆలోచించి ఆ పతివ్రత నలైకాసక్త మనస్క అయి ఆదిత్యునికి అభిముఖురాలై ఇట్లన్నది:

"ఓ లోకపాలులారా! నలుని మీద తప్ప స్వప్నంలోకూడా నాకు మరొకరిపై మనసు పోలేదు. అదే నిజమైతే మీరు మీ స్వ స్వరూపాలను బయల్పరచండి.

పూర్వమే వరించిన వరుడుతప్ప కన్యకు ఇతరులందరూ పరపురుషులే. ఆమె వారందరకూ పరసతి. అలాంటప్పుడు మీకీ మోహ మేమిటి?"

ఈ మాట విన్న ఇంద్రాదులైదుగురూ తమ స్వస్వరూపాలతో కన్పించినారు. నిజమైన నలుడు స్వస్వరూపంతో కన్పించినాడు. ఆయన మెడలోనే ఆ దమయంతి ఫుల్లేందీవర సుందర

మైన వరణమాలను సంతోషంతో వేసినది. ఆకాశం నుంచి పుష్ప వృష్టి కురిసినది.

అంతట భీమ మహారాజు నల దమయంతులకు వివాహ శుభకార్యం జరిపించినాడు.

విహితోచితాలైన పూజలను భీమరాజుతో పొంది, వచ్చిన రాజులు, ఇంద్రాది దేవతలు వెళ్ళిపోయినారు.

ఇంద్రాదులు దారిలో కలి, ద్వాపరాలను చూచినారు. వీరు దమయంతి కోసమై వచ్చినారని తెలుసుకొని వారిట్లా అన్నారు: "విదర్భదేశానికి వెళ్ళవలసిన పనిలేదు. అందుకనే మేము వచ్చినాము. స్వయంవరం జరిగిపోయినది. దమయంతి నలుని వరించినది."

ఈ మాటవిని ఆ పాపాత్ములైన కలి, ద్వాపరం కోపంతో ఇట్లన్నారు: "మీవంటి దేవతలను వదిలిపెట్టి ఆమె మర్త్యుని వరించినది. కాబట్టి తప్పకుండా వారిద్దరికీ వియోగం కలిగేటట్టు చేస్తాము" అని ప్రతిజ్ఞచేసి వారిరువురూ వెనుదిరిగి వెళ్ళిపోయినారు.

నలుడు అత్తగారింటిలో ఏడు రోజులు ఉండి, నవ వధువైన దమయంతితో పాటూ కృతార్థుడై నిషధకు వచ్చివేసినాడు.

వారిరువురూ అక్కడ గౌరీశంకరులవలె అత్యంత ప్రేమతో నివసించినారు. ఈశ్వరునకు గౌరి దేహార్ధమైతే, నలునకు దమయంతి ఆత్మయే అయినది.

కాలక్రమేణా వారికి చంద్రసేను డనే కుమారు డుదయించినాడు.

కలి, తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనవలెనని శాస్త్రానువర్తి అయిన నలుని విషయంలో ఏదో ఛిద్రంకోసం చిరకాలం అన్వేషిస్తూ వచ్చినాడు.

అలా ఉండగా ఒకసారి నలుడు సంధ్యావందనం చేయకనే, కాళ్ళు కడుగుకొనకనే త్రాగిన మత్తుతో స్మృతిహీనుడై నిద్ర పోయినాడు.

ఈ ఛిద్రం దొరికీ దొరకగానే రాత్రింబవళ్ళూ దానికయ్యే వేచి ఉన్న కలి ఆ నలుని శరీరంలోనికి ప్రవేశించినాడు. నలదేహా విష్టుడైన కలి మూలంగా ధర్మవిహితమైన ఆచారాన్ని వదలి నలుడు స్వేచ్ఛాచారి అయినాడు.

జూదమాడినాడు. దాసీలతో రమించినాడు. అబద్ధాలాడినాడు. పగలు నిద్రించినాడు. రాత్రిపూట మేల్కొన్నాడు. అకారణంగా కోపపడుతూ వచ్చినాడు. అన్యాయంగా ద్రవ్యాన్ని తీసుకొన్నాడు. సత్పురుషులను అవమానించినాడు. దుష్టులను సమ్మానించినాడు.

అతని సోదరుడైన పుష్కరుని శరీరంలోనికి, అలాగే అతను సత్పథచ్యుతుడు కాగా, ఛిద్రం దొరికినంతనే ద్వాపరుడు ప్రవేశించినాడు.

ఒకానొకసారి పుష్కరుని ఇంటిలో నలుడు దాంతం అను పేరుగల సుందరమూ, ధవళమూ అయిన వృషభాన్ని చూచినాడు. లోభంతో దానిని తెచ్చి తన అన్న అయిన నలునకు, ద్వాపర గ్రస్తుడైన పుష్కరుడు చూపినాడు. "ఈ వృషభంపై నీకు వాంఛ ఉంటే నాతో జూదమాడి వెంటనే దీనిని గెలుచుకో."

ఆ మాటవిని నలుడు మోహంతో అందు కంగీకరించినాడు. ఆ తర్వాత ఆ అన్నదమ్ము లిద్దరి మధ్య జూదం నడిచినది.

పుష్కరుడేమో ఆ వృషభాన్ని పందె మొడ్డినాడు. నలుడేమో ఏనుగులు మొదలైన వానిని పణం పెట్టినాడు. పుష్కరుడు గెలుస్తూ వచ్చినాడు నలుడు ఓడిపోతూ వచ్చినాడు.

రెండు మూడు రోజులలో తన బలగమూ, కోశమూ కూడా జూదంలో ఓడిపోయినప్పటికీ, అందరూ వారిస్తున్నప్పటికీ, కలి గ్రస్తుడైన నలుడు జూదాన్ని ఆపలేదు. అందువల్ల రాజ్యమంతా పోయినట్టు తుదకు తెలుసుకొని దమయంతి, కుమారుని ఒక రథంపై నెక్కించి తన పుట్టినింటికి పంపివేసినది.

ఈలోగా తన రాజ్యం సంపూర్ణంగా పోగా నలునితో పుష్కరుడు ఇట్లన్నాడు: "నీకున్నదంతా నా పరమైనది. కాబట్టి దమయంతిని ఇప్పుడు జూదంలో ప్రతిపణంగా పెట్టవలసినది."

ఆ వాక్య ప్రభంజనంతో నలుడు అనలునివలె ప్రజ్వలించి, అకాలంలో ఏమీ అనకూడదని మానివేసి ఇక పణం ఒడ్డడం ఆపి వేసినాడు.

అప్పుడు పుష్కరుడు "నీవు నీ భార్యను పణంగా ఒడ్డక పోతే ఆమెతో పాటూ నా దేశంనుంచి వెళ్ళిపోవలసినది" అన్నాడు.

ఆ మాట వినగానే నలుడు దమయంతితో పాటు బయలు దేరి, పొలిమేరదాకా రాజభటులు వచ్చి బయటికి పంపివేయగా దేశాంతరగతుడైనాడు.

కలి మాహాత్మ్యం వల్ల నలునివంటి వానికే ఇంతటి దురవస్థ కలుగగా క్రిములవంటి ఇతర మానవుల సంగతేమిటి? రాజర్షులవంటి ఇలాంటి వారి విషయంలో కూడా, కలి ద్వాపర గ్రస్తమై తమ జీవితంలో ద్యూతం విపత్తులకు ఆస్పద మయిందంటే ఇంకే మనుకోవాలి?

ఆ తర్వాత తమ్ముడు, ఐశ్వర్యమంతటినీ అపహరింపగా, నలుడు దమయంతితో పాటూ దేశాలుపట్టి వెడుతూ, క్షుధాక్రాంతుడై ఒక వనాంతరంలో ప్రవేశించినాడు. దారిలో దర్భలు గ్రుచ్చుకొని లలితాలైన తన పాదాలను గాయపరచగా దమయంతి ఎలాగో ఆయనతో పాటూ నడిచినది. తుదకు నలుడు ఒక సరస్తీరంలో ఆమెతో పాటూ విశ్రమించినాడు.

అప్పుడక్కడికి రెండు హంసలు వచ్చినవి. ఆహారార్థం వానిని పట్టుకొనుటకై ఉత్తరీయాన్ని వాటిపై నలుడు వేసినాడు. అవి ఆ ఉత్తరీయాన్నే ఎత్తుకొని ఎగసిపోయినవి.

అప్పుడు ఆకసంనుంచి —రెండు హంసలూ రెండు పాచికలని, అవి ఆ రూపంలోవచ్చి అతని బట్టలను కూడా కొనిపోయెనని ఒక వాణి వినవచ్చినది. అలా ఏకవస్త్రంతోనే కూర్చొని యుక్తితో విమనస్కుడై, దమయంతికి ఆమె తండ్రి ఇంటికి వెళ్ళే మార్గం ఇదీ అని చూపించినాడు. మరొక దారిని చూపి ఇది కోసలదేశానికి వెడుతుందని అన్నాడు.

ఆ మాటవిని దమయంతి సంశయించినది. "నన్నేదో వదిలి వేస్తున్నట్టుగా ఈయన నాకు దారి చూపుతున్నాడేమిటి?" అనుకున్నది.

అంతట రాత్రి కాగా ఫలమూలాదులను ఆహారం చేసుకొన్న ఆ దంపతులు అలసిపోయి ఒక దర్భాస్తరణంపై కూర్చున్నారు. నడిచి నడిచీ అలసిపోయినందువల్ల దమయంతి మెల్లగా నిద్రలోనికి జారిపోయినది. నలుడు ఎక్కడికో వెళ్ళిపోదామన్న బుద్ధితో కలిమోహితుడై మేల్కొనే ఉన్నాడు.

ఆ తర్వాత లేచి ఏకవస్త్ర అయిన దమయంతిని వదిలివేసి ఆమె ఉత్తరీయాన్ని సగానికి చించి కప్పుకొని అక్కడి నుంచి బయలుదేరినాడు. దమయంతి, తెలవారుతుండగా మేల్కొని తన భర్త కనబడకపోవడంతో, తన నతను వదలిపోయెనని భావించి విలపించినది. చింతించినది.

"ఆర్యపుత్రా! మహాసత్త్వా! శత్రువులనుకూడా దయతో చూచేవాడివే! నా మీద అంత ప్రేమగలవాడవు, ఇలా నిర్దయుడవైనా వెందుకు? ఏకాకిగా ఈ అడవులలో ఎలా నడిచిపోగలవు? నీ శ్రమాపనోదనార్థమై నీకు పరిచర్య చేసేవారెవ్వరు? మహారాజుల మౌళిమాలా పరాగంతో రంజితాలైన మీ పదాలు ఏ దారిని బడితే ఆ దారిలో ధూళి ధూసరితా లెలా అవుతాయి? హరిచందన చూర్ణంతోనే అలదినా ఓర్చుకొనలేని నీ శరీరం మధ్యాహ్న సూర్యాతపాన్ని ఎలా సహింపగలదు.

బాలకుడైన పుత్రునితో నా కేమిటి పని? కూతుతో నేమి పని? అసలు నాతో నాకేమి పని? నేను పతివ్రతనే అయితే నీ ఒక్కనికీ దేవతలు సుఖం చేకూర్చుదురుగాక!" అని శోకిస్తూ దమయంతి నలునిగూర్చి వాపోతూ అంతకు పూర్వం ఆయనే చూపెట్టిన దారిలో బయలుదేరినది?

కొంతదూరం వెళ్ళిన తర్వాత నదీశైల వనాటవుల నెన్నింటినో దాటినది. కానీ తన భర్తమీది భక్తిమాత్రం ఎన్నడూ అతిక్రమించలేదు. దారిలో ఒక లుబ్ధకుడు ఆమెపై మనసుపడి అడ్డుపడి, ఆమె సతీతేజంతో ఒక క్షణంలో భస్మీభూతుడైనాడు.

ఆ తర్వాత దైవవశాత్తూ వర్తకుల బిడారొకటి దారిలో కలుసుకొనగా ఆమె వారితో చేరి సుబాహు మహారాజు పట్టణం

చేరుకున్నది. దూరం నుంచి వస్తుండగానే ఆ సమయంలో హర్మ్య స్థలంపై నిలుచున్న రాకుమార్తె ఆ దమయంతీ సౌందర్యానికి ముగ్ధురాలై పిలిపించుకొని తన తల్లికి ఆమెను బహూకరించినది.

ఆ మహాదేవి పార్శ్వంలో ఆమె ఆదరంతో చూస్తుండగా దమయంతి ఉండిపోయినది. తన్ను భర్త విడిచి పోయెనని మాత్రమే ఆమె అడుగగా చెప్పినది.

ఇంతలో దమయంతి తండ్రి భీమమహారాజు నలుడెక్కడో వెళ్ళినన్న వృత్తాంతాన్ని విని, ఆ దంపతుల అన్వేషణార్థమై మనుష్యులను దిక్కు దిక్కులకు పంపించినాడు. వారిలో సుషేణు డనే అతని మంత్రి ఒకడు తిరుగుతూ బ్రాహ్మణ వేషంతో సుబాహు రాజధానిని చేరుకున్నాడు.

అక్కడ దమయంతినే సర్వదా వెదుకుతూ ఉన్న అతనిని ఆమె చూచి దుఃఖించినది అన్యోన్యం గుర్తించుకొని ఒక చోట కలుసుకొని దుఃఖిస్తూ ఉండగా సుబాహురాణి కనుగొన్నది. వారిని పిలిపించి యథార్థం వివరింపమని కోరగా ఆమె తన సోదరీ పుత్రిక దమయంతి అని తెలుసుకొన్నది.

అంతట ఆ విషయాన్ని భర్తకు తెలియజేసి సత్కరించి తండ్రి ఇంటికి రథంపై ఎక్కించి, సుషేణునితో పాటూ కావలసి నంత మంది సైనికులనుకూడా ఇచ్చి పంపివేసినది.

అక్కడ దమయంతి తన పిల్లలను కలుసుకొని, తండ్రి తన భర్త జాడను తెలుసుకొనదలచి వెదకిస్తుండగా అక్కడే ఉండి పోయినది.

ఆమె తండ్రి ఆమె భర్తను వెదకుటకై చారులను పంపి నాడు. నలుడు మంచి పాకశాస్త్ర నిపుణుడనీ, రథ విద్యలో నిపు ణుడని ఈ రెండింటివల్ల గుర్తించవలసిందని వారికి చెప్పినాడు.

"ఓ చంద్రుడా! అడవిలో నిద్రిస్తుండగా బాలను, కుముదినీ కాంతను వదలిపెట్టి అంబర ఖండాన్ని తీసుకొని ఓ నృశంసా! నీ వెక్కడికి అదృశ్యుడవై వెళ్ళిపోయినావు?"

"బాలాం వనే ప్రసుప్తాం
నృశంస! సంత్యజ్య కుముదినీకాంతామ్,
ప్రాప్యాంబరఖండం చంద్ర!
అదృశ్యః క్వ యాతోఽసి!''

ఈ మాటలను అతను ఉన్న చోటు అని అనుమానించి నప్పుడు చెప్పవలసింది" అని వారిని ఆదేశించినాడు.

ఈలోగా నలమహారాజు ఆ మహారణ్యమధ్యంలో, నడిరేయి సగం చించిన చీరను కప్పుకొని, దూరంగా వెళ్ళిపోయి నాడు. అక్కడ అతనికి దావాగ్ని ఎదురైనది.

"ఓ మహాసత్త్వుడా! ఈ దావాగ్ని నన్ను దహించేలోగా అబలుడనైన నన్ను ఈ అగ్ని సమీపంనుంచి తప్పించవలసినది" అన్న మాటలు వినబడగా తేరిపారచూచినాడు.

అక్కడ చుట్ట చుట్టుకొని ఆ దావాగ్నికి సమీపంలో నాగుబాము ఒకటి కన్పించినది. దాని పడగమీది రత్నప్రభాజాలం వనవహ్నితో మరింత ప్రకాశించినది. తలమీద గట్టి కత్తిదెబ్బ వేసినట్టుగా అది కానవస్తున్నది.

దానిని సమీపించి జాలితో భుజంపై వేసుకొని, దూరంగా తీసుకొని వెళ్ళి దానిని వదలివేయనుండగా ఆ సర్పం ఇలా అన్నది:

"నన్నిక్కడ నుంచి సరిగ్గా పది అడుగులు ఎంచుకుంటూ వెళ్లి వదలిపెట్ట''మని కోరినది. అతను అడుగులు ఎంచుకొంటూ నడచినాడు. ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు,

ఎనిమిది, తొమ్మిది, పది అని చెప్పేలోపల భుజంమీదనున్న ఆ నాగసర్పం నలుని లలాటంపై కాటువేసినది. అందుతో అతను పొట్టి చేతులు కలవాడు, నల్లని వాడు, వికృత రూపుడు అయి పోయినాడు.

అప్పుడు దానిని క్రిందికి దింపి రాజిలా అడిగినాడు: "నీ వెవ్వరవు? నే నుపకారం చేయగా నీవు చేసిన ప్రత్యుపకార మేమిటి?"

ఈ నలుని మాటను విని ఆ నాగు ఇలా చెప్పినది: "ఓ రాజా! నేను కార్కోట నాము డను నాగరాజును. నీ మంచికే నిన్ను కరిచినాను. అది నీకు తర్వాత తెలుస్తుంది. గుప్తంగా నివసించే గొప్పవారికి విరూపత కార్యసిద్ధికి కారణమౌతుంది. నే నిచ్చే అగ్నిశౌచమనే ఈ బట్టల జతను తీసుకో. వీటిని కావలసి నప్పుడు ధరిస్తే నీ స్వస్వరూపం వస్తుంది" అని చెప్పి ఆ వస్త్ర యుగ్మం ఇచ్చి కార్కోటకం వెళ్ళిపోయినది.

ఆ తర్వాత నలుడు ఆ వనంనుంచి క్రమంగా వెళ్ళి కోసల దేశాన్ని చేరుకొన్నాడు. ఆ దేశాధిపతి అయిన ఋతుపర్ణ మహా రాజువద్ద ఆ హ్రస్వబాహు నామకుడైన ఆ నలుడు వంటవాడుగా చేరినాడు. దివ్య రసోపేతాలైన భోజనాలను ఆయనకు సమ కూర్చేవాడు. అలాగే రథ విజ్ఞానంవల్లకూడా అక్కడ ప్రసిద్ధుడై నాడు.

అతనలా అక్కడ ఉండగా విదర్భరాజచారులలో ఒకడు అక్కడికి చేరుకున్నాడు. అక్కడ హ్రస్వబాహుడని ఒక వంట వాడున్నాడని అతను రథం నడపడంలో గొప్ప ప్రవీణుడనీ, నల తుల్యుడనీ ఆ చారుడు, అక్కడ జనం అనుకుంటుండగా విన్నాడు.

అతను నలుడని భావించి నృపాస్థానంలో ఉండగా వెళ్ళి తమ ప్రభువు చెప్పిన విధంగా—

"బాలాం వనే ప్రసుప్తాం
నృశంస! సంత్యజ్య కుముదినీకాంతామ్,
ప్రాప్యాంబరఖండం చంద్ర!
అదృశ్యః క్వ యాతోఽసి!"

("ఓ చంద్రుడా! అడవిలో నిద్రిస్తుండగా బాలను, కుముదినీ కాంతను వదలిపెట్టి అంబరఖండాన్ని తీసుకొని ఓ నృశంసా! నీవెక్కడకి అదృశ్యుడవై వెళ్ళిపోయినావు?") అన్నాడు.

ఆ మాటవిని అక్కడున్న వారందరూ ఏదో ఉన్మత్త వాక్యాలుగా వాటిని భావించినారు. సూదవేషంలోనున్న నలుడు అక్కడే ఉండి ఇట్లా అన్నాడు:

"క్షీణోంఽబరైక దేశం
చంద్రః ప్రాప్యాన్యమండలం ప్రవిశన్,
కుముదిన్యా యదదృశ్యో
జాతః తత్ కా నృశంసతా తస్య."

(క్షీణుడై అంబరైకదేశం పుచ్చుకొని చంద్రుడు అన్యమండలం ప్రవేశించి కుముదినికి కానరాకుండా పోయినాడు. ఇందులో అతని నృశంసత ఏమున్నది!)

ఈ ఉత్తరాన్ని విని అతను తప్పకుండా నలుడేనని భావించి, ఏదో విపత్తువల్ల విరూపం చెందెనని అనుకొని, ఆ చారుడు అక్కడి నుంచి వెళ్ళిపోయినాడు.

విదర్భదేశానికి వెళ్ళి రాణీతోపాటూ కూర్చున్న భీమ మహా రాజునకు, దమయంతికీ, తాను కన్నదీ విన్నదీ సకల వృత్తాంతాన్ని నివేదించినాడు.

అప్పుడక్కడ దమయంతి తన తండ్రితో ఏకాంతంలో ఇట్లన్నది: "నిస్సందేహంగా ఆయన ఆర్యపుత్రుడే. సూద వేషంతో ఉన్నాడు. ఆయన నిక్కడికి కొనిరావడానికి నాకు తోచిన యుక్తిని చెప్తాను. అలా చేయండి.

ఋతుపర్ణ మహారాజువద్దకు ఒక దూతను పంపండి. అతను ఆయన దగ్గరకు వెళ్ళి ఇలా చెప్పాలి. "నల చక్రవర్తి ఎక్కడికో వెళ్ళిపోయినాడు. ఆయన జాడ తెలియరాలేదు. అందుకై తిరిగీ దమయంతికి స్వయంవరం ఏర్పాటు చేస్తున్నాము. మీరు త్వరగా విదర్భకు రావలసింది. ఇలా చెప్తే రథజ్ఞాని నా భర్తతో, ఆ రాజు ఒకే రోజులో ఇక్కడికి తప్పక రాగలడు.''

ఈ విధంగా తండ్రికి చెప్పగా, ఆ విధంగానే కోసలకు యథోచితంగా దూతను పంపినారు. ఆ ఋతుపర్ణుని దగ్గరకువెళ్ళి అదే విధంగా చెప్పగా అతను ఉత్కంఠితుడై సూద రూపంతో ప్రక్కనే ఉన్న నలునితో ప్రీతితో ఇట్లన్నాడు:

"హ్రస్వబాహుడనైన నాకు రథజ్ఞానం కలదని నీవు పూర్వం నాతో చెప్పి ఉన్నావు. కాబట్టి ఇప్పుడు నన్ను వెంటనే, నీకా సాహసమే ఉంటే, విదర్భదేశానికి తీసుకొని వెళ్ళవలసింది.

ఆ మాట విని నలుడు "తప్పకుండా కొనిపోతాను'' అని చెప్పి వెళ్ళి ఉత్తమాశ్వాలను తీసుకొని రథాన్ని సజ్జీకృతం చేసినాడు. "స్వయంవర ప్రవాదమనేది కేవలం తన్ను రప్పించడం

కోసం పన్నిన పన్నాగంగా కనబడుతుంది. దమయంతి కలలో కూడా ఇలా మారదు. నే నక్కడికి వెడతాను. చూస్తాను" అని తలపోసుకుంటూ ఋతుపర్ణునివద్దకు సజ్జీకృతమైన రథాన్ని తీసు కొనివచ్చినాడు.

రాజు రథారోహణం చేయగానే గరుడజవ జైత్రమైన వేగంతో నలుడు రథాన్ని నడిపినాడు. రథ వేగంతో జారిపోయిన వస్త్రాన్ని చూచి దారిలో నలు డిట్లన్నాడు: "రాజా! నీ వస్త్రం ఎక్కడ పడిపోయినది? ఈ కొన్ని క్షణాలలోనే మన రథం అనేక యోజనాలను దాటివచ్చినది'' అని చెప్పగా ఋతుపర్ణుడిట్లా అన్నాడు:

"నాకు ఈ రథజ్ఞానాన్ని నీవు ఇవ్వవలసింది. నేను నీకు అక్షజ్ఞానాన్ని ఇస్తాను. దానితో నీకు (అక్షాలు ఇంద్రియాలు పాచికలు) వశమౌతాయి. సంఖ్యాజ్ఞానం కలుగుతుంది. నేను ఫల పర్ణాదులను గణించి చెప్పగలను చూడు" అని చెప్పి, పోతుండ గానే ఒక చెట్టుపై ఫలపర్ణాదులు ఎన్ని ఉన్నవో అతను గణించి చెప్పినాడు. అవి అన్నే ఉన్నవి.

అప్పుడు నలుడు రథజ్ఞానాన్ని ఋతుపర్ణునకు తెలియజేసి నాడు. ఋతుపర్ణుడేమో అక్షజ్ఞానాన్ని ఆ నలునకు ఉపదేశించి నాడు. నలుడు కొంతదూరం వెళ్ళి ఇంకొక చెట్టుకు ఎన్ని ఆకు లున్నవో చక్కగా లెక్కించుకొని సంతోషించినాడు.

ఆ తర్వాత అతని శరీరంనుంచి ఒక నల్లటి పురుషుడు బయటికి వచ్చినాడు. "నీ వెవరవు?'' అని అడుగగా అత నిట్ల న్నాడు. "నేను కలిపురుషుడను. నీ శరీరంలో ప్రవేశించిఉంటిని.

దమయంతి నిన్ను వరించెనన్న ఈర్ష్యతో నేనీ పని చేసినాను. అందువల్లనే నీ సంపద అంతా జూదంలో భ్రష్టమైనది.

ఆ తర్వాత ఆ వనంలో కార్కోటం అలా కరవగా నీవు దగ్ధం కాలేదు, కానీ నీలో ఉన్న నేను దగ్ధమైనాను. అనవసరంగా పరాపకారం చేయడం ఎవరికోసమని? కాబట్టి నేను వెళ్ళిపోతాను. నాకు ఇతరులలో ప్రవేశించడానికిక అవకాశం లేదు" అనిచెప్పి ఆ కలి తిరోధానం చెందినాడు.

అప్పుడు జాతధర్మమతి అయి, పూర్వతేజ స్సంప్రాప్తి కలిగి, స్వస్వరూపంతో నలుడు బయల్పడినాడు. తిరిగీ వచ్చి రథాన్నెక్కి ఆ రోజే వేగంగా ఋతుపర్ణ మహారాజును విదర్భకు చేర్చినాడు.

అక్కడ వచ్చిన కారణాదులను చెప్పగా జనం నవ్వు తున్నారు. ఋతుపర్ణుడు రాజగృహ సమీపంలో విడిసినాడు.

ఆయన అక్కడికి రావడం తెలుసుకొని అద్భుత రథస్వరం విని దమయంతి, నలుడు వచ్చెనని సంభావించుకొని, లోలోన సంతోషించినది. అందులోని తత్త్వాన్ని అన్వేషించుటకై తన చేటిని పంపినది. ఆ చేటి అన్వేషించి తిరిగివచ్చి ప్రియునికోసమై ఉత్సుకురాలై ఉన్న దమయంతితో ఇట్లన్నది:

"దేవీ! నేను వెళ్ళి వివరం తెలుసుకొని వచ్చినాను. నీ అసత్య స్వయంవర ప్రవాదం విని కోసలరాజు వచ్చినాడు. హ్రస్వబాహుడనే అతని వంటవాడు రథచోదకుడుగా వచ్చినాడు. ఒక రోజులోనే, రథవిజ్ఞానశాలి గనుక ఇక్కడికి ఆయనను కొనిరా గలిగినాడు.

అక్కడ వంటశాలలోనికి నేను వెళ్ళి ఆ వంటవానిని చూచినాను. అతను నల్లగాను, కురూపిగానూ ఉన్నాడు. అతని ప్రభావ మేమిటో తెలియదు. వంటపాత్రలలో నీరే నింపలేదు. వంటచెరకులకు నిప్పంటించకనే మండుతున్నవి. క్షణంలో ఆ యా భోజనాదులు నిష్పన్నమౌతున్నవి. ఇదంతా చూచి అత్యంతాశ్చర్యంతో నేను తిరిగి వచ్చినాను."

ఈ చేటి మాటలువిని దమయంతి ఇలా తలపోసుకున్నది. "అగ్నివరుణులను వశం చేసుకొన్న వంటవాడు, రథవిద్యా రహస్యవేది అయినవాడు తప్పకుండా ఆర్యపుత్రుడే అయి ఉండాలి. ఏ కారణంవల్లనో వైరూప్యం చెందినాడు. నా వియోగంతో ఆర్తుడై ఉంటాడు. ఆ సంగతిని కూడా తెలుసుకొంటాను" అని సంకల్పించుకొని యుక్తితో ఆ చేటితో పాటూ తన దారకుల నిద్దరినీ అతని అంతికానికి పంపించినది.

తన పిల్లలను చూచి నలుడు ఒడిలో కూర్చుండబెట్టుకొని బాష్పధారలు కారుతుండగా ఊరకే రోదించినాడు. "ఇలాంటి నా పిల్లలే తమ అవ్వగారింటిలో ఉన్నారు. ఆ సంగతి జ్ఞాపకంవచ్చి నా కిలా దుఃఖం కలిగినది" అని ఆ చేటితో అన్నాడు.

ఆ పిల్లలతోపాటూ తిరిగివచ్చిన చేటి, సర్వం దమయంతికి తెలియజేసినది. ఆమెకూడా ఎంతో ఆశావశురాలైనది.

మరునాడు తన చెలికత్తె నిలా ఆదేశించినది: "నీ వా ఋతుపర్ణుని విడిది వద్దకు వెళ్ళి ఆ సూదునితో నా మాటగా చెప్పవలసింది — 'నీతో సమానుడైన సూపకారుడు మరొకడు లేడని విన్నాను. కాబట్టి నీ విక్కడికి వచ్చి నా కొక వ్యంజనం సిద్ధంచేసి ఇవ్వవలసింది — అని.'

"సరే" నని ఆ చేటి అక్కడికి వెళ్ళి నలునితో చెప్పగా, అతడు ఋతుపర్ణరాజు అనుమతిపొంది దమయంతి వద్దకు వచ్చినాడు.

"సత్యం చెప్పవలసింది. నీవు వంటవాని రూపంలో నున్న నలచక్రవర్తివే అయితే సత్యం చెప్పవలసింది. చింతాబ్ధిమగ్నురాలనైన నన్ను తీరం చేర్చవలసింది" అని దమయంతి ఆయనతో అన్నది.

ఆ మాటవిని నలుడు స్నేహ హర్ష దుఃఖ లజ్జాకులుడై, తలవంచుకొని, తగిన కాలం వచ్చినదని అశ్రుగద్గద కంఠంతో ఇట్లన్నాడు: "ఆ నలుడనే నేను. ఇది సత్యం. పాపిష్ఠివాడను. వజ్రకఠోరుడను. నిన్ను సంతపింపజేస్తూ వ్యామోహంతో అగ్నిప్రాయుడనైనాను" అని చెప్పగా దమయంతి ఆయనను తిరిగీ ఇట్లా అడిగినది:

"మరి అలా అయితే ఈ వికృతరూపం ఎలా కలిగినది?"

ఆ మాటవిని నలుడు తన ఉదంతాన్ని సంపూర్ణంగా అభివర్ణించినాడు. కార్కోటక సఖ్యం మొదలుకొని కలి నిర్గమనం వరకు వివరించినాడు. అలాగే అగ్ని శౌచ వస్త్రయుగ్మాన్ని, కర్కోటకుడిచ్చిన దానిని కప్పుకొని తన స్వస్వరూపాన్ని పొందినాడు.

అప్పుడు నలుని చూచి తిరిగీ నిజమనోహర రూపం పొందడంవల్ల, వెంటనే ప్రఫుల్ల వదనారవింద అయి, దుఃఖ దవానలాన్ని బాష్పధారలతో శమింప జేసుకొని, ఒకానొక అపూర్వ హర్షాన్ని దమయంతి పొందినది.

ఇదంతా పరిజనుల మూలంగా తెలుసుకొని విదర్భరాజు గబగబావచ్చి నలుని అభినందించి ఉచిత సత్కారం చేసి, తన పట్టణాన్ని మహోత్సవమయంగా చేసినాడు.

మనసులో సంతోషిస్తూ భీమభూపాలుడు ఉపచార సత్కారాదుల నందింపగా, ఋతుపర్ణ నృపాలుడు నలుని ప్రతిపూజించి తన దేశానికి వెళ్ళిపోయినాడు.

అంతట నిషధ నరేశ్వరుడు తనకు కలిగిన కలి దౌరాత్మ్య విజృంభణాన్ని, మామగారికి అభివర్ణించి చెప్పి ప్రాణాధికురాలైన సఖితో సుఖంగా ఉన్నాడు.

కొన్నాళ్ళ తర్వాత మామగారి సైన్యాలను తీసుకొని నలుడు నిషధకు వెళ్ళి, అక్షజ్ఞానంవల్ల పుష్కరుని తిరిగి వినమ్రుని చేసి, ధర్మాత్ముడై అప్పటికే ద్వాపరుడు వెలుపలికి వెళ్ళిపోయి ఉన్న తమ్మునికి, వాని పాలు వాని కిచ్చి, తన రాజ్యాన్ని తిరిగీ సముపార్జించుకొని దమయంతితో సుఖాల ననుభవిస్తూ యథా పూర్వంగా ఉండిపోయినాడు.

—ఈ విధంగా తారాపురంలో ద్విజుడు రాజసుత అయిన బంధుమతికి ప్రోషిత భర్తృక అయిన ఆమెకు, ఈ కథను వివరించి ఇట్లన్నాడు: "ఓ దేవీ! ఈ విధంగా మహనీయులే ఎన్నో దుఃఖాలపాలై తుదకు కల్యాణాన్ని పొందుతారు. అస్తమయాన్ని పొందిన దినకరుడే తిరిగీ ఉదయించినట్టు, ప్రముఖులు కూడా మహోదయాన్ని పొందుతారు.

కాబట్టి నీవుకూడా నీ పతిని తిరిగీ పొందగలవు. ఎక్కడికో వెళ్ళిన అతను త్వరలోనే రాగలడు. ధైర్యం చిక్కబట్టుకో. అరతిని వీడు. పతికామన లాభాలతో విహరింతువుగానీ'' అని ఆ ద్విజుడు చెప్పగా బహుమానాలతో ధనంతో ఆ గుణవంతుని సమర్చించి, ధైర్యాన్ని చిక్కబట్టుకొని, తన భర్తకోసమై ప్రతీక్షిస్తూ బంధుమతి అక్కడే ఉండినది.

దేశాంతరంలో ఉన్న తన తల్లిని చూచుటకై పితృ సహితుడై వెళ్ళిన మహీపాలుడు కొన్నిరోజులలోనే తిరిగి వచ్చినాడు. చంద్రుడు పూర్ణిమనాడు—వారిరాశి జలలక్ష్మిని పొందినట్టు జననయనోత్సవదాయి అయిన బంధుమతిని సంతోషపెట్టినాడు.

అక్కడ ఆమెతో పాటూ తండ్రి తిరిగి రాజ్యభారాన్ని అప్పగించగా ఆ మహీపాలుడు రాజై ఈప్సితభోగాలను అనుభవించినాడు.

—ఈ విధంగా తనమంత్రి మరుభూతి ముఖంగా చిత్రమూ, నిరుపమానమూ, అనురాగరమ్యమూ అయిన కథను విని భార్యా సహితుడై, వత్సేశ్వర కుమారుడైన నరవాహనదత్తదేవుడు ఎంతో సంతోషించినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో అలంకారవతీలంబకంలో
షష్ఠ తరంగం సమాప్తం.

T. T. D. Religious Publications Series No. : 215

Price : Rs. 10–50



Published by Sri S. Lakshminarayana I. A. S., Executive Officer.
Tirumala Tirupati Devasthanams, Tirupati and Printed at
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.